స్కూలులో ఆరు గంటలు కష్టపడి చదవటం
తరువాత ఆటలు, ఆ తరువాత ఇంటికి వచ్చాకా
మళ్ళీ 2 గంటలు హోంవర్కు.



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమ మైనవి
లభించాలి.
దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్.
మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు
రుచికరమైన బూస్ట్ ఇవ్వండి. రోజంతా
అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని
చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి
లభిస్తుంది. ఎందుచేత నంటే, బూస్ట్ అతి
నాణ్యమైన పదార్థాల మేలిమితో నిండి ఉంది-
మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్,
కోకో.
ఉత్తమ మైనవి ఎన్నడూ చవకగా
దొరకవు. బూస్ట్ కూడా అంతే.
కాని మీరు ఖర్చు తక్కువని










**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

HTD-HMM-7233AA

# విమల్ సఫారి. మీ జీవిత శైలికి సరైన జోడు

సఫారి సూటింగ్‌ను మొట్టమొదటిసారిగా
ప్రవేశపెట్టిన విమల్ నుండి,
ఈ పండుగల సీజనుకై పలురకాల
సూటింగ్స్. చూడండి నేడే సంపూర్ణ
శ్రేణిని మంగళ్‌దీప్‌లో.




**మంగళ్‌దీప్**

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786
ఆంధ్ర ప్రదేష్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

® is the registered trademark of Reliance Textile Industries Ltd.

Mudra/RTI/ 788 TEL

### ముఖచిత్రం

చంకన బిందె నెత్తుకొని తళుక్కుమంటున్న ముక్కుపుడకను ధరించి, కళ్లలో అనురాగము అప్యాయతలనుకురిపిస్తూ, పెదవులపై చిరునవ్వులు చిందిస్తూ ఆంధ్రులఆడపడుచులా ప్రశాంతమైన మోముతో పత్రికను అలరించావు మమ్ములను ఆనందపరిచావు ఓ విజయశాంతీ !

పరిగి నిర్మల (అనంతపురం)

### ధర్మోరక్షతి రక్షితః

మీ ఆంధ్ర పత్రిక వార పత్రికలో ప్రచురించిన సీరియల్ నవల "ధర్మో రక్షతి రక్షితః" ఎంతో చక్కగా, సహజంగా వాస్తవానికి దగ్గరగా రచయిత రాశారు. నాకు పత్రికలో ఈ విధమైన ఉత్తరాలు వ్రాయడం అంత ఇష్టమూ, అలవాటూ కూడా లేవు. ఎప్పుడో 1952 లో శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి "ఉదయ కిరణాలు" నవల ప్రచురించబడింది. తరువాత1959లో శ్రీ పురాణం సూర్యప్రకాశరావు గారు "జీవన గంగ" అనే నవల ప్రచురించబడినది. పై రెండు నవలల తరువాత వేరే తరహాకి చెందిన శ్రీ కందుకూరి లింగరాజుగారి "మనం మిగిలేం"అన్న నవల(మరోవారపత్రికలో1961లో ప్రచురించబడినది.) మినహాయిస్తే, మీ పత్రికలో కానీ, మరింక ఏ పత్రికలో కానీ మంచి నవల సీరియల్‌గా రాలేదనే నా ఉద్దేశము. మంచి కథలకీ, మంచి నవలలకీ సరియైన విలువ, ఆదరణ ప్రస్తుతపు రోజులలో కరువై పోవడం వల్లనే నేమో, రచయితలు కూడా ఈనాటి సరిపోయిన గొడుగులే, పడుతున్నారు (కుక్క గొడుగులా ?)

నేను బ్రాహ్మణ పక్షపాతంతో కాని, మరే విధమైన సంకుచితమైన భావంతో కాని రాయడం లేదు. కాని ఒక్క విషయం నిజం. బ్రాహ్మణ




కులం ముందు ముందు ఒక వెనుకబడిన కులంగా గుర్తించవలసిన పరిస్థితి ప్రభుత్వము యొక్క అవక తవక విధానాలవల్ల ఏర్పడబోతోంది. గొప్ప అంటే చెప్పలేను గాని, ఎప్పుడో బ్రాహ్మణులు ఇతరులను హీనంగా చూసి ఉండవచ్చునేమో ! కాని తరువాత తరువాత సాంఘిక పునరుజ్జీవనంకోసం ప్రచారం చేసి, ఎనలేని త్యాగాలు చేసిన వారిలో ఎక్కువమంది బ్రాహ్మణులే అన్న సత్యం మరువ కూడదు. కందుకూరి, చిలకమర్తి, చలం, నాగేశ్వరరావు పంతులు, గురజాడ, ప్రకాశం, కళా, పట్టాభి, తెన్నేటి మొదలు, నిన్నటి గోరా, నేటి శ్రీ శ్రీ, ఆరుద్ర, రావి శాస్త్రి, చాసో, కుటుంబరావు, ఇంకా ఇంకా వీరంతా బ్రాహ్మణులే కదా ? పై వారి ప్రబోధన వల్ల బాగుపడి నది వెనుకబడిన కులాలవారూ, బ్రాహ్మణేతర అగ్ర కులాలవారూ మాత్రమే. వారందరికీ అబ్బితే చదువు, అబ్బకపోతే కుల వృత్తులూ ఉన్నాయి. ఆస్తులూ ఉంటాయి. ఒక్క బ్రాహ్మణులకే ఈ రెండూ లేనిదీ, చెడిపోయినదీ. ఇంత పెద్ద ఉత్తరం పత్రికాధిపతులు, వ్యాపార కారణాలవల్ల ప్రచురిస్తారో లేదో తెలియదు.

ఏమైనా రచయిత శ్రీ ఆకెళ్ల వెంకట సూర్యనారాయణగారికి నా హృదయ పూర్వక అభినందనలు అంద చేయవలసినదిగా కోరుతున్నాను.

సి. హెచ్. గుర్రాజు (ధవళేశ్వరం)


త్వరలో ప్రారంభం !

"జీవన్ మృతులు"

మూలం :
బ్రామ్ స్టోకర్

తెలుగు :
కొలను వెంకట దుర్గాప్రసాద్


విజయభాస్కర్ గారి ఉత్తరం చదివాక ఈ లేఖ వ్రాయక తప్పలేదు. కేవలం 15 శాతం రిజర్వేషన్ల వల్ల జాతికి ఏం నష్టం ముంచుకొస్తుందని అందులో వాదించారు. మించిన అర్హత ఉన్న వారికి అవకాశము లేక, తక్కువ అర్హత కలవాడికి అవకాశం కల్పిస్తున్నప్పుడు తప్పక క్వాలిటీ స్థాయి తగ్గుతుంది, ఏ మేరకైనా సరే.

భాస్కర్ మరో మాట అన్నారు. ఒక హరిజనుల గురించే రచయిత వ్రాశారు. మిగతా రిజర్వేషన్ వర్గాల సంగతేమిటని. అంటే వారిని నిందించారు గాబట్టి వీళ్లనీ తిడితే తప్ప తృప్తి కలగదా! రచయిత ఒక నిజం చెబితే దాన్ని సమర్థించుకోవటం కంటే అవునా? కాదా?— అని ఆత్మవిమర్శ చేసుకొనటంలోనే ఔన్నత్యం ఉంది. ఈ విషయం గమనించండి, హరిజనులుగా జన్మించినందుకు హాస్టల్ ఫ్రీ, బుక్స్ ఫ్రీ, ఫీజులు ఫ్రీ. ఇవి చాలవన్నట్లు వయోపరిమితి సడలింపు, లీస్ట్ క్వాలిఫికేషన్, నో అప్లికేషన్ ఫీజు. యిన్ని సదుపాయాలిచ్చి పైకి తేవాలని ప్రభుత్వం ప్రయత్నిస్తుంటే ఈ అవకాశాన్ని సద్వినియోగం చేస్తున్నారా?

ఎన్. వి. డి. మూర్తి (ఒంగోలు)

### వనితలు–వస్త్రధారణ

న్యూఢిల్లీ లేఖలో డాక్టర్ జయ్ దుబాషి నిజాన్ని వివరించారు. వనితలు—వస్త్రధారణ— కె. విజయలక్ష్మిగారి వ్యాసం చాలా బావుంది. మల్లెలమాసం కథ పాతదే అయినా కథనంలో సింగరాజు రామచంద్రమూర్తి గారు వెరైటీ చూపించారు.

వి. వి. వి. సూర్యనారాయణ (లింగపర్తి)

* * *

వనితలు వస్త్రాధారణ శీర్షిక బాగుంది.

వై. హేమసుందర్‌రావు, హేమబిందు, ప్రియ (డోర్నకల్

(66 వ పేజీ చూడండి)


పై వారమే!

దసరా సంచిక

విద్యార్థిలోకం వ్యాసరచన పోటీ ఫలితాలు!

ప్రత్యేక కార్టూన్‌లు, వ్యాసాలు, శీర్షికలు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం : 29-10-'82

దుందుభినామ సం. నిజాశ్వీయుజ శు.ద్వాదశి

సంపుటము 75 : సంచిక 9

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు. 42–90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85–80

విడి ప్రతి వెల రు. 1–50

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

''కొత్త నీరు''లో దీప

### కథలు :



### సీరియల్ నవలలు :



### వ్యాసాలు, శీర్షికలు :



లోకంపోకడ



# మహారాణాలు - ప్రధానమంత్రులు

ఒక భారతీయుడిని ఎవరినయినా అడగండి, "ఎలా ఉన్నా"వని; పదిమందిలో తొమ్మండుగురు "ఏదో నెట్టుకొస్తున్నా" మంటారు. అతనికి అంతకి ముందే లాటరీలో 10 లక్షల రూపాయలు వచ్చి ఉండవచ్చు, జీతం బాగా పెరిగి ఉండవచ్చు – కాని ఇలాగే మాటలాడతారు. ప్రధానమంత్రి నుంచి కిళ్ళీకొట్టు యజమాని దాకా అందరిదీ ఇదే పాటగా ఉంటుంది. ప్రధానమంత్రిగానే ఉండిపోదామని శ్రీమతి గాంధీ యాతన – ఆమె ప్రయత్నాలు కొన్ని సందర్భాలలో మరీ విడ్డూరంగా తోస్తాయి. ఆమె అలాగయితే ఆమె మంత్రులూ అంతే. అసలు కాంగ్రెసు ( ఇందిర ) పార్టీ రాజకీయ వాదులే అంత. యశ్వంతరావు చవానూ అంతే, దినేష్ సింగూ అంతే, బతికి ఉంటే బలుసాకు తినవచ్చు, మునిగితే అదీ లేదు కదా ? అంతూలేకి ఈ సత్యం బాగా తెలుసు.

ఎప్పుడూ ఇలాగే ఉండేదా ? ఉండేది కాదు. ఈ మధ్యనే నేను ఉదయపూర్ వెళ్ళివచ్చాను. మేవార్ ముఖ్య నగరమయిన ఉదయపూర్. ఇది రాణాప్రతాప్‌సింగ్ రాజధాని అని అందరికీ తెలుసు. ఆయన్‌దేకాదు ఇతర వీరుల ఊరు కూడా. మేవార్ ప్రాంతం వాళ్ళ ప్రాంతం. కొన్ని చోట్లలో పాములు బతికటం కూడా కష్టమే అన్నట్లుగా ఉంటాయి. కాని ఈ రాళ్ళలోనే మేవార్ రాజులు పన్నెండు, పదమూడు వందల సంవత్సరాలు పాలించారు మేవార్ ఒక గొప్ప రాజ్యం. ఇంతకన్నా ఏమీ చెప్పనక్కరలేదు ఈ రాజ్యాన్ని గురించి. ఇక ఉదయపూర్ ఎంత చక్కని ఊరు ! అంతా కొండలూ, సరస్సులూ. ఈ చెరువులలో ఎక్కువగా మనుషులు తవ్వినవే. ఒక పక్క శత్రువులతో పోట్లాడుతూనే ఈ సరస్సులని నిర్మించారు. మేవాడ్ రాజపుత్రులు. వారికి "నెట్టుకు రావటం" అన్న మాటకి అర్థం తెలీదు. వారు రాజులు, ఏలినవారు.

ఈ నెట్టుకు రావటం అనేది భారతదేశం రోగ లక్షణాలలో ఒకటి దాదాపు పన్నెండు వందల సంవత్సరాలుగా భారతీయులు చేస్తున్నది ఇదే – నెట్టుకు రావటం. ముందు తురుష్కుల దాడి, తరువాత పఠానుల దాడి, ఆ తరువాత మొగల్‌లు, చివరికి బ్రిటీషువారు – వీరందరి దెబ్బలూ తగిలినా నెట్టుకు వస్తున్నారు. తురుష్కుల దేశం భూగోళ చిత్రపటంమీద ఒక పేరు; అఫ్గనిస్తాన్‌ని కాస్తా రష్యా వారు కబళించారు; బ్రిటన్‌కి గడ్డురోజులు వచ్చాయి భారతదేశం ఒకటే ఇంకా నెట్టుకు వస్తోంది నెట్టుకు రావటమే కాదు గౌరవంగా నెట్టుకు వస్తోంది. ఆసియాలో కెల్లా బలవంతమయిన ప్రజాస్వామ్యం భారతదేశమే – శ్రీమతి గాంధీ, ఆమె వెంట రౌడీలు ఉన్నాసరే. మనని మనమే తక్కువగా చూసుకోవటం మానుకుంటే భారతదేశం ప్రపంచంలో కెల్లా బలవంతమయిన దేశం కాగలదు యూదుల




లాగే హిందువులు కూడా నెట్టుకుంటూ రానేవచ్చారు. యూదులు అరబ్బులందరినీ కలిపి ఓడించారు. మనం ఎందుకు వెనకపడాలి ?

మేవార్ రాజులవి గొప్ప మనసులు. వారి చేతలు వారి మనసులకి తగినవే. దుర్గాలు నిర్మించారు, భవనాలు కట్టుకున్నారు, అద్భుతమయిన పాలరాతితో చెక్కడాలు కల ఆలయాలని ప్రతిష్ఠించారు. ఉదయపూర్‌కి సుమారుగా 100 కిలోమీటరుల దూరంలో, అడవుల మధ్య రాణక్‌పూర్ ఉంది. ఇక్కడ 1440 స్తంభాలు కల పాలరాతి గుడి ఉంది, ఇది జైనాలయం. అడవుల మధ్య ఉంది కనుక మహమ్మదీయ దండుల చేత పడలేదు. ఇది తయారవుతున్న కాలంలో అన్నివయిపుల నుంచీ శత్రు సేనలు దాడి చేస్తూనే ఉండి ఉండాలి. అయినా ఆలయాన్ని నిర్మించిన శిల్పులు తమ పనిలో తాము నిమగ్నులయ్యారు. స్తంభాలు చెక్కారు, పయి కప్పులు లేపారు, నెట్టుకు రాగలమా అన్న చింతనే వదలి తమ విధులలో మునిగిపోయారు. వారికి కేవలం ప్రార్థన చేసే మందిరం కాదు కావలిసింది. అంతే చాలు అనుకుంటే వారు ఏ చిన్న గుడినో కట్టుకునేవారు కదా ? కాని వారి పద్ధతి వేరు. వారి కల్పనలు విశాలమయినవి. వారి కల్పనలకి వారి రాజుల బాసట ఉండేది. బాసటే కాదు సంరక్షణ కూడా ఉండేది విరోధులతో పోట్లాడి వారిని దూరంగా ఉంచి ఈ గుళ్ళ నిర్మాణానికి వీలు కల్పించారు మేవార్ రాజపుత్రులు.

నేటి సంగతే వేరు. మనని పాలించే వారి దృష్టి సంకుచితమయినది. వారు తమ ముక్కుని దాటి చూడలేరు, రేపటికన్నా ముందు ఆలోచించలేరు నేను మేనకా గాంధీ అభిమానిని కాను ఆమె భర్త అన్నా, ఆయన నిరంకుశ భావాలన్నా నాకు ఇష్టం లేదు కాని ఇంత పెద్ద దేశపు ప్రధానమంత్రి పని గొట్టుకుని పోలీసు వారందరినీ వాడి ఒక ఈగని చంపటానికి ప్రయత్నించాలా ?! ఈ దేశంలో ఇంకా కొన్ని వ్యక్తిస్వాతంత్ర్యాలు ఉన్నాయి, (లేవని అధికారంలో ఉన్న పార్టీ వారు అనుకోవచ్చు, అది వేరే సంగతి.) మేనకా గాంధీ తన భావాలకి ప్రచారం కల్పించుకోవాలంటే ఆమెకి అడ్డుపడటం దేనికి ? (ఆమెకి భావాలు ఉన్నాయా ? అని ఎవరయినా అడగవచ్చు. వారికి ఉన్న సందేహమే నాకూ ఉంది.) శ్రీమతి గాంధీ కుటుంబ సమస్యల పరిష్కారానికి రాజ్యాధికారాన్ని వాడటం సబబేనా ? సబబు కాదు కాని శ్రీమతి గాంధీ పద్ధతే అంత. ఆమె పదవికి ముప్పు వచ్చిందనిపిస్తే ఆమె ఏమయినా చేస్తారు. ప్రధానమంత్రి అంతటి వారు రాజ్యాధికారాన్ని సొంతానికి వాడితే అబ్దుల్ రెహమాన్ అంతూలే, జగనాథ మిశ్రాలు ఎందుకు వాడరు ? వాళ్ళకీ నెట్టుకు వస్తే చాలునన్న వాదం బాగా తలకెక్కి ఉంటుంది కదా ?

ఢిల్లీలో జరిగేదంతా మీకు కష్టం కలిగిస్తే ఉదయపూర్‌కి వెళ్ళండి, లేదా రాణక్‌పూర్‌కి వెళ్ళండి, లేదా చిత్తూర్‌కి వెళ్ళండి ! అన్ని ఊళ్ళకీ వెళ్ళండి ! ఢిల్లీ నుంచి నీటి దూరం కొన్ని వందల కిలోమీటరులు మాత్రమే ఇది ఒక రకమైన దూరం. ఇంకొక రకం దూరం ఉంది. అది కాలంలో

CHAITRA-G-120 TEL

# త్రివిధచర్యగల ట్రైలో నీలి డిటర్జెంట్ బిళ్ళ

## మరే ఇతర పేరెన్నికగన్న డిటర్జెంట్ బిళ్ళలకన్న 25% ధర తక్కువ




ట్రిలో వలన ఎంతో బాగుగా నురుగు—గనక మీరు మరెన్నో బట్టలను ఉతికేవీలు, మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ కన్న ఎక్కువగా!

ట్రిలో మరెంతో బాగా ఉతుకుతుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా ఉతికే శక్తి గలది. మీ బట్టలు తెల్లగా, కాంతివంతం ఉండేలా చేసేందుకుగాను నీలి మందు జతపర్చబడింది.



ట్రిలో ఎంతో కాలం అది వస్తుంది— ఇది ముద్దగా అయిపోదు గనక పూర్తిగా అరిగిపోయేదాకా వాడే వీలు.

త్రివిధ చర్యగల కొత్త ట్రిలో మరెంత మేలైనదో చూడండి!

**గోద్రెజ్** ఉత్పాదన

## దీర్ఘవ్యాధులకు ఉత్తమ వైద్యం

దురభ్యాసములకు లోనై, దాంపత్యసౌఖ్యం పొందలేనివారికి హెర్నియా, చర్మవ్యాధులకు పోష్టుద్వారా వరిబీజం(బుడ్డ) ఇస్నోఫీలియా ఉబ్బసం (దమ్ము) జీర్ణాశయ(గ్యాస్ట్రిక్) మూత్ర,స్త్రీల వ్యాధులకు ఆపరేషన్ లేకుండా చికిత్స చేయబడును. -రండి

డా॥ దేవర

3/1 బ్రాడీపేట, గుంటూరు. (A.P)

తలనొప్పి
జలుబు, ఫ్లూజ్వరము
పంటినొప్పి
ఒళ్ళునొప్పులకు

SUVARNA

పేన్‌జోన్®

తీసుకోండి
సత్వర బాధా నివారణ పొందండి


## న్యూఢిల్లీ లేఖ

దూరం కాలంలో ప్రమాణమే ఇక్కడికి వెడితే, కొండ ఎక్కి మహారాణా ప్రతాప్ విగ్రహాన్ని చూడండి. ఆయన ఆరడుగుల ఎనిమిది అంగుళాల మనిషి; అంత మనిషిని మోసే అశ్వం చరిత్ర ప్రసిద్ధమయింది. రాణాప్రతాప్ విగ్రహం అంటే ''చేతక్'' అశ్వం మీద కూర్చున్నట్లు చేసిన విగ్రహమే! రాణక్‌పూర్‌లో ఒక అశోక వృక్షపు ఛాయలో కూర్చోండి! చిత్తూర్ కోటలోని విజయ స్తంభం ఎక్కండి! నాథ్ ద్వారా క్షేత్రానికి వెళ్ళండి, భక్తుల గుంపులని చూడండి! తిరుపతికి వెళ్ళండి! అక్కడా భక్తుల గుంపులని చూడండి! ఉదయపూర్ పక్కనే ఏక్‌లింగ్‌జీ ఆలయం ఉంది యుద్ధానికి వెళ్ళేముందు మేవార్ రాజులు ఈ దేవుడిని దర్శించుకుంటారు. దర్శనం చాలా నిరాడంబరంగా జరుగుతుంది. అతి సాధారణమయిన దుస్తులలో, వంటినిండా విభూతి రాసుకుని మరీ దర్శనం చేసుకునేవారు తమ కులదైవమయిన ఏక్‌లింగ్‌జీని ఆ రాజులు.

భారతదేశం అంటే అణుశక్తి కేంద్రాలు, ఉక్కు కర్మాగారాలు, అంతరిక్ష నావలు, పెట్రోలు బావులు; భారతదేశం అంటే పుణ్యక్షేత్రాలూ, గొప్ప వీరులు కూడా. అసలు భారతదేశం అంటే ఇవంతానూ. మహారాణా ప్రతాప్, శివాజీ మహారాజు లాంటి వారు ఏలినప్పుడు భారతీయులు అభివృద్ధి చెందారు. వారివి దొడ్డ మనసులు, బ్రిటిషు వారి కాలంలో వారు క్షీణించి పోయారు. అప్పుడు వారి మనస్సులు శుష్కించుకు పోయాయి.

శ్రీమతి గాంధీ ఒకసారి చిత్తూరు వెళ్ళాలని నా కోరిక, మెట్లెక్కి కోటని సందర్శించాలి ఆవిడ. నేను అంతపనీ చేశాను. పయికి వెళ్ళి రాణి పద్మిని భవంతి దగ్గిరే ఉన్న ఒక చిన్న ఇంట్లో ఉంటున్న ఒక వృద్ధురాలిని తాగేందుకు నీరు ఇవ్వమని అడిగాను, ఆమె ఒక వెండి గ్లాసులో నీరు తీసుకువచ్చి ఇచ్చింది. అది చెప్పలేనంత అందమయిన పాత్ర. అంత చక్కగా చెక్కడాలు కలిగి ఉంది. దాన్ని చూడగానే నా దాహమంతా మాయమయింది, కాలం స్తంభించినట్లయింది.

గత కాలం వర్తమానాన్ని కలుసుకున్నప్పుడు జరిగేది అదే కదా! మరి భవిష్యత్తు సంగతి ఏమిటీ ... ?










బైద్యనాథ్
చ్యవన్‌ప్రాశ్
స్పెషల్

- శరీర కండరములను బలపరుచును. శక్తివంతముగా చేయును.
- శరీరమునకు శక్తిని ప్రసాదించి రోగ క్షమతను కలుగచేసి, పునరుజ్జీవనము కలుగ చేయును.
- దగ్గు, జలుబు మొదలగు శ్వాసకోశ వ్యాధులనుండి కాపాడును.
- పాండు, మరియు కాల్షియం తగ్గుదలలో అత్యంత ప్రయోజనకారిగా నుండును.
- సహజమైన వనమూలికలచే తయారు చేయబడి నందున సులభముగా జీర్ణమగును.




కుటుంబాని కంతటికీ
ఉత్తమమైన ఆయుర్వేద టానిక్

INTERMARK/CHS/13T

# జోస్యం

సుజీదేవ సుందరరామయ్య

BOMMAN

విదేశీ పర్యటనను దిగ్విజయంగా ముగించుకొని ఆ రోజే ఆఫీసులో అడుగుపెట్టాను. ఎన్నో సంవత్సరాల తర్వాత ఆఫీసును చూస్తున్న అనుభూతి కల్గింది. దాదాపు రెండు గంటలవరకు నాకు తీరిక దొరకలేదు. స్టాఫ్ మెంబర్స్ అందరూ నా ఛాంబర్‌లోకి వచ్చి పరామర్శించి వెళ్ళున్నారు. నామీదవున్న గౌరవాభిమానాలతో పరామర్శించటానికి వచ్చినవాళ్ళు కొందరైతే, నా విదేశీ అనుభవాలను తెల్సుకోవాలనే కుతూహలంతో వచ్చిన వాళ్ళు మరికొందరు. పరామర్శించకపోతే సభ్యతగా ఉండదేమోనని భయభక్తులతో వచ్చినవాళ్ళు ఇంకొందరు. అయితే ఇవేవీ లేకుండా కేవలం ఆఫీసు పనిమీదనే వచ్చిన వ్యక్తి ఒకే ఒక్కరు. అతని పేరు ఆనందరావ్. క్లెయిమ్స్ డిపార్ట్‌మెంట్ ఆఫీసర్.

విష్ చేస్తూ నా ఛాంబర్లోకి వచ్చాడు.

'ఎప్పుడొచ్చారు? మీ ట్రిప్ - బాగా జరిగిందా? ఇది చాలా అర్జంటుగా సెటిల్ చెయ్యాల్సిన క్లెయిమ్ సార్!'' అంటూ ఓ ఫైలును టేబుల్‌మీద పెట్టి నా సమాధానం కోసం ఆగకుండా ''ఎక్స్‌క్యూజ్‌మీ సార్!, బయట క్లయింట్స్ వెయిట్ చేస్తున్నారు.'' అని బాణంలా బయటకు దూసుకుపోయాడు.

ఆనందరావ్ తత్వం నాకు బాగా తెల్సు! మనిషి ఎంతో తక్కువగా మాట్లాడుతాడు. అయితే వర్క్ మాత్రం ఎంతో ఎక్కువగా

చెప్తాడు. సాధారణంగా అతనివద్ద పెండింగ్ ఫైల్స్ వుండవు. సిన్సియారిటీ అనే మాటకు అర్థం అతనిదగ్గరే నేర్చుకోవాలి. అలాంటి వ్యక్తి సర్వీసెస్ లభించటం చేతనే హెడ్డాఫీసులో మా డివిజన్‌కు ప్రత్యేక గౌరవం, గుర్తింపు లభించాయి. గత మూడేళ్ళగా బెస్ట్ డివిజన్‌గా గుర్తింపు కల్గి షీల్డును కూడా సంపాదించుకొన్నాము. ఆనందరావ్ అంటే నాకో ప్రత్యేకమైన అభిమానం వుంది. అంతకుమించి కాన్ఫిడెన్స్ వుంది అతను పుటప్ చేసిన 'నోట్'ను చదవకుండానే సంతకాలు పెట్టిన సంఘటనలు ఎన్నో వున్నాయి.

బజ్జర్ నొక్కాను. హెడ్‌ప్యూన్ సిద్దయ్య లోపలికివచ్చి చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

"ఐస్ వాటర్ కావాలి!" అన్నాను.

"అలాగేసార్!" అంటూ టేబుల్‌మీదున్న గ్లాసును తీసుకొని బయటకు వెళ్ళాడు.

టేబుల్‌మీద పేపర్లన్నీ చిందరవందరగా పడి వున్నాయి. వీటిని పరిశీలించాలంటే కనీసం రెండు, మూడు రోజులు పట్టవచ్చు!

సిద్దయ్య అందించిన ఐస్ వాటర్ త్రాగి ఆనందరావ్ యిచ్చిన ఫైలును మెల్లగా తెరిచాను.

ఫైల్లో వున్న ఫోటోను చూడగానే కొయ్యబారిపోయాను.

కలా? నిజమా ?

వణుకుతున్న చేతులతో పేజీలు త్రిప్పాను. పేరు చూశాను.

అక్షరాలు మసక మసకగా కన్పించాయి. చ... క్ర... పా... ణి...

* * *

ఆ రోజు దీపావళి...

ప్రొద్దున్నే స్నానం ముగించుకొని కార్లో చక్రపాణి యింటికి వెళ్ళాను.

వాళ్ళింటిముందు కారు పార్క్‌చేసి హారన్ మోగించేసరికి లోపల్నుంచి చక్రపాణి హడావుడిగా పరిగెత్తుకు వచ్చాడు నన్నుచూడగానే ఎంతో పొంగిపోయాడు. సాదరంగా లోపలికి తీసుకెళ్ళి వరండాలోవున్న కుర్చీచూపించాడు.

'ఈ పండక్కి నీవు వస్తావనుకోలేదు!' అన్నాడు చక్రపాణి నా ఎదురుగాకూర్చుంటూ.

'నాక్కూడారావాలనిలేదు!కాని అన్నపూర్ణ ఈ పండక్కి మనం విజయవాడ వెళ్ళాల్సినదేనండీ — అని పట్టుబట్టింది.

# జోస్యం

దట్సాల్! ఇలా వచ్చేశాను భార్యాపిల్లల సమేతంగా!'

'మంచిపని చేశావ్! నీవు నిజంగా అదృష్టవంతుడివోయ్!'

'ఎందుకట?' నవ్వుతూ అడిగాను.

'మీ మామగారికి ఏకైక అల్లుడివి! అల్లుణ్ణి వెదకాల్సిన వయసు వచ్చినా ఏంచక్కా ప్రతి పండక్కీ కొత్త అల్లుడిలా అత్తారింటికి రావచ్చు!' అన్నాడు చక్రపాణి నవ్వుతూ.

'వెల్‌సెడ్!' అంటూ గట్టిగా నవ్వేశాను.

'దండాలు దొరా!' అన్న కంఠం వినగానే గుమ్మంవైపు చూశాను.

ఎదురుగా కోయదొర!

## మాట్లాడే ఫ్రిజ్

జపానులోని షిన్ ఎలక్ట్రిక్ కంపెనీ వారు మాట్లాడే ఫ్రిజ్‌ను తయారు చేశారు. దీనికి రెండుతలుపులుంటాయి. వీటిని సరిగ్గా మూసి వుంచకపోతే 30 సెకనులతర్వాత "తలుపుతీసిఉంది" అనిహెచ్చరిస్తుంది. తలుపులను 1950 సార్లు తెరవడం, మూయడం జరిగిన తరువాత లోపల వున్న పదార్థాలను తొలగించమని సలహా ఇస్తుంది. ఈ సందేశాల వలన విద్యుత్తు వృధా కాకుండా అరికట్టవచ్చు.

పర్మిషన్ తీసుకోకుండా వాడలా లోపలికి రావటం నాకు నచ్చలేదు. నాకు విపరీతమైన కోపం వచ్చింది. కాని చక్రపాణి లేచి వాడికి ఎదురువెళ్ళి 'సౌఖ్యమా ?' అని పరామర్శించటంతో అంతకుముందే వాడితో పరిచయం వుంది కాబోలు అనుకొని మౌనంగా కూర్చుండిపోయాను.

కోయదొర కొంచెం ముందుకు వచ్చి నేలమీద కూర్చున్నాడు.

చక్రపాణి అతని కెదురుగా కూర్చున్నాడు.

చక్రపాణి చేతిని వాడి చేతిలోకి తీసుకొని వివిధ కోణాలలో పరిశీలించసాగాడు. కాస్సేపు మౌనంగా వుండి ఎవరినో ధ్యానిస్తున్నట్లు కళ్ళు మూసుకొన్నాడు.

'మంచి రోజులొస్తున్నయ్ దొరా మాయమ్మ మహలచ్చి మీ నట్టింట అడుగు పెడ్తది దొరా! మోటారు ఫీల్డులో మా దొరా లక్షలు సంపాయిస్తవు! ఇది ఈ కోయదొర మాట కాదు దొరా! మా కొండదేవర వాక్కు దొరా! నా వాక్కే నిజమైతే పట్టుబట్టలు పెట్టించండి ఈ కోయదొరకు! జయము దొరా! జయము!'

'నీ చేయి కూడా చూపిస్తావా ?' అని అడిగాడు చక్రపాణి.

"నాకు అర్జంటుపనివుంది అయినా వీటిమీద నాకు నమ్మకంలేదు!' అన్నాను.

'అదేమిదొరా! ఈ కోయదొర జోస్యాన్నే అనుమానిస్తుంటిరా! నా సంగతి ఎరుక లేదా దొరా నీకు!' నా వైపు చూస్తూ సీరియస్‌గా అడిగాడు.

'అదేంకాదు కాని నా కిప్పుడు టైమ్ లేదు!' అని వాడికి సమాధానంచెప్పి 'పాణీ! ముందు అతన్ని పంపించిరా! నా కోసం ఇంటిదగ్గర అన్నపూర్ణ ఎదురు చూస్తుంటుంది నేను త్వరగా వెళ్ళిపోవాల్సి!'అన్నాను.

చక్రపాణి ఇంట్లోకి వెళ్ళి డబ్బులు తీసుకువచ్చి కోయవాణ్ణి సాగనంపి వచ్చాడు.

నేను టీపాయ్ మీదున్న మాగజైన్‌లో పేజీలు త్రిప్పసాగాను.

చక్రపాణి నాకు కాఫీ కప్పు అందిస్తూ అన్నాడు 'చూడు బ్రదర్! ఈ లోకంలో ప్రతి మనిషికి ఏదో ఒక అపురూపమైన విద్యనిస్తాడు దేవుడు, కేవలం వేషభాషల ద్వారా మనిషి విలువను అంచనా వేయకుండా అతనిలోని గూఢమైన మహత్తర శక్తిని గుర్తించి గౌరవించటం మనం నేర్చుకోవాలి!'

'నీవు చెప్పేది ఆ కోయవాణ్ణి గురించే కదూ!'

'అవును'

'వాళ్ళ సంగతి నాకు బాగా తెల్సు! సినిమాయాక్టర్లతోను, మంత్రులతోను తాము తీయించుకొన్న ఫోటోలను, చూపించి ఏవో నాల్గు తియ్యని కబుర్లుచెప్పి మోసం చేస్తుంటారు!'

'వాళ్ళకసలు జోస్యం తెలీదంటావా ?'

'జోస్యం సంగతెలావున్నా మనుషుల మనస్తత్వాలను, బలహీనతలను కనిపెట్టే తెలివితేటలు అపారంగా వుంటాయి. మాటల్లోకి దింపి మనసులోని భావాలను, భయాలను, అనుమానాలను, వ్యక్తిగత

సమస్యలను తెలివిగా వెలికిలాగి మనకు అనుకూలంగా మన మనస్సులు తృప్తిపడేలా జోస్యం చెబుతారు. ఎదుటివాడు అమాయకు డైతే చెప్పనక్కర్లేదు. రక్షరేకులనీ, అడవి చెట వేళ్లని ఏవేవో అంటగట్టి డబ్బు చేసుకొంటారు?'

'ఇంతకూ నీ కసలు జోస్యం అంటే నమ్మకం వుందా?'

'నమ్మకం వుందనిగాని, లేదనిగాని తేల్చి చెప్పలేను ఎవరి నమ్మకాలు వారివి! కొన్ని కొన్ని సంఘటనలు జరగటం వలన కొన్ని కొన్ని అభిప్రాయాలను మనం ఏర్పరచుకొంటాం! నన్నడిగితే భవిష్యత్తును గురించి తెల్సుకోకుండా వుండటమే మంచిది రేపు మంచి జరుగు తుందన్న ఆశే మనిషిని ముందుకు నడి పించాలి ప్రతి సూర్యోదయ శుభాన్ని సూచించి నవచైతన్యానికి నాంది కావాలి! అంతేకాని ఇలా జోస్యం చెప్పించుకొని భవిష్యత్తులో కల్గే బాధల గురించి భయ పడుతూ జీవించటం మహా దారుణం!'

'బాధలే కల్గుతాయని ఎందుకనుకోవాలి! జోస్యం వలన కూడా భవిష్యత్తు పట్ల ఆశ కలుగుతుంది కదా!'

'ఆశకాదు! పేరాశ కల్గుతుంది. ఆ తదుపరి ఆశలు ఫలించలేదన్న నైరాశ్యం కల్గుతుంది. అందుకే నా సిద్ధాంతం ప్రకారం కష్టాన్నయినా సుఖాన్నయినా అనుభవించ టానికి సిద్ధంగా మనం వుండాలి కాని ఈ జోస్యాన్ని నమ్మకోటం మంచిదికాదు.'

'అది నీ సిద్ధాంతం! కాని బదర్! ఈ కోయదొర లోగడ నాకు చెప్పిన విషయాలు చాలా నిజమయ్యాయి!'

'అయితే కంగ్రాట్స్! త్వరలోనే మోటార్ ఫీల్డులో లక్షలు సంపాయిస్తావన్నమాట!' అన్నాను పరిహాసంగా.

'మనిషి జీవితంలో ఎప్పుడు ఎలాంటి మార్పులు వస్తాయో మనం వూహించలేం! వాడు చెప్పింది నిజం కాదని ఎందుకను కొంటున్నావ్?'

'మై డియర్ పాణీ! వాడి జోస్యానికీ నీ జీవితానికి ఏమైనా సంబంధంవుందా? నువ్వు రైల్వేలో జాబ్ చేస్తున్నావ్! వెనుక ఆస్తి పాస్తులు లేవు. ఇక మోటారు ఫీల్డులో నీవు లక్షలు సంపాదిస్తావన్నాడు. యిూ జిట్ పాజిబుల్? నువ్వేమైనా టాక్సీల ఓనర్వా? లారీల యజమానివా? వాడి జోస్యం వెనుక ఓ లాజిక్ వుంది. మీ యింటిముందున్న కారు వాడి కంటబడింది. బహుశా అది మీ కారేనని భ్రమపడి ఓ కథ అల్లేశాడు!'

'నాకు కారు వున్నదీ లేనిదీ వాడికి బాగా తెల్సు! నా కసలు మోటారు ఫీల్డుతో సంబంధమే లేదని అంటున్నావ్ కదూ! ఫర్ యువర్ ఇన్‌ఫర్‌మేషన్ చెబుతాను విను! బ్యాంక్ లోన్ పెట్టాను. త్వరలోనే మోటార్ సైకిల్‌ను కొనబోతున్నాను. ఆ తర్వాత ఓ టాక్సి ..'

'ఆ తర్వాత ఓ లారీ... అలా అలా లక్షలు సంపాదించబోతున్నావ్ కదూ!'

'నీకంతా హాస్యంగానే వుంది! చూడు బదర్! ఆ కోయదొర జోస్యం ఏనాటికైనా నిజమౌతుంది. నీ కళ్లెదుటే నేను కనీసం లక్షయినా సంపాదిస్తాను. ఈ గీతలెప్పుడూ అబద్ధం చెప్పవు సుమా!' అంటూ తన అరచేతిని నా కళ్లకు దగ్గరగా వుంచాడు పాణి.

* * *

"సార్! మీ కళ్లలో ఆ నీళ్లేమిటి?" అన్న ప్రశ్న వినగానే గతం నుండి తేరు కొన్నాను.

ఎదురుగా ఆనందరావ్ నిలబడి వున్నాడు.

"మిస్టర్ ఆనంద్! ఈ లారీయాక్సిడెంట్‌లో మరణించిన వ్యక్తి ఎవరో తెలుసా?"

"చక్రపాణని రైల్వే వుద్యోగి!"

"నీకు అంతవరకే తెలుసునయ్యా! కాని అతను నా ప్రాణ స్నేహితుడు! ఒకే వూళ్లో పుట్టాం! ఒకే స్కూల్లో చదివాం! ఆర్థిక ఇబ్బందులవలన అతని చదువు స్కూల్ ఫైనల్‌తోనే ఆగిపోయింది. రైల్వే సర్వీస్ కమీషన్ పాసయి విజయవాడలో వుద్యోగం చేస్తున్నాడు. ఇంత హఠాత్తుగా..." నా కంఠం పెగల్లేదు.

"అయామ్ సో సారీ! కలకత్తా కోర్టులో లోగడ వచ్చిన జడ్జిమెంట్ ఆధారంగా అరవై వేలకు కాంప్రమైజ్ చేయటానికి నోట్ పెట్టాను సార్! ఏమైనా మార్పా అంటారా?"

"వాట్ నెసెస్సరీ! ఇతనికి పర్సనల్ ఆక్సిడెంట్ ఇన్సూరెన్స్ పాలసీకూడా వుంది" అంటూ కర్చీఫ్‌తో కన్నీళ్లు తుడుచుకొన్నాను.

"ఆ ఫైలు తీసుకువచ్చాను సార్! నలభై వేలకు నోట్ పెట్టాను."

థర్డ్‌పార్టీ క్లెయిమ్... అరవై వేలు, పర్సనల్ యాక్సిడెంట్ క్లెయిమ్... నలభై వేలు... మొత్తం లక్ష రూపాయలు... ఫైల్లోవున్న చక్రపాణి ఫొటోను చూడగానే దుఃఖంతో నా హృదయం తల్లడిల్లిపోయింది.

కళ్లు మూతలు పడినా పాణి ముఖంలో అంతులేని తేజస్సు సాక్షాత్కరించింది నాకా క్షణంలో.

అందుక్కారణం—

భార్యా పిల్లలకు ఓ బంగారుభవిష్యత్తును కల్పించానన్న సంతృప్తి కావొచ్చు!

లేదా,

ఆ కోయదొర జోస్యం ఫలించినందుకు కల్గిన గర్వం కావొచ్చు!





# ఫాలాక్షుని డైరీ



## నిద్రమత్తుకి బలైన నిండు ప్రాణం!

తమిళనాడు నంగనూరుతాలూకా తెవించిపురం అనే గ్రామంలో 43 ఏళ్ళ మణి అనే అతనురాత్రంతా కష్టపడి పనిచేసి, తెల్లవారుఝామున యింటికొచ్చి అలిసి, సొలిసి పడుకుంటె అతని భార్య 19 ఏళ్ళ మూకమ్మ తెలవారుతో లేచి, పొయ్యి అంటించడానికి అగ్గిపెట్టె వుందా అని భర్తను తట్టి తట్టి, కుదిపి కుదిపి అడిగిందట. నిద్రాభంగం భరించలేని ఆ మణి సర్రున లేచి,పక్కనే బల్లమీదపడున్న రొట్టెకోసే కత్తితో ఆమెను కసక్కున పొడిచి, ఆమె క్రిందపడి విలవిలా తన్నుకుంటూండంచూసి పారిపోయాడట. చట్టం ఆతన్ని వెంటాడి, పట్టుకుని యావజ్జీవ కారాగారశిక్ష విధించిందట.

## నిద్రవల్ల నిస్త్రాణ!

నిద్రవల్ల శరీరానికి వుపయోగం ఈషణ్మాత్రం కూడా లేదు పొమ్మన్నారట బ్రిటను శాస్త్రజ్ఞులు. శరీరానికి కావల్సినంత ఇంధనంపడేస్తూ వుంటె అది ఆడుతునే వుంటుందట. నిజానికి నిద్రవల్ల శరీరం నిస్త్రాణమవుతుందట. అదేమంటెమానవ శరీరంలో ఆ నిద్ర టయిములో ఏ ఆహారమూ పడనందువల్ల శరీరంనిస్త్రాణమవుతుందనీ, మెలకువగావున్న ఏసమయంలో కూడా అంతసేపు ఆహారం లేకుండా మనిషి వుండడనీ డాక్టర్ జిమ్. హార్న్ అనేఆయన వక్కాణించారట. ఆయన బ్రిటను లాల్బరో విశ్వవిద్యాలయంలో హ్యూమన్ సైన్స్ విభాగంలో పరిశోధనలు జరుపుతూన్నారట. శరీరానికి నిద్ర అనేది అవసరమేలేదు. కానీ నిద్రపోకపోయినందువల్ల నీరసంగా వుందని మనం అనుకోవడం వల్ల అలాఅనిపిస్తుంది అన్నారటాయన. కాళ్ళు చేతులూ విసిరేసి నట్టు కాస్సేపు విశ్రాంతిగా నిద్రపోకుండా పడుకుని వున్నా చాలునని యీాయన వుద్ఘాటించారట. నిద్రలో మెదడువిశ్రాంతితీసుకుంటుదనుకుంటేఅదీసరికాదు పొమ్మన్నాడటాయన.ఎటొచ్చీమేలుకునివున్నపుడంత పని చేస్తూ మాత్రం వుండదన్నారట. చక్కని సమీకృతాహారాన్ని తీసుకుంటూ , శరీరానికి విశ్రాంతి నిస్తూ పని చేస్తే ! నిద్రఅవసరమే రాదట. ఏవ్హో— సైన్సు రాన్రానూ చెప్పేది మరీ తికమకగా వుంటోంది!

## మంత్రిగారికి వింత బహుమానం!

మణిపూరులో రాష్ట్ర ఇరిగేషనుమంత్రి చౌబా సింగ్ సాబ్ ఇంటికోముగ్గురు ఆగంతకులు వోపెట్టి మోసుకువెళ్ళి ఆపెట్టిలో పళ్ళున్నాయనిచెప్పిఆయన సతీమణికి సమర్పించుకుని వెళ్ళిపోయారట. పుచ్చుకున్నాకావిడకు అనుమానంవచ్చి పెట్టె కదిపిచూసి ఇంకా బరువు అని పించిందట. బాంబులున్నాయేమో బాబూ అని పోలీసుల్ని పిలిస్తే వారు ఇష్టదైవ ప్రార్థన చేసుకుని తాళం పగలకొట్టి చూస్తే లోపల బోలెడు రాళ్ళు— ఆ మధ్యనో అరుచచ్చిన ఎలుకలు వున్నాయుట. దీనిబావమేమి తిరుమలేశా?




## అద్భుతమైన కారు!

కాలిఫోర్నియా వోఅద్భుతమైన కారును కని పెట్టిందట. జెర్రీవిగార్డ్ అనే వో యింజనీరు రూపొందించిన యీా కారు గంటకు 370 కిలోమీటర్ల వేగంతోపోతుందట. అంత వేగంగాపోయినా సరే ఎట్టి కుదుపూ,అలసటాలేకుండా వుంటుందట. ఎయిర్ అండ్ సౌండ్ కన్డిషన్డ్ చేసిన యీా కారు వెల పద్నాలుగు లక్షలట. అప్పుడే యిద్దరుఅరబ్బు వ్యాపారులు కొనేసుకుంటున్నారట. మన కారు స్పీడెంతసార్? గంటకంగుళం, అదీసరిగా నడిస్తే!

## ఇద్దరమ్మాయిల ముద్దుల మొగుడు !

కర్ణాటకకు చెందిన ఆరభి కొత్తనూర్ గ్రామంలో ఇందిర, రత్నమ్మ అనే వో ఇద్దరు కవల పిల్లలు తాము విడివిడిగా చెరో మగాణ్ణి పెళ్లి చేసుకోమనీ, తాము కవలలుగా పుట్టి నందువల్ల విడివుండమనీ, అలా ఉంటే ఇద్దరిలోఒకరికి కీడు వాటిల్లుతుందనో జ్యోతిష్కుడు చెప్పాడనీ మొండి కేసుక్కూర్చుని రామకృష్ణ అనే వో యువకుణ్ణి పెళ్లి చేసేసుకున్నారట. అహో రామకృష్ణా ! నీ పేరులోనే ఇద్దర్ని దాచుకున్నావు కదా !

## చిత్రహింసకి గురైన అధికారి !

బెర్హంపూర్ టెలిగ్రాఫ్ ఆఫీస్ ఇన్చార్జి మిస్టర్ నాయక్‌ని ఆయన గోసనిసువాగం ఆలయం నుంచి యింటికి వెళ్తూండగా కొందరు దారి కాసి ఆయన్ని బలవంతంగా వో కారులో ఎక్కించి ఆనక మత్తు మందిచ్చి వో యింటిలో లోపల లాగూ బనీను మాత్రమే వుంచి మిగతా బట్టలు వూడదీసి, కాళ్ళు కట్టేసి, కొన్ని పేపర్ల మీద సంతకాలు పెట్టమని చిత్రహింస పెట్టారట. నాలుగు రోజులలా ఆ గుర్తు తెలీనివారు గుర్తు తెలియని చోటులో ఆయన్ని వుంచి, ఆనక మళ్లీ మత్తు మందిచ్చి, కార్లో పడేసి, అదే ఆలయం ప్రాంతంలో పడేసి పోయారట. ఇంతకూ వారు తన ఆఫీసులోని క్లార్కులకు చెందిన వారేమోనని అనుమానమనీ, వారి ట్రాన్స్‌ఫర్లకు తాను రాస్తే, వారంతా తనని హెచ్చరించారనీ ఆయన అన్నారట.

## బంగారు పిస్టల్ !

అమెరికాకు చెందిన కోల్ ఆరమ్స్ కంపెనీ అనే సంస్థ బిజన్ పక్జాద్ అనే డిజైనరు సహాయంతో 38 క్యాలిబ ఆటోమేటిక్ అరిస్టోక్రటిక్ పిస్టలును రూపొందించిందట. 24క్యారట్ల బంగారంతో ఆ పిస్టలు కొన్ని భాగాలుచేయబడ్డాయుట. దీని కిమ్మత్తుపది వేల నుంచి పాతికవేల డాలర్ల వరకూ వున్నదటబంగారం పనిని బట్టి. ధనికులు తమ హోదాకు సరిపడిన ఆయుధాన్నే పట్టాలనీ, కనుక యీాజాతి పిస్టలు సరిపోతుందనీ ఆ సంస్థ అన్నదట—బాగున్నది. ఆ ధనికుని వద్ద డబ్బు లేకపోయినా కనీసం ఆ పిస్టలు కోసమైనా దొంగ మీదికి రావచ్చును.

# నామీద కథ రాసుకోండి




పైడిపాల

ఎదురు చూసిన మనుషులు, ఉత్తరాలు రాకపోతే నేను చాలా డీలా పడిపోతాను. కాని జీవితంలో చాలాసార్లు రాకపోవడమే జరిగినా ఇంకా నేనుమాత్రం ఎదురుచూడ్డం మానలేదు. రెండ్రోజులుగా రాధ నుంచి ఉత్తరం కోసం ఆవురావురు మంటున్నాను. నిన్న, మొన్న- పోష్టుమాన్‌కోసం పడిగాపులు కాసే ఓపికలేక పోష్టాఫీసుకివెళ్ళి 'నాకేమైనా ఉత్తరాలున్నాయా?' అని అడిగేవాణ్ని. తిలక్ 'తపాలా బంట్రోతు' కవితలోలా 'అతని మొహం మీద లేదని చెప్పడానికి బదులు చిరునవ్వు నా ఆత్రుతని గమనించిన పోస్టుమేన్' ఈరోజు అనుకోనంత పెందరాళే 'మాష్టారూ ఇదిగో మీకో లెటరు' అంటూ చేతికందించి ఓ నిముషం నా కళ్ళలోకి చూస్తూ ఆగాడు.

కవరుమీద దస్తూరీ చూడగానే 'ఇదికాదు రావాల్సింది' అన్నాను- పోస్టుమాన్ మొహం నిండా సానుభూతి ఒలకబోసి వెళ్ళిపోయాడు

ఫ్రమ్ అడ్రసు కూడా లేని ఆ అపరిచితమైన అక్షరాల్ని చూసి ఆశ్చర్యపడుతూ కవరు చించాను.

నా అభిమాన రచయిత వనమాలి గార్కి నమస్సులు.

ఆశ్చర్యపోతున్నారా ? – ఈ అపరిచిత అభిమాని ఎవరని! బహుశా మీకున్న వేలాది అభిమాన పాఠకుల్లో నేనొకణ్ణి కావచ్చు. కాని నాకున్న వేళ్లమీద అభిమాన రచయితల్లో మీరొకరు. నా పేరు శరత్‌బాబు. ఊరు తూర్పు గోదావరి జిల్లాలోని వసంతపురి. మీ కవితలన్నా, కథలన్నా నేను చెవికోసుకుంటాను. రెండువారాల క్రితం అచ్చయిన మీ కవిత 'పుష్పలావిక'ను ప్రశంసిస్తూ ఈ వారం పత్రికలో నేను రాసిన ఉత్తరం మీరు చూసే వుంటారు. ఆ కవిత నాకు ఎంతగా నచ్చిందో ఆ వుత్తరంలో రాశాను. కనుక ప్రత్యేకంగా యిక్కడ రాయడంలేదు. నాకు సాహిత్యాభిరుచి ఏర్పడే వయసువచ్చేసరికే మీరు చాలా కవితలు, కథలు రాసివుండడం వల్ల మీ రచనలన్నీ చదివే అదృష్టం నాకు లభించలేదు. కథారచనలో మీది ప్రత్యేకమైన బాణీ. మీలా శిల్పానికి ప్రాధాన్యమిస్తూ చదివించే వేగం వున్న కథలు రాసేవారంటే నాకు భలే యిష్టం. కాని ఈమధ్య ఎందుకో మీరెక్కువగా కథలు రాయకపోవడం నావంటి అభిమానులకు నిరాశకలిగిస్తోంది.

అదృష్టవశాత్తు ఈ వారం పత్రికలో మీ కవితా సంపుటి 'నాసక సజ్జిక'' కథల సంపుటి 'సగం చెక్కిన రాతిరథం'మీద వచ్చిన సమీక్షలు చదివాను. దయచేసి ఆ రెండు కాపీలు నాకు ఉచితంగా పోష్టుద్వారా పంపిస్తారని ఆశిస్తున్నా.

పన్నెండు రూపాయల ఖరీదయిన పుస్తకాలను ఇలా పంపమని అడగడం సమంజసం కాదు గాని నేను పుస్తకాలు సొంతంగా కొని చదవలేని పేదవాణ్ని. ఆపైన మావూరు సాహిత్య గ్రంథాలు కొనడానికిగాని గ్రంథాలయాల్లో చదువుకోడానికికాని అవకాశం లేని పల్లెటూరు అంచేత నేను నా అభిమాన రచయితలందరి పుస్తకాలూ సేకరించి నా సొంత గ్రంథాలయంలో భద్రపరుస్తున్నా. ఈ అభిమాని కోరికను మీరు నిరాకరించరని నమ్ముతున్నా.

నా గురించి... బి.ఏ. చదివి ఖాళీగా వున్న నిరుద్యోగిని. పుస్తకపఠనం హాబీ. అడపాతడపా పత్రికలకు ఉత్తరాలు,కథలు రాస్తుంటాను. మీ జవాబుకోసం ఎదురు చూస్తుంటాను—

మీ అభిమాని,
శరత్‌బాబు.

# నామీద కథరాసుకోండి

ఇదివరకు కూడా కొందరు అభిమానుల నుంచి నాకు ఉత్తరాలు వచ్చాయి. కాని యిలా మొదటి ఉత్తరంలోనే పుస్తకాలు పంపమనే చనువు తీసుకుంటూ కాదు. పైగా నేను శరత్ బాబు రాసినట్టు వేలసంఖ్యలో అభిమానులుండే పేరు ప్రఖ్యాతులున్నంత ప్రసిద్ధ రచయితను కాదు. కాని ఇతని ఉత్తరంలో పొగడ్తలతోబాటు కొన్ని నిజాలూ ఉన్నాయి— ఆ పైవ నిజాయితీ వుంది. కేవలం పుస్తకాల కోసమే అయితే ఏఅమ్మాయి పేరుతోనో ఉత్తరం రాసుండేవాడు కాని ఇతనెవరో కొంత సాహిత్య పిపాస ఉన్నవాడిలాగే కనిపిస్తున్నాడు. అయినా రచయితగా నాకుండే 'అహం' శరత్‌కి పుస్తకాలు పంపించడానికి అంగీకరించ లేదు.

దాదాపు ఓ నెల గడిచిన తర్వాత ఓ అత్యధిక ప్రచారంగల వారపత్రికలో అచ్చయిన నాకథ 'రచయితా, కథలు చెప్పకు' మీద నా అభిమానులు కొందరు నేరుగా నాకుఉత్తరాలు రాశారు. అలా వచ్చిన ఉత్తరాల్లో శరత్ బాబుది ఒకటి —

"......... మీ కథ చదివాను మంచి ప్రారంభం, ముగింపు ఎన్నుకోవడంలో మీరు చూపిస్తున్న శ్రద్ధ, ప్రతిభ ప్రశంసనీయాలు. కథాంతంలో కొస మెరుపు మీ ప్రత్యేకత. ఇలాంటి కథలకు మార్గదర్శకులు మొపాసా, ఓ హెన్రీ... అని నేను విన్నాను ఇలాంటి ఉత్తమమైన కథలు రాసే మీరు బద్ధకించడం చాలా అన్యాయం. అవునూ—కథలు రాయడానికే కాకుండా జాబులు రాయడానికి కూడా మీకు బద్ధకమా ? కిందటి సారి నేను రాసిన ఉత్తరం మీకు అందే వుంటుంది. మీ మంచి జాబుకు కాని, పుస్తకాలకు కాని నేను నోచుకో లేదు. ఈ నిరుద్యోగిని కనికరించమని వేడుకొంటున్నా.

త్వరలో మా ఊళ్ళో ఒకసాహితీ సంస్థను ఏర్పాటు చేసి మీ వంటి ప్రముఖులను నెలనెలా ఆహ్వానించి మీసందేశాలు వినాలని కుతూహల పడుతున్నాం. ఆ సంస్థకి ఓ మంచి పేరు సూచిస్తే కృతజ్ఞులం. నేను రాసిన కవిత ఒకటి ప్రచురిస్తున్నట్టు 'యువగళాలు' పత్రిక వారు తెలియజేశారు.

మీ జాబు కోసం ఈ క్షణంనుంచి ఎదురు చూస్తూ— మీ అభిమాని

శరత్ బాబు.

ఆ రోజే అతనికి రెండు పుస్తకాలు పోస్టు చేస్తూ సమాధానం కూడా జతపరిచాను పుస్తకాలు అందినట్టు కృతజ్ఞతలు తెలియజేస్తూ వెంటనే అతని నుంచి జవాబు వచ్చింది ... ఆ తర్వాత అతనివి తరచుగా పత్రికల్లో ఉత్తరాలు చూస్తున్నాను

*  *  *

హైదరాబాదు 'స్పాట్ వేల్యుయేషన్' కి వెళ్ళినప్పుడల్లా 'ఫుట్‌పాత్'మీదఅమ్మే సెకండ్ హాండ్ పుస్తకాలమీద దాడి చెయ్యడం నా కలవాటు ఆ ఆదివారం నాంపల్లి నుంచి ఆబిడ్జ్‌కి వెళ్ళేదారిలో ఓ సెకండ్ హాండ్ పుస్తకాల షాపు ముందు ఆయిదారు మంది మూగి వున్నారు ఎక్కువ మంది ఎగబడేచోట మంచి సరుకుంటుందని చాలా మంది అభిప్రాయం ఆ వుద్దేశ్యంతోనే నేనూ వారిలో చేరాను. నిజంగానే చాలా మంది ప్రముఖ రచయితల పుస్తకాలూ, కొన్ని అచ్చులో లేని అరుదైన పుస్తకాలూ అక్కడున్నాయి. వాటిలో అయిదారు పుస్తకాలు ఎంపిక చేశాను. మరికొన్నిటి కోసం వెతుకుతుండగా — నా కథా సంకలనం 'సగం చెక్కిన రాతి రథం' కనిపించింది.

పత్రికల్లో నా రచనలు అచ్చయిన పేజీలుగల కాగితాలు పచారీ కొట్లలోనూ,పకోడీపొట్లాల రూపంలోనూ కనిపించినపుడు అమితంగా బాధపడి పోయే తత్వం నాది. అలాంటిది నా పుస్తకమే అక్కడ కనిపిస్తే నా దుఃఖం చెప్పాలా? మరి ప్రముఖరచయితలు ఆ స్థితిలో తమ పుస్తకాల్ని చూసి ఎంత బాధపడతారో— అలా బాధ పడ్డం ఎంతవరకు సబబో ఆలోచించే శక్తి లేదు నాకు ఈ లోగా మిత్రుడు మూర్తి 'ఏయ్, మాలీ నీ పుస్తకం...' అంటూ నా సంకలనాన్ని అందుకొని చూడ్డం నా దుగ్ధని రెట్టింపు చేసింది—ఏదో సామెత చెప్పినట్టు.

"ఏదో కాంప్లిమెంటరీ కాపీ అయి వుంటుంది" అంటూ లోపల పేజీలు చూశాను 'శరత్ బాబుగార్కి అభినందనలతో', అంటూ రాసిన అక్షరాలు నన్ను వెక్కిరించాయి కోపంతో అవమానంతో నామొహం ఎర్రబారిపోయింది. నేను కొనదలచుకొన్న మిగతా పుస్తకాలతో బాటు నా పుస్తకం కూడా కలిపి దాదాపు మూడోవంతు ఖరీదుకి కొనుక్కున్నాను.

"శరత్ బాబు అంటే...వసంతపురి అతనే కదూ ?" కోపంతో బిగిసిపోయి 'ఫుట్‌పాత్' మీద నడుస్తున్న నన్ను కదిలించాడు మూర్తి.

"అవును-నీకెలా తెలుసు ?" ఆశ్చర్య పడుతూ అడిగాను

"నీకు తెలిసినట్టే. నిన్ను పొగుడుతూ నీకథా సంకలనంపంపమని ఉత్తరం రాశాడా ?"

"అవును – అయితే నీక్కూడా .. ?" తెల్లమొహం వేశాను.

"అవును ." వేదాంతిలా చిరునవ్వు నవ్వుతూ తలూపాడు మూర్తి

అవును . ఆ శరత్ మోసగాడే ! నా అవసరం తీరిన తర్వాత నాకు మళ్ళీ ఉత్తరాలు రాయక పోవడం నాకు గుర్తుకొచ్చింది. ఆ మర్నాడు నా ఆగ్రహాన్నంతా అక్షరాలుగా మార్చి రాసిన ఉత్తరానికి శరత్ నుంచి తిరుగు టపాలో 'ప్రాంప్ట్' గా సమాధానం వచ్చింది–గౌరవనీయులు వనమాలి గార్కి —

నమస్కారం. మీరు చాలా కోపంగా రాసిన ఉత్తరం అందింది నేను వంచకుణ్నని నిదించారు .. నేను చేస్తున్నది వంచన కాదు — వ్యాపారం నేను నిజంగా సాహితీప్రియుణ్నే. కాని నిరుద్యోగులం కావడం వల్ల మా అభిలాష తీర్చుకోడానికి నేనూ నా మిత్రుడూ కలిసి ఈ స్వయం ఉపాధి పథకాన్ని రూపొందించాం పోస్టేజి మా పెట్టుబడి హైదరాబాదులో మీకు సెకండ్ హాండ్ పుస్తకాల నమ్మింది నా మిత్రుడు, పార్ట్‌నర్ భరత్.

రచయితల బలహీనత నాధారంగా చేసుకొని వారిని పొగిడి పుస్తకాలు సేకరించి, నా మిత్రుడికి పంపిస్తుంటాము మొదటి పేజీ సాధారణంగా చించేస్తుంటాను. కాని మీ పుస్తకంలో మూడోపేజీలో 'కాంప్లిమెంట్స్' రాయడం వల్ల చించడానికి వీలు పడలేదు. మీకు దొరికిపోయాను కాని మీరనుకున్నట్టు అడ్డమైన రచయితల పుస్తకాలకోసం నేను ఉత్తరాలు రాయను వారివైతే కేజీల లెక్కన అమ్ముకోవాలి మాకు వ్యాపారం కిట్టుబాటు కాదు .. ఎంతో కొంత పేరున్న వాళ్ళవైతేనే మాకు అమ్ముడవుతాయి.

పోతే, మీకు నష్టం, కష్టం కలిగించినందుకు మన్నించమని కోరుతూ — వాటికి పరిహారంగా ఓ సలహా యిస్తున్నా—మీ చేతిలో పని— నా మీద ఓ కథ రాసుకోండి.

క్షమాపణలతో,

శరత్‌బాబు ★




ఇండెంటింగ్ ఏజెంట్లు: బాలాజీ టెక్స్టైల్ ఏజెన్సీస్, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్-3; సంగం టెక్స్టైల్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి. బి. రోడ్, ఆర్. ఎస్. పురం, కొయమత్తూరు-2; స్టాక్-కమ్-సేల్ డిపో: ఆర్.పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్-3.

# దాంపత్య సంగీతం

సీరియల్

**శ్రీమతి కళ్యాణీ సోమరాజ్**

## 21

(గత సంచిక తరువాయి)

'బాబు' ఈ మధ్య చాలావరకు కుమార్‌తోనే గడుపుతున్నాడు. సాయంకాలం కుమార్ హాస్పటల్ నుంచి రాగానే, దివ్యనికాని, ఆయాని కాని పంపి 'బాబు'ని తీసుకురమ్మని చెబుతాడు. ఆయా వచ్చినప్పుడు స్వాతి నిర్మొహమాటంగా 'బాబు ఇప్పుడు రాడు' అని చెప్పగలుగుతుంది. కాని ఆ వచ్చింది 'దివ్య' అయితే మాత్రం 'బాబు'ని పంపలేనని చెప్పలేదు.

ఆమె కెందుకో కుమార్ ఉద్దేశ్యం అర్థం అయ్యేదికాదు. బాబుకి, దివ్యకి మధ్య సామరస్యం కలగాలని అతను ఇలా చేస్తున్నాడా, లేక తండ్రిగా తనకు బాబుమీద హక్కు వున్నదని ఇలా ప్రవర్తిస్తున్నాడా ? లేక తను నుంచి 'బాబు'ని కూడ దూరం చేస్తే ... పిల్లల కోసం తను అతని పాదలపై పడి క్షమార్పణ వేడుకుంటుందని దురూహతో ఈ పథకం పన్నాడా ? స్వాతి మనసు వివిధ విధాల ఆలోచించి అలసిపోయేది !

ఏది ఏమైనా ఆమె ఈసారి 'బాబు'ని కూడ దూరం చేసుకోవాలని లేదు. బాబుని ఎలాగైన కుమార్ నుండి తప్పించాలన్న ఉద్దేశ్యంతో రోజు సాయంకాలం కాగానే, బయటకు తీసుకెళ్ళటం అలవాటు చేసుకుంది.

ఆ రోజు బాబుని తీసుకొని షాపింగ్‌కి బయలుదేరింది. సామాను కొనుక్కొని బస్‌స్టాపు దగ్గర నిలబడింది. ఇంతలో ఎవరో చనువుగా స్వాతి భుజం మీద చేయి వేయటం చూసి, చివ్వున వెనక్కి తిరిగి చూసింది.

"గుర్తున్నానా !" చిరునవ్వుతో మామి.

"మామి. మీరు ... ఇక్కడ ఆశ్చర్యంగా వుందే !"

"మా కృష్ణకి ఇక్కడ జాబ్ వచ్చింది. ఈమధ్య పెళ్ళి కూడ అయింది. మా ఇల్లు అదిగో ఆ పక్క సందులోనే, పద వెళదాం."

స్వాతి కాదనలేదు. చాలా ఏళ్ళకి కన్పించిన మామి మాటలు తీసేయ్యలేదు.

"దివ్య తరువాత బాబా ?"

"ఔను మామి."

"నువ్వు చెప్పకుండా వెళ్ళిపోయావు. చాలా రోజులు అనుకున్నాను. తరువాత డాక్టర్ కూడా వెళ్ళిపోయారు. నిన్ను ఇక కలుస్తాననుకోలేదు" దారి పొడుగున స్వాతిని చాలా వివరాలు అడిగి తెలుసుకొంది.

అయితే స్వాతి, 'కుమార్‌కి తనకు మధ్యన ఏర్పడ్డ కలతల' గురించి మామితో చెప్పలేదు.

మామివాళ్ళు వుంటున్న ఇల్లు చిన్నదే. మూడే గదులు. మామి ఇంట్లోకి వెళుతుండగానే, 'రాజేశ్వరి' అంటూ పిలిచింది. వంట ఇంట్లో వంట చేస్తున్న ఆమె కోడలు చేయి తుడుచుకుంటూ బయటకు వచ్చింది. మామి చేతిలో కూరల బుట్ట అందుకుంది.

"స్వాతి, ఈ పిల్ల నా కోడలు, పేరు రాజేశ్వరి" అంటూ మామి కోడల్ని పరిచయం చేసింది.

స్వాతి నమస్కారం చేయగా, తిరిగి సిగ్గుపడుతూ నమస్తే చెప్పింది. తెల్లని మొహాన విభూధి రేఖ దానిపై కుంకుమ బొట్టు, చెవులకు ముక్కుకు రవ్వల దుద్దులు. అచ్చంగా అయ్యంగారి అమ్మాయిలా వుంది రాజేశ్వరి.

మామి స్వాతితో కబుర్లు చెబుతూ బాబుని ఒడిలో కూర్చోపెట్టుకొని, "రాజేశ్వరీ కొంచెం కాఫీ కొండువా (తీసుకురా)" అంటూ కోడలికి పురమాయించింది.

"ఇప్పుడేం వద్దు మామి. అనవసరమైన శ్రమ" అంది స్వాతి ఇబ్బందిగా.

"ఫరవాలేదు. కాఫీయేగా. ఈసారి నువ్వు, కుమార్, దివ్య అందరూ మా ఇంటికి భోజనానికి రావాలి. అయ్యంగారు చాలా సంతోషిస్తారు."

రాజేశ్వరి కాఫీ కలుపుకొచ్చి మామికి, స్వాతికి ఇచ్చింది.

"మా కోడలికి తెలుంగు రాదు" అంది మామి నవ్వుతూ.

"మీరే నేర్పండి."

రాజేశ్వరి సిగ్గుపడుతూ లోపలికి వెళ్ళిపోయింది.

బాబు కాస్సేపు ఆడుకున్నాక ఏడుపు మొదలు పెట్టాడు.

స్వాతి మామి దగ్గర శెలవతీసుకొని ఆటో చేసుకొని ఇంటికి వచ్చేసింది.

ఇంటిముందు కుమార్ కారు ఆగివుంది. కుమార్ ముందు బ్యానెట్ కానుకొని నిలబడి వున్నాడు. బాబు కుమార్‌ని చూస్తూనే అంతవరకు ఏడుస్తున్నవాడల్లా తక్కున ఏడుపుమాని అతని మీదకు దూకాడు. కుమార్ ఆనందంగా అతన్ని ఎత్తుకొని ముద్దు పెట్టుకుంటూ, "నాలుగురోజుల నుంచి మీ అమ్మ నాకు కన్పించకుండా దాచేస్తోందా!" అన్నాడు స్వాతివంక చూస్తూ. స్వాతి మొహం అప్రసన్నంగా తయారైంది.

చిరాకు పడుతూనే ఇంటి తలుపులు తీసింది.

"లోపలికి రావచ్చా !" అని అడిగాడు కుమార్ బాబు నెత్తుకొని గేటు బయట నిలబడి.

"మీ ఇష్టం. మీరు చేయదలుచుకున్న పనులన్ని నా అనుమతితోనే చేస్తున్నారా !"

"ఇది నీ ఇల్లు కదా ! అనుమతి లేందే లోపలికి వస్తే మెడపెట్టి బయటకు గెంటేనా, గెంటగలవు."

"అలాంటి భయం మీకుంటే రాకండి. బాబుని ఇవ్వండి. వాడికి అన్నం పెట్టాలి."

"వాడు వస్తే తీసుకో !"

స్వాతి చిరాగ్గా మొహం పెట్టి "బాబు దా. అన్నం తిందుగాని" అంటూ చేతులు జాచి పిలిచింది.

బాబు గట్టిగా కుమార్ మెడ పట్టుకొని "నేను రాను" అన్నాడు. స్వాతికి ఎక్కడలేని ఉక్రోషం వచ్చింది.

"ఏమిటి మీ ఉద్దేశ్యం. ఆనాడు దివ్యని నానుండి ఇలా వేరుచేసారు, ఈనాడు వీడినీ నాకుకాకుండా చేస్తున్నారు. నేనేం ద్రోహం చేసాను."

"స్వాతీ ! ఎందుకలా నెగటివ్ సైడ్‌లో

---

**జరిగిన కథ — 10 :** కూతురు పేరు 'దివ్య' అని పెట్టుకుంటాడు కుమార్. దివ్య పుట్టిన తరువాత స్వాతి కుమార్‌ల మధ్య మనస్పర్థలూ, చికాకులూ ఎక్కువవుతాయి. స్వాతి పాప పెంపకంలో నిర్లక్ష్యం చేస్తోందన్న అభిప్రాయంతో దివ్యను వదిన దగ్గిర వదిలి వస్తాడు కుమార్. ఒంటరిగా వున్న తండ్రి ఆరోగ్యం క్షీణించటంతో స్వాతి వెళ్ళి ఆయనకు సపర్యలు చేస్తుంటుంది. డబ్బుకోసమే వెళ్ళి అక్కడ వుంటోందన్న అపోహతో తమా డబ్బు సంపాయించడానికి ఇరాక్ వెళ్తున్నట్లు ఉత్తరం ద్వారా తెల్పుతాడు ఆమెకి కుమార్. స్వాతి కుమార్‌ని కలుసుకోలేకపోతుంది. ఆ తరువాత తండ్రి చనిపోతాడు. తన ఆస్తినంతా చెల్లికి రాసేస్తుంది. డాక్టరంకుల్ సహాయంతో తన బాబుని తీసుకొని కుమార్ కొత్తగా కట్టిన నర్సింగ్‌హోమ్‌లో చేరుతుంది. అతనిదని తెలిసాక రిజిగ్నేషన్ ఇస్తుంది. ఈ కథంతా రుక్మిణీదేవికి చెప్తుంది స్వాతి. ఆవిడ సలహాపై తన రాజీనామాను ఉపసంహరించుకొంటుంది. డాక్టర్ మోహన్‌ను పెళ్ళి చేసుకొనే విషయమై స్వాతి సలహాను తీసుకొంటుంది శారద.

---

ఆలోచిస్తావ్. నీకెంత అధికారం, అభిమానం పిల్లల మీద వుందో నాకు అలాగే ననుకోరాదు. పిల్లలిద్దరు ఒక్కచోట, ఒక్కటిగా పెరగాలని నేను తాపత్రయ పడుతున్నాను. దానికి రంగులు పూసి బూతద్దాల్లో చూడటానికి ప్రయత్నం చేయక. ఆనాడు దివ్యని నీనుండి వేరు చేయాలన్న దురూహతో నేనాపని చేయలేదు. నువ్వు అనవసరంగా అపార్థం చేసుకొని, చిన్న విషయాలు పెద్దవి చేసుకొని నాకు దూరంగా పారిపోయావు."

"ఔను. నేనే చిన్న విషయాలు పెద్దవి చేసుకొని పారిపోయాను. పోన్లేం 'నాకు డబ్బు వ్యామోహం' అన్నారు ఆనాడు కాదనలేదు. నాకు 'తల్లిప్రేమ లేదన్నారు' వేదించలేదు. ఇప్పుడు మీతో నేనేం వాదించదలుచుకోలేదు. మన దారులు మనకు తెలియకుండానే వేరయ్యాయి. ఇప్పుడిక మీనుండి చాలా దూరం వచ్చాక, నన్ను వెనక్కు తిరిగి రమ్మని అడగకండి. నేను రాలేను.

"సరే స్వాతి! నీలో మార్పు కోసం ఎదురు చూడటం తప్పించి నేనేం చేయలేను. ఆఁ రేపు 'దివ్య' పుట్టినరోజు. బాబుని రేపు అంతా అక్కడే వుంచుకుందామని దివ్య మనసు పడుతోంది. తల్లిగా దాని కోరిక తీర్చటం నీ బాధ్యతను కుంటే నువ్వు 'బాబు'ని పంపించు. నిన్ను రమ్మని చెప్పినా, నాకా అదృష్టం వుండదని నాకు తెలుసు. వస్తాను. గుడ్‌నైట్" అంటూ బాబుని బలవంతంగా స్వాతి చేతి కందించి అతను వెళ్ళిపోయాడు.

స్వాతి బాబునెత్తుకొని అన్యమనస్కంగా ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయింది.

## 22

మరునాడు స్వాతి హాస్పటల్‌కి శెలవుపెట్టి ఇంట్లోనే వుండిపోయింది. బాబుని ఆయా వచ్చి కుమార్ వాళ్ళింటికి తీసుకెళ్ళింది స్వాతి ముభావంగా పంపింది.

సాయంకాలం ఒక నిశ్చయానికి వచ్చి లేచి గబగబ తలదువ్వుకొని, చీర మార్చుకొని డాక్టరంకుల్ ఇంటికెళ్ళటానికి రెడీ అయింది స్వాతి!

కాలింగ్ బజ్జర్ నొక్కగానే, రాణి వచ్చి తలుపు తీసింది రాణివాళ్ళు ఉద్యోగరీత్యా, భిలాయ్‌లో వుంటున్నారు. ఏడాది కొకసారి చుట్టపు చూపుగా వచ్చి చూసి పోతుంటారు. ఆమెకు స్వాతితో పరిచయం కాస్త పెరిగాక, ఇదివరకులా స్వాతి తన జీవితాన్ని ధ్వంసంచేసే మనిషి కాదని గ్రహించింది.

"హల్లో రాణి. ఎప్పుడొచ్చారు ?"

"నాలుగురోజులైంది."

"మీ బాబు ఏమంటున్నాడు ?"

"ఏముంది. అల్లరి పెరుగుతోంది. ఒక్క క్షణం తీరుబడివుండడు వాడితో. ఇప్పుడే మా వారితో బయటకెళ్ళాడు."

"అంకుల్ లేరా ?"

"ఉన్నారు. పూజ చేసుకుంటున్నారు. చెప్పనా, మీరు వచ్చినట్లు."

"వద్దు. నేను వెయిట్ చేస్తాను."

"అయితే అలా తోటలోకి రండి. ఈమధ్య మామయ్యాగారు బెంగుళూరునుంచి, ఊటీనుంచి మొక్కలేవో తెప్పించి నాటారు చూద్దురుగాని..." అంటూ రాణి స్వాతిని తోటలోకి తీసుకువెళ్ళింది.

డాక్టరంకుల్‌కి చెట్లమీద వున్న శ్రద్ధ మూలంగానో, మరే కారణంవలనో తెలియదు, వారి తోటంతా రంగు రంగుల పూలతోను, కూర పాదుల తోను ఎప్పుడూ కళకళలాడుతూ వుంటుంది. స్వాతికి తన చెల్లెలు శారద గుర్తు వచ్చింది. శారద కూడ పూల చెట్ల విషయంలో శ్రద్ధ చూపించేది. ఇప్పుడు ఏం చేస్తోందో ? అప్పుడప్పుడు తను, తన పిల్లలతో తీయించుకున్న కలర్ ఫొటోలు పంపుతూ, అక్కడ జీవితాన్ని పొగుడుతూ ఉత్తరాలు వ్రాయటం తప్పించి, ఏ ఉత్తరంలోను 'ఇండియా రావాలని' వుందనికూడ వ్రాయదు. కొంతమంది ఎంత తేలిగ్గానైన బంధాలు తెంపుకోగలరు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు. ఇలా రండి... ఇవే కొత్తగా నాటిన చెట్లు" అంటూ రాణి



చెబుతుంటే, స్వాతి ఆలోచనలను విడిచి చెట్లవైపు చూసింది.

పచ్చగులాబీలు మొగ్గలు విడుస్తున్నాయి ఆరెంజ్ గులాబి ఆ రోజే విచ్చినట్లు కళకళలాడి పోతోంది. మిగిలిన చెట్లు కొన్ని పూలతోను మరికొన్ని మొగ్గలతో వున్నాయి.

"వైజాగ్ వెళ్ళివచ్చావా !"

"లేదు" అంది ముభావంగా రాణి.

"వెళ్ళేటప్పుడు వెళతావా !"

"ఉహూ. నన్ను చూడాలన్నప్పుడు అమ్మా, నాన్నే అక్కడికి వస్తారు."

"అదేం. మీకు దారే కదా. దిగటానికేం"

"అక్కడికి వెళితే ఏవో చేదు జ్ఞాపకాలు నన్ను చుట్టుముడుతాయి. అందుకని వెళ్ళను. అమ్మా, నాన్న రమ్మని బలవంతపెట్టరు."

స్వాతి సానుభూతిగా విని 'ఊ' కొట్టింది

ఇద్దరు లోపలికి వెళ్ళేసరికి డాక్టరంకుల్ పూజ ముగించుకొని హాల్లో కూర్చునివున్నారు.

"మీరు సాయంకాలాలు కూడ పూజ మొద లెట్టారా అంకుల్ !"

"లేదమ్మా పూజేం కాదు. కొత్తగా మెడిటేషన్ స్టార్ట్ చేసాను. ఏమిటి నువ్వు బొత్తిగా ఇటువైపు రావటంలేదు, చాలా బిజీగా వున్నావా !"

"లేదంకుల్ ఏమిటో బయటకు కదలటానికి బద్ధకం" అంది.

"రుక్మిణికి ఫోన్ చేస్తే వూళ్ళో లేదని తెలిసింది. ఏ వూరు వెళ్ళిందేం."

"ఢిల్లీ వెళ్ళారు మొన్ననే బహుశా ఇంకో వారం వరకు రాకపోవచ్చు."

"ఔనుకదూ నేను వెళ్ళాల్సిందే ఏమిటో నాకీ వయసులో ఎక్కడికీ వెళ్ళాలని లేదు. ఏదో సాయంకాలాలు తోట చూసుకుంటూ, ఇలా మెడిటేషన్ చేస్తూ ప్రశాంతంగా గడపాలని వుంది. నా హాస్పెటల్ వ్యవహారాలు ఇప్పుడు పూర్తిగా మధుయే చూస్తున్నాడు. ఎప్పుడైనా వెళతాను."

"బాగుంది అంకుల్. ఎవరికైనా ఇలా పీస్‌ఫుల్‌గా రిటైరవటం చాలా మంచిది."

రాణి టీ, బిస్కెట్స్, కేక్స్ తెచ్చి సర్వ్ చేసింది.

"అంకుల్. ఆ మధ్య మీరు మీకు తెలిసినాయన వరంగల్లో నర్సింగ్ తెరుస్తున్నాడు, లేడీ డాక్టర్ కావాలని, నాతో అన్నారు గుర్తుందా."

"ఆ గుర్తుంది. కాని నేనెవర్ని సజెస్ట్ చేయ లేదు. బహుశ అతనే ఎవర్నో అపాయింట్ చేసుకొని వుంటాడు. ఏం. ఎందుకు అడుగుతున్నావ్ !"

"నాకే కావాలి అంకుల్ ! ఫర్ యే ఛేంజ్ !"

"ఏమిటి స్వాతి. నీకీ ఉద్యోగం బాగాలేదా. మళ్ళీ మారటం ఏమిటి. చక్కని నర్సింగ్‌హోమ్. తల్లిలా చూసుకొనే రుక్మిణి, మంచి క్వార్టర్ అన్నీ అమర్చినట్లు దొరికితే హాయిగా ఆ ఉద్యోగంలో సెటిలవ్వక, మరో ఉద్యోగమా ! వేరే కారణం ఏదైనా వుందా !"

"లేదంకుల్ ! నాకే ఈ చోటు బోరుకొట్టింది. చాలామంది సర్జన్స్. దానితోఆపరేషన్‌చేసే అవకాశాలు లేవు. ఎప్పుడు ఒ. పి. తప్పించి మరో మార్పు లేదు. బోర్‌గా వుంది..." స్వాతి చాలా కారణాలు పోగుచేసి చెప్పింది.

డాక్టరంకుల్ ఆలోచనలో పడ్డారు.

స్వాతి ఇలాగే మరి రెండు, మూడు కారణాలు వివరించి చెప్పింది. కాని కుమార్ వచ్చాడన్న విషయం పొరపాటున కూడ బయట పెట్టలేదు.

కుమార్ నుండి తప్పించుకోటానికే మరో ఉద్యోగాన్వేషణ అని తెలిస్తే, డాక్టరంకుల్ చివాట్లు వేసి అక్కడే వుండమని సలహా ఇవ్వటం తప్పించి మరేవిధంగా హెల్ప్ చేయడని స్వాతికి బాగా తెలుసు

"సరేనమ్మా ! రేపొకసారి అతనికి ఫోన్‌చేసి కనుక్కుంటాను. ఇంకా ఆ పోస్ట్ ఖాళీగా వుంటే నీకు తప్పకుండా వస్తుంది."

"థాంక్స్ అంకుల్ ఈ విషయం మర్చే పోవద్దు."

స్వాతి బయటకొచ్చేసరికి సన్నని జల్లు ఆరంభించింది.

"స్వాతీ ! కొంచెంసేపు వుండు. అబ్బాయి కారు తీసుకొని బజారు వెళ్ళినట్లున్నాడు. రాగానే నిన్ను డ్రాప్‌చేస్తాడు. వర్షం కురిసేలావుంది" అంటూ డాక్టరంకుల్ చెప్పినా స్వాతి, "ఫరవాలేదు. అంతగా అయితే ఆటోలో వెళతాను" అంటూ బయటకొచ్చేసింది.

ఆమె మనసు ఇప్పుడు ప్రశాంతంగా వుంది. ఏదో ఒక ఉద్యోగం దొరికితే బాగుండు. కుమార్ నుంచి దూరంగా వెళ్ళాలి. అతనికి నిర్మలమైన ప్రేమవుంటే అదే తమిద్దర్నీ కలుపుతుంది. అంతే కాని, ఇలా అతని కళ్ళ ఎదురుగా వుంటూ, ఇద్దరి మధ్య చికాకులు పెరగటం మంచిదికాదు. అతనికి పిల్లలమీద వున్న విపరీతమైన ప్రెమ తనకు తెలియందికాదు. వాళ్ళను వదులుకోవటం ఇష్టం లేక తన కోసం అతను పాకులాడవచ్చు తనకి, అతని నుండి పరిపూర్ణమైన ప్రేమకావాలి. తిండి, బట్ట కోసం భర్తమీద ఆధారపడాల్సిన అవసరం తనకు లేదు. ఆ విషయం అతను గ్రహించేదాక, తను అతనికి సాధ్యమైనంత దూరంగా వుండటమే చాలా మంచిదనిపిస్తోంది.

వర్షం రాను రాను పెరగటంతో కొంగుతీసి తలనిండా కప్పుకొని, గబగబ బస్‌స్టాప్‌వైపు అడుగులు వేసింది. ఆటో ఒకటి వెళుతుంటే చేయి వూపింది. కాని ఆటో జోరుగా వెళ్ళిపోయింది. బస్‌కోసం ఓపిగ్గా నిరీక్షించటం తప్పించి ప్రస్తుత పరిస్థితిలో మరేది చేసేది లేదనిపించింది స్వాతికి. పెడాపెడా కొడుతున్న జల్లుకి స్వాతి పూర్తిగా తడిసి ముద్ద అయింది.

అలాగే ఒణుక్కుంటూ ఇంటికి చేరింది స్వాతి ! వీధి వరండాలో 'బాబు'ని ఎత్తుకొని నిలబడ్డ ఆయాని చూసి, "నీవచ్చి ఎంతసేపైంది ఆయా ! బాబు చాలాసేపు చలిగాలిలో వున్నాడా !" అంది ఖంగారుగా స్వాతి.

స్వాతిని చూస్తూనే మీదకు దూకాడు బాబు

"వుండరా. చీర మార్చుకురాని." అంటూ స్వాతి ఆయా చేతిలోనే వుంచేసి లోపలికి వెళ్ళి పోయింది.

"మీకోసం బాబు ఏడుస్తుంటే, తీసుకొచ్చా నమ్మా ! తీరా వస్తే మీరు లేరు. వెనక్కు తీసుకెళదా మనుకుంటే వర్షం పట్టుకుంది." అంది వివరిస్తూ ఆయ

"బాబు అన్నం తిన్నాడా ?"

"లేదమ్మా కేక్స్, స్వీట్స్ తిన్నాడు అన్నం తినమంటే వద్దన్నాడు."

"సరేలే. నువ్వెళ్ళు."

ఆయాని పంపి, నిద్రపోతున్న బాబుని పడుకో బెట్టి, పక్కనే కూర్చుంది. వర్షంలో తడవటం వలన, తలనొప్పిగా వుంది. వంట చేసుకొని భోజనం చేసే ఓపికలేక అలాగే పడుకుంది.

* * *

స్వాతి మరునాడుకూడ హాస్పెటల్‌కి వెళ్ళలేక పోయింది తలనొప్పి ఆమెను వూరికే వదలలేదు, జ్వరంలోకి దింపింది. దానికితోడు 'పనిపిల్ల' రాలేదు. బాబుకి మాత్రం ఎలాగో ఓపిక చేసుకొని, అన్నం తినిపించి కళ్ళు మూసుకొని పడుకుంది. సాయంకాలం అవుతున్నకొద్దీ జ్వర లక్షణాలు ఎక్కువైయ్యాయి. బాబు తల్లి పక్కనే కూర్చుని బెంగగా, చూస్తున్నాడు.

ఇంతలో దివ్య బాబుతో ఆడుకోటానికి వచ్చింది బాబు దివ్యను చేయి పట్టుకొని లాక్కెళ్ళి జ్వరంతో మూలుగుతూ పడుకున్న తల్లిని చూపించాడు.

స్వాతి, దివ్య రాకను గమనించింది. బాబుని ఎక్కడికైనా పంపిద్దాం అన్న ఆలోచనతో వున్నదేమో, దివ్యని చూడగానే, నిశ్చింతగా అనిపిం చింది. తను ఈ జ్వరంలో వాడి ఆలనా, పాలన చూడలేదు. 'ఈ ఒక్కరోజు ఏ ఫ్రెండింటికైనా పంపాలన్న' సమస్య లేదు అనుకొంది.

"దివ్యా ! బాబుని తీసుకెళ్ళు. ఈ రోజు మీ ఇంట్లోనే వుంచుకో, రేపు పంపుదుగానివి" అంది ఓపిక చేసుకొని.

దివ్య సంతోషానికి అంతులేదు. బాబు చేయి పుచ్చుకొని "అలాగే ఆంటీ" అంటూ ఆనందంగా వాళ్ళింటికి తీసుకెళ్ళింది.

కుమార్ ఆ రోజు కేసెస్ చాలా వుండి,

## మేకప్‌వల్ల మొటిమలు !

మేకప్‌వలన చర్మవ్యాధులు రాగలవని డాక్టర్లు చాలా కాలంగా హెచ్చరిస్తున్నారు. దీనిని నిరూపిస్తూ ఇటీవల మరో సంఘటన వెలుగులోకి వచ్చింది. పశ్చిమ జర్మనీలో ఆరేళ్ళ బాలికకు ముఖంపై మొటిమలు వచ్చాయి. సాధారణంగా మొటిమలు యవ్వనం అడుగుపెట్టే రోజుల్లో కన్పిస్తుంటాయి. కాని ఆ అమ్మాయి వయస్సు కేవలం ఆరేళ్ళు యవ్వనం వచ్చే వయసు కాదు. తీరా విచారిస్తే, ఆ అమ్మాయి బుగ్గలకు ఎరుపు రంగు వాడేదని తెలిసింది. ఆ అమ్మాయికి మొటిమలు రావడానికి అదే కారణమని డాక్టర్లు చెప్పారు. అంతేగాక ప్రయోగశాలల్లో జంతువులపై జరిగిన పరిశోధనల్లో కూడా ఇది నిజమని తేలింది.







ఆలస్యంగా వచ్చాడు. రుక్మిణీదేవి వూళ్ళో లేక పోవటం, స్వాతి హఠాత్తుగా శెలవు పెట్టటంతో అతనికి పని ఒత్తిడి ఎక్కువైంది. స్వాతి ఎందుకు శెలవు పెట్టిందో అతనికి అర్థం కాలేదు. ఇంటి కొచ్చేసరికి బాబు, దివ్య ఆడుకుంటూ కన్పించారు. అది చూడగానే అతని శ్రమ అంతా పోయింది. కాని హఠాత్తుగా స్వాతితో అతనికి అంతకు ముందు అయిన వివాదం గుర్తు వచ్చింది.

"బాబుని ఇంకా వుంచుకున్నావేమ్మా! పంపేయకపోయావా!" అన్నాడు కుమార్.

"ఏం ఫరవాలేదు డాడీ! బాబుని ఈరోజు అంతా ఇక్కడే వుంచుకోమన్నారు ఆంటీ!" అంది దివ్య నిర్లక్ష్యంగా.

'స్వాతిలో ఎందుకింత హఠాత్తుగా మార్పు వచ్చిందా' అనుకుంటూ అతను లోపలికి వెళ్ళి పోయాడు.

అయితే బాబు నిద్రపోటానికి చాలా పేచి పెట్టాడు 'అమ్మ కావాలి' అంటూ.

కుమార్ ఎత్తుకొని తిప్పినా బాబు ఏడుపు ఆపలేదు.

"దివ్యా! ఇంక లాభంలేదు. వాళ్ళ అమ్మ దగ్గర వదిలేసి వస్తాను."

"వద్దు డాడీ. ఆంటీకేమో జ్వరం కదా! పాపం ఎలా చూసుకుంటుంది."

"జ్వరమా?"

"ఔను డాడీ. సాయంకాలం నేను వెళ్ళానే ... అప్పుడు పడుకునే వున్నారు."

"మరి రాగానే నాకు చెప్పలేదేం?"

దివ్య మాట్లాడలేదు. అందులో ఇంత ఖంగారు పడాల్సిన విషయం ఏముందో ఆ చిన్న మనసుకి తట్టలేదు.

అందుకే కాబోలు స్వాతి శెలవుపెట్టింది. బహుశా జ్వరం మరీ ఎక్కువగా వుండివుండచ్చు, లేకపోతే, బాబుని ఇలా పంపదు,' అనుకుంటూ కుమార్ ఆయాని పిలిచి బాబుని అప్పజెప్పి గబగబ స్వాతి వుంటున్న క్వార్టర్ వైపు వెళ్ళాడు.

తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. లోపలంతా చీకటి. లైట్ వేసుకొనే ఓపిక కూడ ఆమెకు లేదు కాబోలని గ్రహించాడు. గదిలో లైట్ వేసి స్వాతి పడుకున్న మంచం దగ్గరకు వెళ్ళాడు. స్వాతి కళ్ళు మూసుకొని స్పృహలేనిదానిలా అలాగే పడుకుంది.

కుమార్ "స్వాతి, స్వాతీ" అని రెండు మూడుసార్లు పిలిచినా ఆమె 'వూ' అనలేదు.

అతను మరేమి ఆలోచించక, స్వాతిని రెండు చేతుల్లో ఎత్తుకొని బయటకు నడిచాడు.

## 23

స్వాతి రెండు మూడు రోజుల వరకు 'హై టెంపరేచర్'తోనే వుంది. ఆమె ఎక్కడున్నది, ఎవరెవరు వస్తున్నది ఇవేవి గమనించే స్థితిలో లేదు. కుమార్ ముఖ్యమైన కేస్‌లు చూసివస్తూ, స్వాతి దగ్గరే గడుపుతున్నాడు సాధ్యమైనంతవరకు. బాబు మెల్లగా ఆయాకి, ఆ ఇంట్లో పరిసరాలకి అలవాటు పడ్డాడు. దానికితోడు తల్లికూడ అక్కడే వుండటం వలన. బాబు బెంగ తగ్గింది.

శారద కి విషయం తెలియగానే వచ్చింది. స్వాతిని ఆ పరిస్థితుల్లో చూసాక, ఆమె మనసు బాధతో మూలిగింది. ఆమె కోరి 'నైట్ డ్యూటీ' వేయించుకొని, పగలంతా స్వాతికి సేవచేస్తూ గడిపేది. ఆమె దృష్టిలో స్వాతి ఒక 'దేవతామూర్తి.' ఆమె కేమాత్రం సాయపడినా శారదకి అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది.

రెండు మూడు రోజుల తరువాత స్వాతి మెల్లగా కళ్ళు తెరిచింది. టెంపరేచర్ పెద్దగా తగ్గకపోయినా, ఆమె కాస్త స్పృహలోకి వచ్చినందుకు అందరూ సంతోషించారు.

స్వాతి మొదట్లో తాను హాస్పెటల్లో వున్నాననుకొంది. కాని గాలికి వూగుతున్న పింక్ కలర్ డి. సి. ఎమ్. కర్టెన్స్, అప్పుడే కోసుకొచ్చి అమర్చినట్లున్న ఫ్లవర్ వేజ్‌లోని తాజా పూలు, మెత్తని ఫోమ్ పరుపు ఇవేవి ఆమెకు హాస్పెటల్ వాతావరణంలా అన్పించలేదు. శారద చెప్పటం ద్వారా తను ఎలాటి పరిస్థితుల్లో కుమార్ ఇంటికి చేరింది గ్రహించింది. అయితే ఆమెకు మనోవేదన ఎక్కువైంది. ఎంత దూరంగా అతని నుండి పారిపోదామనుకున్నా, పరిస్థితుల ప్రభావం వలన అతనింటికే చేరక తప్పలేదనుకుంది.

అయితే కుమార్ శ్రద్ధగా టైమ్ ప్రకారం ఆమెకు మందు లివ్వటం, ఆపేక్షగా పలకరించటం, ప్రేమగా పిల్లలిద్దర్నీ కూర్చోపెట్టుకొని కబుర్లు చెప్పటం — ఇవన్నీ ఆమె మనసుని ఏమాత్రం మార్చలేకపోయాయి! ఇవన్నీ లోకం కోసం డ్యూటీలా అతను చేస్తున్నాడేమో అన్న భావమే ఆమెకు కలిగేది.

దివ్య స్వాతిని 'అమ్మా' అని పిలవటం ప్రారంభించింది. అది గమనించి, స్వాతి చిన్నగా నవ్వుతూ, "ఏం నన్ను ఆంటీ అని పిలవటంలేదు." అని అడిగింది. దివ్య 'అమ్మా' అన్నందుకే ఆమె కెంతో హాయిగా అన్పించింది.

"బాబుకిలాగా నాకు నువ్వే అమ్మవని డాడీ చెప్పారుగా. అంతేకాదు, బాబు నాకు తమ్ముడట, ఇంకెప్పుడు ఇక్కడే వుంటాట్ట. నాతో స్కూలుకి వస్తాట్ట..." అంటూ దివ్య మురిసిపోతో చెప్పకు పోతోంది.

స్వాతి కా మాటల వెనక కుమార్ ఏదో మనసులో వుంచుకొని ఇదంతా చేస్తున్నాడనిపించింది. తన అభిప్రాయం ఏది తెలుసుకోకుండానే, అతను తనిష్టం వచ్చినట్లు వూహించుకోవటం ఆమెకు నచ్చలేదు. "అతని ఉద్దేశ్యం ఏమిటో, తనిప్పుడు దిక్కులేని పరిస్థితుల్లో అతనింటికి చేరింది కదా! ఈ వంకతో ఇక్కడే వుంచుకో వచ్చనా!"

అనేక రకాల ఆలోచనలతో ఆమె మనసు చాలా గందరగోళంగా తయారైంది. ఆ రోజు రాత్రి టెంపరేచర్ మళ్ళీ పెరిగింది.

"ఈ రోజు మళ్ళీ జ్వరం హెచ్చిందే!" అన్నాడు కుమార్.

"మీకెందుకి శ్రమ. నన్ను హాస్పెటల్లో చేర్పించండి. అక్కడ నర్సులు చూసుకుంటారు. బహుశ ఈ జ్వరం తగ్గటానికి రాలేదేమొ! నన్ను ఈ లోకం నుండి పంపటానికే వచ్చిందేమో!" అంది స్వాతి నిర్లిప్తంగా.

"అలా అనకు స్వాతీ! రెండు మూడు రోజుల్లో తప్పకుండా నార్మల్‌కి వస్తుంది."

"అయినా నన్నెందుకిక్కడకు తీసుకొచ్చారు. హాస్పెటల్లోనే చేర్చాల్సింది."

"నా కళ్ళముందర నిన్ను చూస్తుంటే కలిగే తృప్తి, ఆ హాస్పెటల్లో నిన్ను వదిలేస్తే కలుగుతుందా? అయినా నేనేమైనా నీకు లోటుచేస్తున్నానా, మాటి మాటికి హాస్పెటలంటావ్!"

"... ... ... ..."

"మనసు ప్రశాంతంగా వుంచుకో స్వాతీ. జ్వరం తగ్గాలంటే అదికూడ కొంత సహాయ పడుతుంది" అని చెప్పి, కుమార్ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)

# తిరిగిరాని వసంతం

— ఇల్యాస్ అహ్మద్ —

"మమ్మీ... మమ్మీ" అని బిగ్గరగా పిలుస్తున్న చైతన్య పిలుపుకు కిటికీలోనుండి మల్లె పందిరి వైపు తదేకంగా చూస్తున్న సుజాత ఉలిక్కిపడి వెనుతిరిగింది. హాల్లో ఓ అపరిచిత వ్యక్తి చేతుల్లో వుండి చేతులు సాచి పిలుస్తున్న చైతన్యను చూసి ఒక్క క్షణం ఆశ్చర్యపోయి ముందుకు నడిచింది.

"అరె!... ఏమిటిది? ఏమైంది బాబూ?" అంటూ మోకాలికి వున్న కట్టును చూస్తూ ఆందోళనగా చేతులు చాపిన సుజాత ఒళ్ళోకి వాలిపోయాడు చైతన్య.

"మరేం ఫరవాలేదు, గాభరా పడకండి. రన్నింగ్ రేస్‌లో పరిగెత్తుతుంటే చిన్న రాయి తగిలి క్రిందపడ్డాడు. డాక్టర్ దగ్గరికి తీసికెళ్ళాను. ఆందోళన పడవలసిన అవసరం లేదన్నాడు డాక్టర్. నాల్గు రోజుల్లో నయమైపోతుంది." అని చెప్తున్న అతనివైపు సాభిప్రాయంగా చూస్తూ—

"మీరు చాలా శ్రమ తీసుకున్నట్లున్నారు" అంది.

"శ్రమేముంది! చిన్నపిల్లలు, స్కూల్లో వారికేమైనా దానికి బాధ్యులం మేమే. అయినా చైతన్య అంటే నాకు ప్రత్యేకమైన అభిమానం వుంది. బికాజ్ హి ఈజ్ రియల్లీ బ్రిల్లియంట్. నేను చెప్పే ఇంగ్లీషులోనే కాకుండా మిగిలిన సబ్జెక్ట్సులో కూడా చాలా చురుకైనవాడు" అన్నాడు.

"నేను క్రింద పడకపోతే ఆ శీనుగాడి కంటే నేనే ఫస్టొచ్చేవాణ్ణి కదు మాష్టారూ?"

"ఓ యస్, తప్పకుండా నువ్వే వచ్చేవాడివి" అన్నాడు వీపు నిమురుతూ.

"ఆఁ వీడికి అసలు తెలివికంటే అతితెలివి ఎక్కువలెండి" అంది సుజాత.

"వెళ్ళొస్తానండీ" అంటూ లేవబోతున్న అతనివైపు తిరిగి "ఒక్క నిముషం కూర్చోండి" అంటూ లోపలికి వెళ్ళి కాఫీతో తిరిగివస్తున్న సుజాత వేపు చూసి చిరునవ్వు నవ్వాడతను.

* * *

ఎగ్జిబిషన్‌లో అంతా కోలాహలంగా వుంది. రకరకాల మనుషులు, రంగు రంగుల దుస్తుల్లో వస్తువుల ప్రదర్శనేమోగాని వీళ్ళని చూస్తుంటే కన్నుల కింపుగా వుంది. ప్రక్కన గ్రామ్‌ఫోన్‌లో జేసుదాస్ 'రంగ్‌బిరంగే ఫూల్ ఖిలేఁ హైఁ, లోగ్ భి ఫూలోఁ జైసే' అంటూంటే నిజమేననిపిస్తూంది.

తను వచ్చి అరగంట దాటింది. జనం తను వచ్చినప్పటికంటే రెండింతలైనారు. సరైన సమయానికి తను రాడు కానీ నన్ను రమ్మంటాడు. ఎంత ఎగ్జిబిషనైతే మటుకు చూసిందే విసుగ్గా వుంది. వాచీ చూశాడు పావు తక్కువ ఏడు. విసురుగా వెనుతిరిగేసరికి ఎదురుగా తెల్లటి చీరలో, మెరిసే కళ్ళతో అప్సరసలా వున్న ఆమె.

"గుడ్ ఈవినింగ్ మాష్టారూ!" అంటూ ముందుకొచ్చిన చైతన్యతో "గుడ్ ఈవినింగ్, షికారుకు బయల్దేరావన్నమాట" అంటూ బుగ్గలు నిమిరాడు.

"స్కూల్లో చెప్పారట ఎవరో, నిన్నటినుండి వేధిస్తున్నాడు తీసుకెళ్ళమని వెధవ. ఇక తప్పలేదు. ఏదో కాస్సేపు వుండి పోదామని వచ్చాం" అంది సుజాత నవ్వుతూ.

"ఒక్కణ్ణే తిరుగుతున్నాను ఇందాకట్నుండీ. బోర్ కొట్టేస్తూంది. ఇక వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను. మా ఫ్రెండ్ వస్తానన్నాడు. ఇంతవరకూ పత్తాలేడు" నవ్వుతూ అంటున్న అతని వైపు చూసి చిరునవ్వు నవ్వింది సుజాత.

"మాష్టారూ! అటు చూడండి, ఆ చక్రం ఎలా తిరుగుతోందో. అబ్బ వాళ్ళు అందులో కూర్చుని ఎంత బాగా తిరుగుతున్నారో! మాష్టారూ మనం కూడా వెళ్దామా" అంటూ హడావుడి చేస్తున్న చైతన్యవైపు కోపంగా చూస్తూ "వద్దు, కళ్ళు తిరుగుతాయి" అంది సుజాత.

"ఫరవాలేదు, నేను తీసుకువెళతాను. పిల్లలు చిన్న చిన్న కోరికలను తీర్చకపోతే వాళ్ళు చాలా నిరుత్సాహ పడిపోతారు" అంటూ సమాధానం కోసం కూడా చూడకుండా తీసుకెళుతున్న అతను వైపు చూస్తూ నిలుచుంది. బాబు అతని ఒళ్ళో కూర్చుని కేరింతలు కొడుతూ ఏవేవో మాట్లాడుతున్నాడు. అతను కూడా వాటికి సమాధానాలు ఓపిగ్గా ఇస్తున్నాడు. కొద్దిసేపట్లోనే ఎంత దగ్గరైపోయాడు బాబు! చిన్నపిల్లల మనస్సు చాలా సున్నితమైనది. సంతోషమొక్కటే తెలుసు వాళ్ళకి. చిన్నపిల్లలతో కలిసిపోయి వాళ్ళతో గంటలతరబడి మాట్లాడటంలోనే వుందనిపిస్తుంది పెద్దవాళ్ళ గొప్పతనం. తను మాత్రం, వాడి మనసెరిగి ప్రవర్తించడం లేదనిపిస్తుంది. ఆలోచనల నుండి తేరుకుని చూసేసరికి బాబుని తీసుకొస్తూ అతను కనిపించాడు.

"చూడండి. ఇవి తీసుకోమంటే నేను తీసుకోను వద్దు అంటున్నాడు. ఎవరైనా ఏమైనా కొనిస్తే తీసుకోవద్దు అని మా మమ్మీ చెప్పింది అంటున్నాడు.

నే చెప్తాలే అన్నా తీసుకోవట్లేదు.'' చేతుల్లోని రకరకాల బొమ్మలను చూపిస్తూ అన్నాడతను. ఒక్క క్షణం తటపటాయించి "తీసుకో బాబు" అంది సుజాత. ఏమంటుందోనని ఆందోళనగా చూస్తున్న చైతన్య ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"హల్లో! రజనీ, ఇక్కడున్నావా? నీకోసమే వెతుకుతున్నాను.'' 'రజని' ఇతని పేరేమో! అని అనుకొంటున్న సుజాతకు ఒక సమస్య తీరిపోయినట్లనిపించింది.

"ఇహ చాలించు! నిన్ను నమ్ముకుంటే ఇంతే! 'సిక్సోక్లాక్'కి వస్తానని చెప్పి ఇపుడా రావడం. ఇంకోసారి ఛస్తే నమ్మను'' అన్నాడు రజని.

"బాబ్బాబు! ఈసారికి క్షమించెయ్, మరోసారి ఇలా చెయ్యను. నువ్వు ఛస్తే నామీద నమ్మకం పెట్టుకొనే వాళ్ళుండరు. కాబట్టి నువ్వు కలకాలం బ్రతికుండాలి'' అంటూ నవ్వుతున్న సుధీర్‌ను చూపించి. "వారే ఈ సత్యవాక్పరి పాలకులు! ఖర్మకొద్దీ నాకు దొరికారు'' అంటూ పరిచయం చేశాడు రజనీ సుజాతకు.

"నమస్కారం'' అంటున్న సుజాత వైపు తిరిగి "మీరు మాత్రం నా సత్యవాక్పరిపాలనపై అనుమానం పెట్టుకోకండి; కొత్తవాళ్ళు పాతవాళ్ళు అని లేకుండా, ఎక్కడ ఎలా మాట్లాడాలో తెలియదు, వెధవకు'' అంటున్న సుధీర్ మాటలకు హాయిగా నవ్వేశాడు రజని. వాళ్ళ నవ్వుకు శృతి కలిపింది సుజాత.

* * *

పున్నమి వెన్నెల విరగ కాస్తోంది. ప్రకృతి కన్య వెన్నెల కిరణాలలో తడిసి పరవశించి చల్లగాలితో సరాగాలాడుతోంది. అణువణువునా అందం పొంగుతోంది. చూసే వారికి అంతరాంతరాల్లో అనురాగం వెల్లివిరుస్తోంది. కలువల్ని మత్తెక్కించే ప్రయత్నంలో చంద్రుడు తన శక్తినంతా వినియోగిస్తున్నట్లు వెన్నెల క్షణ క్షణానికి చిక్కబడుతోంది. పిట్టగోడ అంచు పైపైకెగ బాకుతున్న సన్నజాజి తీగపై తుమ్మెద ఒకటి అప్పుడే పూస్తున్న సన్నజాజులతో సరాగాలాడుతోంది. పిల్లగాలి తోడుతో ఆ పూబాల, తుమ్మెదతో 'నీకు దొరుకుతానా!' అన్నట్లు, అటూ ఇటూ వూగుతోంది.

మనసంతా ఏదో అయిపోతూ మత్తులో సోలిపోతోంది. 'రజనీ కన్య'ను పాలిస్తున్న ఆ నెలరాజులో ఏదో రూపం ఆకృతి దాల్చుతూ, కనిపించీ కనిపించనట్లు కనిపిస్తోంది రజనికి. కాలం స్తంభించింది. కళ్ళనిండా వెన్నెల, మనసునిండా వెన్నెల. ఆ రూపం...అవును...ఆమె...నవ్వుతోంది. సంపెంగ పువ్వులాంటి ముక్కు, క్రింద మధువులు జాలువారే ఎర్రని అధరాలు, విచ్చుకున్న అధరాల వెనుక మల్లెమొగ్గల లాంటి పలువరుస. అంతా తెల్లగా ... వెన్నెలలా ... చల్లగా నవ్వుతోంది.

ఇదేమిటి ఏదో ఝుంఝూమారుతం, చెవుల్లో మ్రోగుతోంది. అబ్బా! ... ఆ రూపం ... అరే అదృశ్యమైపోతోంది. అబ్బా! ...

రెండు చెవులు మూసుకున్నాడు. ప్రక్కకి తిరిగి చూస్తే దగ్గరగా సుధీర్ జిగ్‌జాగ్‌గా మ్రోగిస్తున్నాడు గిటార్‌ను.

'షటప్' గట్టిగా అరిచాడు. చెవుల్లో హోరు ఇంకా వినిపిస్తూనే వుంది.

"హమ్మయ్య! ఎంతగా పిలిచానో తెలుసా! వేరే ఉపాయం దొరకక ఇది తెచ్చాను'' అంటూ గిటార్‌ను ఆపి అన్నాడు సుధీర్.

"తిడితే తిట్టావ్‌గాని కొంచెం నా మాటలు కూడావిను. ఆ తర్వాత ఎంత తిట్టినా నేను భరిస్తాను, సరేనా! ఇపుడు నువ్విలా మారడానికి, అదే ఎంత పిలిచినా పలుకకుండా మాటలు రానట్లుగా వుండటానికి కారణం, నాకు తెలుసు'' అన్నాడు సుధీర్.

మనసంతా అస్తవ్యస్తంగా చిరాగ్గా వుంది రజనికి. పైనుండి సుధీర్ మాటలు ఇంకా వినుగుని కల్గిస్తున్నాయి.

నీలాకాశంలో ఒక ప్రక్కనుండి నల్లటి మేఘాలు కమ్ముకొస్తున్నాయి. వాతావరణం అంతా స్తబ్దంగా వుంది.

"నీలో ఈ రోజు కానవస్తున్న సంచలనానికి కారణం ఆమె కదూ!''

## అప్పుడు – ఇప్పుడు

ఒకప్పుడు మన దేశంలో
ఏ ప్రాంతంలో చూసినా
కనిపించేవారు నాయకులు.

ఇప్పుడూ మన దేశంలో
ఏ మూల చూసినా
కనిపిస్తారు నాయకులు.

అయితే
సేవా భావం రూపు గట్టిన
ప్రజా సేవకులు
పాత నాయకులు!

అధికార భావం రూపు దాల్చిన
ప్రజా ప్రతినిధులు
కొత్త నాయకులు!

— చల్లా రాధాకృష్ణశర్మ

"ఎవరు?''

"అదే ఇందాక ఎగ్జిబిషన్‌లో నీతో మాట్లాడుతుందే...'' అంటూ ఆగాడు సుధీర్.

"క్షణం క్రితం వరకూ తన మానస సంద్రాన్ని కల్లోల పరచిన ఆ రూపం... అవును ఆమెదే!'' గుండె వేగంగా కొట్టుకుంటోంది.

"అవును... చైతన్య మమ్మీ'' అంటూ ఆగాడు రజని.

"చైతన్య మమ్మీ ఏమిటోయ్, సుజాత. పేరు కూడా తెలీదా? సరిపోయింది.'' నవ్వుతూ అన్నాడు సుధీర్.

"సు...జా...త'' అస్పష్టంగా గొణిగాయి పెదవులు.

'నీకెలా తెలుసు?' అమాయకంగా అడిగాడు రజని.

"ఆమె పేరే కాదు, ఇంకో విషయం కూడా తెలుసు, ఆమె భర్త పోయాడు. సాంఘికంగా చెప్పాలంటే ఆమె విధవ. వాళ్ళ వూరి నుంచి వచ్చి ఇక్కడ ఏదో కంపెనీలో ఉద్యోగం చేస్తోంది అంతకంటె ఎక్కువగా ఆమె గురించి తెలుసుకోవలసిన అవసరం రాలేదు నాకు,'' అంటూ ఆగాడు సుధీర్.

నీలాకాశాన్ని అప్పటివరకూ యదేచ్ఛగా పరిపాలించిన నెలరాజును కారుమబ్బులు పూర్తిగా ఆక్రమించేశాయి. వెన్నెలను కోల్పోయి ప్రకృతి ఘోరు మంటోంది. పిల్లగాలి కాస్తా తుఫాను గాలిగా మారింది. పిట్టగోడపై తీగ గాలికి అల్లాడుతోంది. ఊపిరి బరువైపోతూంది. మనస్సులో ఏదో దిగులు ఆక్రమించుకుంది. గాలికి నేల వాలిన నైట్‌క్వీన్‌ను సుధీర్ నిలబెట్టి ఏదో ఊతగా పెడుతున్నాడు అంతకుముందు పరిమళాలు విరజిమ్మిన సన్నజాజులు నేలపై సుధీర్ కాళ్ళకింద నలిగిపోతున్నాయి.

"పద పద, వర్షం వచ్చేటట్లుంది గదిలోకెళ్దాం'' అంటూ చాపను చుడుతున్న సుధీర్‌ను అనుసరించాడు రజనీ.

* * *

"మాష్టారూ... అంకుల్. అంకుల్'' ఆశ్చర్యంగా వెనుకకి తిరిగి చూశాడు రజని. చైతన్య రొప్పుతూ పరిగెత్తుకొస్తున్నాడు.

"ఆ. ఆ.. మెల్లగా రా, నేనిక్కడే నిలబడ్డాలే,'' అని నవ్వుతూ వెనుకకు రెండడుగులు వేశాడు. దగ్గరగా వచ్చిన చైతన్యను ఎత్తుకొని ముఖంలోకి చూశాడు. పసితనపు అమాయికత్వం ఆ ముఖంలో దోబూచులాడుతుంటే, హృదయంలో ఏదో భావం కలుక్కుమంది. ఎండకు కంది ఎర్రగా వున్న బుగ్గపై ముద్దు పెట్టుకున్నాడు. కర్చీఫ్ తీసి ముఖమంతా తుడిచాడు.

"అంకుల్ మీరెళ్ళిపోతారని త్వరగావస్తున్నాను. మళ్ళీ మీ యిల్లు నాకు తెలియదుగా, మీరెళ్ళిపోతే'' ఆయాసం తీర్చుకోడానికన్నట్లు ఆగాడు.

చైతన్య సంబోధనకు ఆశ్చర్యపోతూ అడిగాడు. "బాబూ! అంకుల్ అని ఎవరు పిలవమన్నారు?''

"ఓ అదా! మరెమో మమ్మీయే అలా పిలవమంది. ఏం, అలా పిలవకూడదా?'' అమాయకంగా ముఖం పెట్టి అడిగాడు చైతన్య.

ఒక్క క్షణం గుండె లయతప్పింది. ఏదో తెలియని అనుభూతి మనసంతా నిండిపోయింది.

"అలా పిలవచ్చా మాష్టారూ...''

"ఓ, అలాగే పిలువ్ బాబూ. నేనేమీ అనను'' అన్నాడు వెంటనే.

"అంకుల్, రేపు నా పుట్టినరోజు. మీరు తప్పకుండా రావాలి!''

"ఓ, తప్పకుండా వస్తాను! అవునూ నీకెలా తెలుసు? నీ పుట్టినరోజని'' అడిగాడు రజని.

"మమ్మీయే చెప్పింది. ఎవరితోచెప్ప వద్దన్నది. మీతో కూడా చెప్పవద్దన్నది.''

"నిజంగానా! మరి చెప్పొద్దన్నా నాతో ఎందుకు చెప్పావ్? మమ్మీ కొట్టదా!'' ఆశ్చర్యంగా అడిగాడు రజని.

"ముందు అలా చెప్పింది. కానీ కొట్టదు. అయినా మీరు వస్తారుగా, నన్ను ఏమి అనదు'' ధీమాగా అంటున్న చైతన్యను చూస్తుంటే రజనికి ఏమనాలో తోచలేదు. ఎటూ తేలని ఆలోచనలు






మనసులో ముసురుకుంటుంటే మౌనంగా, మెల్లగా నడుస్తున్నాడు. చైతన్య మమ్మీ వద్దన్నా నాతో చెపుతున్నాడు. కాని సుజాత ఎందుకు అలా చెప్పి వుంటుంది ? నేను రావడం ఇష్టం లేదేమో ! మరి చైతవ్యకేమని చెప్పేది ? రజని ముఖం ఆలోచనలతో వాడిపోవడం చూసి ఏమనుకున్నాడో చైతన్య "అంకుల్ మీరు రాకపోతే నేను మీతో మాట్లాడను" కోపం ఆదుర్దా మిళితమైన స్వరంతో అన్నాడు చైతన్య.

'అహ హ॥ అలా కాదు. నే వస్తాలే" సమాధాన పరిచే యత్నంతో అన్నాడు.

"ఇదిగో ప్రామిస్ !?" ప్రశ్నార్థకంగా చేయి చాపిన చైతన్యను చూసి—

"ప్రా ... మి ... స్" దృఢంగా అంటూ చైతన్య చేయి నందుకున్నాడు రజని.

* * *

ఒకవైపు ఆనందం వేరొకవైపు సందేహం మనసును పీకుతుంటే గేటు తీసుకుని లోనికి అడుగు పెట్టాడు రజని. సన్నని కాలిబాట, ఇరువైపులా రకరకాల పూలమొక్కలు గాలికి తలలూపుతూ తనకు స్వాగతం చెపుతుంటే ముందుకు నడిచాడు రజని.

"టింగ్ టంగ్... టింగ్ టంగ్" కాలింగ్ బెల్ మోతకి చైతన్యకు అన్నం పెడుతున్న సుజాత పులిక్కిపడి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా తెల్లటి పాంటుపై తెల్లటి బుష్‌షర్టు టక్ చేసి నడుముకు నల్లటి బెల్టు వింతగా మెరుస్తుంటే చిరునవ్వుతో మెరిసే కళ్ళని తనవైపు కేంద్రీకరించి చిలిపిగా చూస్తున్న రజని.

అంకుల్ అంటూ ఉరికివస్తున్న చైతన్యను రెండు చేతులతో పైకెత్తి గట్టిగా బుగ్గపై ముద్దు పెట్టుకున్నాడు రజని.

"మెనీ మెనీ హాపీ రిటర్న్ ఆఫ్ ది డే, దిసీజ్ మై హార్టీ ప్రెజెంటేషన్ టు మై హార్ట్" అంటూ తను తెచ్చిన పెన్నును చైతన్య కిచ్చాడు రజని.

"చాలా బాగుంది అంకుల్ ! ఏదీ," అంటూ రజని రెండు బుగ్గలపైనా ముద్దు పెట్టుకున్నాడు చైతన్య. ప్రక్కనే నిలబడివున్నా తన్నుతాను మర్చిపోయి తన్మయత్వంలో మునిగిపోయింది సుజాత.

# తిరిగిరాని వసంతం

"బాబూ ! మమ్మీ మనకు స్వీట్స్ పెట్టదా!" అంటున్న రజని మాటలకు తేరుకుని చిరునవ్వుతో స్వీట్స్ తేవడానికి లోనికెళ్ళింది.

"మమ్మీ నోరు తెరుస్, అంకుల్ నోరు తెరుస్" అంటూ చైతన్య ఇద్దరికీ స్వీట్స్ అందిస్తూ కేరింతలు కొట్టసాగాడు. మధ్య మధ్యలో సుజాత విసుక్కోవడం గమనించాడు చైతన్య.

"అబ్బ! ఈ గులాబీలు చాలా బాగున్నాయి" టేబుల్‌పై రాశిగా పోసిన గులాబీల నుండి ఒక పువ్వును తీసి వాసన చూస్తూ అన్నాడు రజని.

"అంకుల్ అవన్నీ మా తోటలోవే ! ఇంకా చాలా పూలున్నాయి మా తోటలో, మమ్మీ అంకుల్‌కు మన తోట చూపిద్దాం రావూ !" అంటూ తోటలోకి దారితీశాడు చైతన్య.

రకరకాల పూల మొక్కలు, పూయని మొక్క లేదు. ఒకపక్క నందివర్ధనం మందార చెట్లు పక్కపక్కగా విరగపూసి ఆ తోటకే ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి. సన్నజాజి, మల్లె పందిళ్ల పందిరికి దట్టంగా అల్లుకుని తమకు, పందిరికివున్న బంధాన్ని లోకానికి చాటుతున్నాయి. ఒక్కొక్క పూవుని చూస్తూ, చైతన్య మాటలు వింటూ మెల్లగా నడుస్తున్నాడు రజని. ప్రతి మొక్క ఆకులను పువ్వులను జాగ్రత్తగా చూస్తూ సరిగ్గాలేని కొమ్మలను సవరిస్తున్న సుజాత తెల్లటి చీరలో విరిసిన మల్లెపందిరిలా అనిపించింది రజనికి. పువ్వుల అందాలని సహజంగా పొందిన సుజాతను తన్మయత్వంతో చూస్తుండిపోయాడు రజని.

"బాగా అలసిపోయాడు వెధవ. నిద్ర ముంచు కొచ్చింది ! బాగా విసిగించాడనుకుంటాను మిమ్మల్ని" అంది సుజాత భోజనం ప్లేటును సర్దుతూ.

"పిల్లలతో ఆడుకోవడం విసుగనిపించదు నాకు. నిజానికి అంతసేపూ ఈ లోకాన్నే మరచిపోవచ్చు అనిపిస్తుంది నాకు" అంటూ టేబిల్‌పై వున్న పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు రజని.

ఎలాగైనా ఇప్పుడే అడిగేయాలి ! మనసెందుకో తొందరపెడుతూంది. కాని, ఏమంటుందో అని సందేహం. ఏమైనా అననీ; ఒక దృఢ నిశ్చయానికి వచ్చాడు రజని.

చేతులు తుడుచుకుంటూ వచ్చిన సుజాతతో "మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి అలా కూర్చుంటారా" అన్నాడు.

ప్రసంగ ధోరణి మారేసరికి ఆశ్చర్యపోయి మెల్లగా ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంది.

"నా గురించి మీ అభిప్రాయ మేమిటి ?" సూటిగా వచ్చిన ప్రశ్నకు విస్తుపోయింది సుజాత.

'మీ కిష్టమైతేనే చెప్పండి. లేకపోతే లేదు" అన్నాడు.

ఒక్కక్షణం తటపటాయించింది. "నాకు తెలిసినంతవరకూ మంచి మనసున్న మనిషి" మెల్లిగా అంది.

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను మీకు అభ్యంతరం లేకపోతే ! మీ గురించి పూర్తిగా తెలుసుకోకుండా ఇలా మాట్లాడుతున్నానని అనుకోవద్దు. నాకు అంతా తెలుసు. మీమీద జాలికొద్దీ నేనీ నిర్ణయానికి రాలేదు. ఎందుకంటే నేనీ నిర్ణయానికి రాకముందే మీ గురించి ఒక అభిప్రాయం ఏర్పరచుకున్నాను. ఇందులో నా స్వార్థం లేకపోలేదు. నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆరాధిస్తున్నాను. ఒక మంచి మనసు కోసం నేను చేస్తున్న అన్వేషణలో, నా జీవితంలో ఇంతవరకూ అలాంటివారు తటస్థ పడలేదు. ఇకపోతే ఈ సంఘం, అది సృష్టించే సమస్యల గురించి మీ అభిప్రాయాలు ఏ విధంగా వుంటాయే నేమాహించగలను."

"కాని ... మీరు ..." ఏదో చెప్పబోయింది సుజాత.

"మీరు తిరిగ్గా ఆలోచించుకోండి. ఇప్పుడేమి చెప్పవద్దు. రేపు సాయంత్రం వస్తాను" అంటూ లేచి వెళ్ళిపోతున్న రజనీవైపు చూస్తూ నీరసంగా వెనక్కి వాలిపోయింది సుజాత.

మనసు కకా వికలమైపోయింది. నిశ్చలంగా వున్న సరోవరం నీటిలో రాయి విసిరి సంచలం రేపినట్లయింది. ఇన్నాళ్ళూ రజని పరిచయంలో మానసిక చైతన్యం పొందుతున్నట్లనిపిస్తుంటే దాని ఫలితం ఇదని అనుకోలేదు. మెదడులో ఆలోచనల



# ప్రకృతి అందమంతా వసంతంలా విరబూస్తోంది. ఎటు చూసినా పచ్చగా, పూలతో కన్నుల విందుగా వుంది.

**ఆకులేసి, మొగ్గతొడిగి, పువ్వులు విచ్చుకుని గుప్పున సౌరభాలతో గుబాళించినై. కొంటె గాలి ఆ పరిమళాన్ని పూసుకుని చెట్లపైనుంచి పయినమై పోతూంది.**

**గండు తుమ్మెదలు ఆ ఘుమఘుమలో దారి చూసుకుంటూ పువ్వులోవి మకరందం కోసం పరుగులుతీశాయి.**

వేడిగా, వాడిగా తనను తొలుస్తున్నది తుమ్మెదని భ్రమించిన పుష్పం – ఒక్కసారి వులిక్కిపడింది.

కిరణమాలి—వసంతంలో కూడా తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. వాడి మయూఖాలకు భీతి చెంది ముడుచుకుపోయి కినుకగా చూచింది ఓ గులాబి సుందరి. ఆ ప్రతాపానికే సంధ్య అతనిని వదిలి వెళ్లిపోయిందని అప్పుడే మరచిపోయినట్లున్నాడు – ప్రక్క పూబంతితో గుసగుసలాడింది.

వసంతం పోలేదు— గ్రీష్మం రాలేదు— అయినా పది గంటలకే ఎండ చిటపటలాడుతోంది. కారు దిగి చకచకమని మెట్లెక్కి ఆఫీసు గదిలోకి వెళ్లి కూర్చున్నాడు రవిచంద్ర. ఎయిర్‌కండిషనర్ పని చేయటం ప్రారంభించింది.

రూపవంతుడు యవ్వనుడైన రవిచంద్ర బి. యి, పారిన్‌లో యం. బి. ఎ. చేశాడు. అతనికి వున్న డిగ్రీలకు చేస్తున్న వుద్యోగానికి సంబంధం లేదు. అతనికి వున్న సాహిత్యాభిలాషతో చేస్తున్న పెద్ద పత్రికా సంస్థలో మేనేజింగ్ ఎడిటర్‌గా వున్నాడు. తను ఇంజనీర్ అని మరచిపోలేక తార్వాకాలో స్వంతానికి ఓ ఇండస్ట్రీ పెట్టుకున్నాడు.

రవిచంద్ర మెత్తని స్ప్రింగ్ ఛైర్‌లో కూర్చుని దైవాన్ని స్మరించినట్లుగా – అలా క్షణం కళ్లు మూసుకుని తెరిచాడు. ఆఫీస్ బాయ్ రాము ఆ రోజు పోస్టు తెచ్చి ముందుంచాడు.

పోస్టు చూడటంతో పని ప్రారంభమవుతుంది. పెద్ద కట్టలో ఆఫీసుకు సంబంధించిన వుత్తరాలు – పత్రికలకు పాఠకులు వ్రాసిన వుత్తరాలనుంచి స్వంత

వర్షం ప్రారంభమైంది. తనకు ఊహ తెలిసినప్పటి నుండి తన జీవితం తన ప్రమేయం లేకుండా అనుకోని మలుపులు తిరిగింది. ఆలోచనలు గతంలోకి పరుగు తీస్తుంటే భారంగా కళ్ళు మూసుకుంది సుజాత.

తను బి. య్యే. పరీక్షలు రాసి ఇంటికి రాగానే తల్లిదండ్రులు పెళ్ళి నిశ్చయించారు. వివాహం, భర్త, సంసారం గురించి ఒక నిర్దిష్టమైన అభిప్రాయం ఏర్పరచుకోకముందే రఘురాం భర్తగా తన జీవితంలోకి ప్రవేశించాడు.

తరువాత రఘురాం ఏక్సిడెంట్‌లో ఈ లోకం విడిచినా అతని ప్రేమానురాగాల ఫలితంగా తన కడుపులో శిశువు పెరుగుతున్నదని గ్రహించిననాడు, విధి తనకు ప్రసాదించినది అదృష్టమో, దురదృష్టమో తేల్చుకోలేక పోయింది. తల్లిదండ్రులు వేరే ప్రయత్నాలలో వుండగా తను ఇక్కడికి వచ్చేసింది.

"ఈ ప్రపంచంలో తనకొక బంధం బాబు బాబుని చదివించి పైకి తీసుకురావాలనే ధ్యేయం కల్పించుకున్నా ఇప్పుడు రజని పరిచయం తన జీవితంలో మరో మలుపుకు నాంది పలుకుతోంది, అనే విషయం విచిత్రంగా తోస్తోంది.

* * *

ఉదయం నుంచి వాతావరణం అల్లకల్లోలంగా వుంది. వుండి వుండి గాలి హోరున వీస్తోంది ఆలోచిస్తూ కూర్చున్న సుజాత 'అమ్మా సుజాతా' అంటూ వచ్చిన పార్వతమ్మ పిలుపుకు బైటికి వచ్చింది.

ఎదురింట్లో వుంటున్న పార్వతమ్మ అప్పుడప్పుడూ వచ్చి ఆవిడ కొడుకు కోడళ్ల విషయాలు, లోకంపోకడలు చెప్తూ వుంటుంది.

"ఏమ్మా ! అలా నీరసంగా వున్నావ్? ఒంట్లో బాగాలేదా?" అంటూ ముఖంమీద అడిగేసరికి సుజాత ఒక్క క్షణం ఖంగారు పడింది. ఆలోచనా భారంతో వడలినట్లున్న ముఖాన్ని మామూలుగా వుంచడానికి ప్రయత్నిస్తూ,

"ఆఁ. ఏమీ లేదండి కొంచెం తలనొప్పిగా వుంది అంతే" అంది తెచ్చి పెట్టుకున్న నవ్వుతో.

"అంతేనా! పోనీలె, నేనుకూడా, ఏదో కాస్త తెరిపెగా వుంటుంది మాట్లాడుకుంటుంటే అని వచ్చాను" అంది.

"అదేవిటండీ పనిమనిషి వుండగా మీకంత శ్రమెందుకు కల్గింది" అంది ఆశ్చర్యంగా !

"ఇవ్వాళ అది రాలేదమ్మా ! దాని కొడుకు ఇంట్లోంచి పారిపోయాడట. అందుకనే, పోలీస్ స్టేషననీ అదనీ, ఇదనీ తిరుగుతోంది. ఆ కొడుకు తండ్రి చిన్నప్పుడే పోయాడట. అప్పటినుండీ ఎవడో దానితో వుంటున్నాడట అయినా ఏ వయసులో జరిగేవి ఆ వయసులో జరగాలి. పాడులోకం కాకపోతే, ఆ కొడుక్కి ఇప్పుడు తెలిసొచ్చిందట వాడేమో ఇంట్లో వుండనని పారిపోయాడట." అంటూ తనకు తోచినట్లు చెప్పుకుపోతోంది పార్వతమ్మ.

ఈదురుగాలి వేగం హెచ్చింది. వర్షం రాబోతున్నట్లుగా ఆకాశం మేఘాలతో కమ్ముకొంది కిటికీలు, తలుపులు దబదబా కొట్టుకుంటున్నాయి

బయట చెలరేగే తుఫానుకు పోటీగా సుజాత అంతరంగంలో ఆలోచనల తుఫాను మొదలైంది

"బట్టలు బైట ఆరేశాను, గాలి వీస్తోంది, వెళ్తొస్తానమ్మా" అని వెళ్ళిపోయింది పార్వతమ్మ

"అమ్మా ఆకలౌతోంది" అంటూ కుదుపుతున్న బాబును చూసి ఈ లోకంలోకి వచ్చింది సుజాత కిటికీలు తలుపులు అన్నీ వేసి బాబుకు అన్నం పెట్టి పడుకోబెట్టింది.

* * *

"తనకోసం ఎదురుచూస్తూ వుంటుంది సాయంత్రమే వస్తానని చెప్పాను. ఈ పాడు తుఫాను శనిలా దాపురించింది. అయితే ఏం ! సుజాతకు తనంటే ప్రేమ వుంది. తప్పకుండా అంగీకరిస్తుంది" అనుకుంటూ సుజాత ఇంటివేపు గబగబా అడుగులు వేస్తున్నాడు రజని.

సంతోషంతో కదం త్రొక్కుతున్న మనసును అదిమిపెట్టి మెల్లిగా గేటుతీసి లోనికి అడుగు పెట్టాడు. కాలిబాట నిండా ఆకులు, కొమ్మలు చిందర వందరగా పడివున్నై. మొక్కలన్నీ నేల కొరిగిపోయి లేవలేనట్లు అయిపోయినై పూలన్నీ వాననీటికి చివికి దీనంగా చూస్తున్నై. తోటంతా భీభత్సంగా తయారైంది. చుట్టూ పరికించుతూ తలుపును సమీపించిన రజనికి, తలుపుకు వేళ్ళాడుతూ వెక్కిరిస్తున్న తాళం సాక్షాత్కరించింది. చుట్టూ శ్మశాన నిశ్శబ్దం ఆవరించింది. ★


# ఆంధ్రపత్రిక

## జంషెడ్‌పూర్‌లో తెలుగువారికి...

**ఇప్పుడు జంషెడ్‌పూర్‌లో ఆంధ్ర సచిత్ర వారపత్రికతోపాటు ఆంధ్రపత్రిక దినపత్రిక కూడా లభిస్తోంది.**

**దినపత్రిక కావలసినవారు మా వారపత్రిక అమ్మేచోట అడగండి. లేదా మా ఏజెంటును సంప్రదించండి.**

*: మా ఏజెంటు చిరునామా :*

మెస్సర్స్ సన్యాల్ బ్రదర్స్,
భారి భవనం, మొదటి అంతస్తు, మెయిన్ బజారు,
జంషెడ్‌పూర్ - 831 001

కొత్త సీరియల్ ప్రారంభం!



# [illegible]

చిట్టూరెడ్డి సూర్యకుమారి

వుత్తరాలు వేరుపరుచుకుని ప్రక్కన పెట్టాడు. ఆఫీసుకు సంబంధించిన వుత్తరాలు చించి — సారాంశం చదివి — ఆ కాయితంలోనే తన రిమార్కులు — జవాబు రెండు మూడు మాటల్లో వ్రాసి ట్రేలో పడేశాడు — ఆఫీసు బాయ్ అవన్నీ సరిచేసి, క్లర్కు దగ్గరకు తీసుకువెళ్లాడు.

ముందు పాఠకుల నుంచి వచ్చిన వుత్తరాలు చూడసాగాడు.

ఎడిటర్‌గార్కి నమస్కారం,

మీరు ప్రారంభించిన కొత్త సీరియల్ ఆదిలోనే మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకుంది. మంచి మంచి సీరియల్స్, కథలు అందించటంలో మీకు మీరేసాటి. ఇలాగే మంచి మంచి కథలు అందిస్తారని ఆశిస్తూ—

ఇట్లు
మీ సాహిత్య ప్రియుడు.

డియర్ ఎడిటర్,

డిసెంబర్ నెల మీ (మా) పత్రికపై మా అభిమాన నటి ముఖచిత్రం చూసి చాలా సంతోష మైనది. ఆ ముఖచిత్రం పత్రికకే హైలైట్. సెలవు.

"... ... ... ..."

మహాశయా,

మీ సంపాదకీయం బ్రహ్మాండం. మీ శైలి అమోఘం. కీపిటప్.

మీ శ్రేయోభిలాషి.

ఎడిటర్‌గారూ,

మీకో విన్నపం. పేరున్న రచయిత (త్రు) ల కథలేనా మీరు వేసుకొనేది. కొత్తవారికి చోటులేదా? వారికీ ప్రోత్సాహమిచ్చి పుణ్యం కట్టుకోండి.

ఇట్లు,
ఓ వర్ధమాన రచయిత.

శ్రీ శ్రీ ఎడిటర్‌గార్కి,

నేను క్షేమం. మీరు క్షేమమని భగవంతుని యందు నమ్ముచున్నాను.

నేను కొన్ని కథలు, కొన్ని నవలలు వ్రాసాను. మీకు ఎలా పంపాలి. రిజిష్టర్ పోస్టులో పంపించాలా?

కథలో కామాలు ఎక్కడెక్కడ వుపయోగించాలో దయచేసి తెలుపవలయును. సీరియల్ నవలకు పంపే నవలను కొద్దికొద్దిగా పంపాలా, లేక అంతా పంపవలెనా? బొమ్మలు కూడా మేమే వేయవలెనా, లేక మీరే వేయించెదరా! సీరియల్ ప్రారంభంలో పైన వ్రాసే వాక్యాలు ఎవ్వరు వ్రాస్తారు—అవికూడా నేనే వ్రాయవలెనా? పేపరుకు ఒక ప్రక్కనే వ్రాయవలెనా? ఎందుకు? పరీక్షలు వ్రాసే పేపర్లలో వ్రాయాలా లేక, నోటుబుక్కుల్లో రూల్సు పేపర్లో వ్రాయవచ్చా? ఎందుకంటే రూల్సు పేపరుపైనా అక్షరాలు బాగుంటాయి. ఇంకా ఎన్నో వ్రాయాలని వుంది. హైదరాబాదుకు వస్తాను. ఆఫీసుకు రావాలా? ఇంటికి రావాలా! వస్తే మాట్లాడుతారా!.........

కొత్తగా పుట్టిన రచయిత వుత్తరం చాలా పెద్దగా వుంది. అన్నీ సమస్యలే. బల్ల క్రిందవున్న చెత్తబుట్టలో పడేస్తూ జాలిగా చూశాడు ఆ వుత్తరం వైపు.

మరొకతను ఇలా వ్రాశాడు.

మిస్టర్ ఎడిటర్,

"మీరు ఎక్కువగా ప్రేమ కథలే వేస్తున్నారు. పోయిన మాసపత్రికలో వచ్చిన కథలన్నీ పరమ చెత్తగా వున్నాయి. కాస్త వాస్తవంలోకి చూడండి."

ఆ వుత్తరం చదివి రవిచంద్ర నవ్వుకున్నాడు. అంతలో అసిస్టెంట్ ఎడిటర్ వచ్చాడు. "గుడ్ మార్నింగ్ సార్" అంటూ. ఉత్తరాలకట్ట ముందుకు జరిపాడు రవిచంద్ర.

"సార్! మంత్లీ తయారైపోయింది—సీరియల్స్ ఇంకా రాలేదు—"

"ఈసారి నుంచి పూర్తి నవల తీసుకుందాం—ఈ కష్టాలు పడలేము. టెలిగ్రాం యివ్వు—లేకుంటే ఎవరైనా పంపు. దగ్గర వుండి రాయించుకు వస్తాడు." అసిస్టెంట్ వెళ్లిపోయాడు.

రవిచంద్ర కుర్చీకి చేరగిలబడి స్వంత వుత్తరాలు విప్పాడు.

'రచన' వార, మాస పత్రికలకు మేనేజింగ్ ఏడిటర్ అయిన రవిచంద్ర ఆంధ్రుల అభిమాన

ప్రియతమ ప్రఖ్యాత రచయిత "పతి" ఒక్కరే అని చాలామందికి తెలియదు.

పాఠకుల అభిమానం— ప్రేమ ఆదరణకు కొదువలేదు— అతని రచనలు ఇస్తే పత్రికలవాళ్ళు, కళ్ళకద్దుకుని తీసుకుంటారు. అలా అని అదేపనిగా కధలు వ్రాయడు. పత్రికలవాళ్ళు, పబ్లిషర్లు వత్తిడి చేస్తున్నారు. అవకాశం తలుపుతట్టి పిలుస్తున్నదని— కలంపట్టి కాగితాలు ఖరాబుచేయడు. ఒకే మూసలో నుంచి తీయడు. మీరు ఎంతవ్రాస్తే అంతే వేసుకుంటాము అని ప్రాధేయపడినా—అలా కాస్త కూస్త సీరియల్ అందిస్తే తీసుకునేవాళ్ళు ఎన్ని సమస్యలు ఎదుర్కోవాలో అతనికి తెలుసు. పైగా రచయిత కూడా మనిషే. అతనికి సమస్యలు, అతని మనస్సు శారీరక, పరిస్థితి— ఆయా సమయాలను బట్టి అతను వ్రాసే నవలపై వద్దు అనుకున్నా పడి తీరుతుంది. ఆ పాత్రల తీరు— కధా గమనం మారిపోవచ్చు— అందుకే అప్పుడు కాస్త అప్పుడు కాస్తా వ్రాయడు. ఒక ప్లాను ప్రకారం కధ అల్లుకుపోతాడు. కధవెంట కధ, నవలవెంట నవల వ్రాయడు. వాడిన మాటలు, వచ్చిన సంభాషణలు వచ్చే ప్రమాదము వుంది. కొత్తదనం వుండదు. అందుకే బాగా గాప్ యిస్తాడు. ఒక నవల చదివితే పది కాలాలపాటు కాకపోయినా, పదిరోజులైనా గుర్తించుకొనేలా వుండాలని కధలో కొత్త విషయాలు చెబుతాడు— కేవలం కధ కొరకే కధ కాకుండా— అతను చెప్పే కాల్పనిక కధలో ఎద్యుకేషన్ వాల్యూ కూడా కొంత వుంచటానికి తాపత్రయ పడుతాడు. అందుకే అతని అభిమానాల్లో అన్ని తరగతులవాళ్ళు వున్నారు.

అభిమానుల నుంచి వచ్చే వుత్తరాలు చిత్ర విచిత్రంగా వుంటాయి.

ఈ మధ్య 'రచన' (తన) వీక్లీలో సీరియల్— యువ పాఠకులను బాగా ఆకర్షించింది. ఆ ప్రేమ కధను వాళ్ళు మరిచిపోలేదు. సీరియల్ ముగిసిపోయినా — వుత్తరాలు పరంపరగా వస్తూనే వున్నాయి.

"మీ నవల్లో హీరోయిన్ చాలా అందంగా వుంటుంది. మీరు సౌందర్యోపాసకులు. ప్రేమ కధలు వ్రాయటంలో మీకు మీరే సాటి. సెక్సు కూడా

## రా గా గ్ని

చాలా అందంగా ఇమిడ్చేస్తారు. మీరు గొప్ప రసికులు. అవునా ?" అని కొందరు ప్రశ్నిస్తే,

"మీరు రాసే రచనలు బట్టి మిమ్మల్ని వూహించుకోవచ్చు— ఆరడుగుల ఆ కథానాయకుడు మీరేనా ? మీకు విశాలమైన ఛాతి, సింహానికున్నట్లు సన్నని నడుము— చిరుతలా, పొడుపుగా వుంటారు— అవునుకదూ ! మిమ్మల్ని చూడాలని చాలా ఆత్రంగా వుంది. మీ ఫోటో పంపరూ ? వళ్లంతా కళ్లు చేసుకుని చూస్తుంటాను" అని ఒక అమ్మాయి వ్రాస్తే— మరో అమ్మాయి—

"మీ నవలల్లో— పొడుపు దుడుకు ఆవేశాలు చదివి— మీరు యవ్వనులని గ్రహించాను. నేను మీ హీరోయిన్‌లా అందంగా వుంటాను. మీరు కోరిన కట్నం తెస్తాను — నన్ను పెళ్లి చేసుకుంటారా ?" అని ప్రాధేయపడుతూ — మరో పిచ్చి అభిమాని వ్రాసింది.

అలాటి వుత్తరాలు చదువుకోటానికి ఎంతో బాగుంటాయి — ఆ వుత్తరాల్లో మాటలు — ఎదురుగా నిల్చుని చెప్పుతున్నట్లే భావించుకుంటాడు. చదువుతుంటే యువ హృదయం గర్విస్తుంది — ఆరాధన అతనికి థ్రిల్లింగ్‌గా వుంటూ — ఇంకా, మంచిగా, అందంగా — కొత్త సృష్టి చేసి వారి ముందుంచి వారిని రంజింప చేయాలనిపిస్తుంది.

అభిమానుల వుత్తరాలు చదవాలంటే వుత్సాహంగ — ప్రోత్సాహంగా, ఇష్టంగా వుంటుంది. అర్జంటు పనులు పూర్తిచేసి, తీరికగా వుత్తరాలు చదవటం అలవాటు.

ముత్యాల్లాంటి అక్షరాలల్లో తన పేరు చూచుకుంటూ — ఆ కవరు చించాడు.

నా అభిమాన ఆరాధ్య దైవం అయిన పతిగార్కి,

హృదయాంజలులు అర్పించుకుంటూ వ్రాస్తున్నాను. నాలాంటి అభిమానులు మీకెందరో! ఓ సామాన్యురాలికి జవాబు యిచ్చే ఓపిక, తీరిక మీకు ఉండకపోవచ్చు—ఇంతకుముందు పత్రిక ద్వారా వ్రాసిన వుత్తరాలు మీకు అందాయా లేక బుట్టదాఖలా చేశారో తెలియదు. మీ అడ్రస్ సంపాదించి, మీకు నేరుగా వుత్తరం వ్రాస్తున్నాను. మీ అడ్రస్ ఎలా సంపాదించానో వ్రాశానంటే ఓ పెద్ద సస్పెన్స్ సీరియల్ అవుతుంది. మీ కధలన్నా, మీరన్నా నాకెంతో యిష్టం— మీ కధలను విమర్శిస్తే నేను సహించలేను— మీ తరవున నేను లాయర్ని అవుతాను అవతలివాళ్ల నోరు కట్టేసేదాకా నిద్రపోను. మీరు నాకు వుత్తరం వ్రాస్తారా ? ఫోటో పంపుతారా ? మా ఫ్రెండ్స్‌కి గొప్పగా చూపించుకుంటాను. మిమ్మల్ని ప్రేమిస్తున్నాననేకంటే వూజిస్తున్నానంటే నమ్మండి— మిమ్మల్ని పిచ్చిగా ఆరాధించే అభాగినికి జవాబు ఇవ్వరూ! సంతకమైనా వ్రాయండి చాలు—

ఇట్లు,
మీ పిచ్చిది.

అని వ్రాసింది ఆ అక్షరాలు ఎర్రగా వున్నాయనిపించాయి! ఎర్రసిరాతో వ్రాసినట్లుగా లేదు— ఏరకం పెన్నుతో వ్రాసినట్లు అని సాలోచనగా చూస్తూ వెనక్కుతిప్పి చూశాడు. "చూశారా ! నా రక్తంతో నా పేరు వ్రాశాను" అని వుంది.

రవిచంద్ర గుండె ఝల్లుమంది. ఆ పిల్ల అభిమానానికి కళ్లు చెమ్మగిల్లాయి. అలాగే ఆ వుత్తరం వైపు చూస్తుండిపోయాడు. ఈ యువ తరానికి ఏమివచ్చినా పట్టలేరు. ఆవేశపరుల గురించి జాలిపడుతున్నట్లు నిట్టూర్చాడు

అసిస్టెంట్ ఎడిటర్‌గారు నవ్వుకుంటూ వచ్చారు. "సార్—కొత్తగా ప్రారంభించిన ఓ రచయిత కధలో ఈ ఇరవై రూపాయల నోటుంది. కధ వేసుకోడానికి ఇంకా పంపవలసివుంటే వ్రాయండి. తిరుగుటపాలో పంపుతాను. అంటున్నాడు" అని పకపకా నవ్వాడు.

"రచయితలకి విజ్ఞప్తి పేరున రూల్సు రెగ్యులేషన్స్— పేపరుకు ఒకవైపునే వ్రాయాలి. కధనచ్చి ప్రచురణకు తీసుకుంటే పారితోషికము వుంటుంది అని అలాటి విషయాలన్ని ప్రకటనకు ఇవ్వండి."

అతను వెళ్లిపోతుంటే ఆర్టిస్టు అతను వేసిన చిత్రాలు తీసుకువచ్చి, బల్లపై పరిచాడు. ఒక్కొక్కటి పరీక్షగా చూచి తనకు బాగా నచ్చినవి, సెలక్టుచేసి, అవి వేయమని చెప్పాడు— అతను వెళ్లిపోతుంటే "సీరియల్‌కు వేసే చిత్రాల బ్లాకు






# ప్రతి వయసులోనూ మీకు తోడు.

అమ్మకీ, నాన్నకీ, పసివాళ్ళకీ, అమ్మమ్మకీ, తాతయ్యకీ. హార్లిక్స్ అందరికీ ఎంతో మంచిది.

హార్లిక్స్ అంటే శాశ్వత ఆరోగ్యం.

అందువల్లనే కోట్లాది మంది 100కు పైగా సంవత్సరాల నుంచి హార్లిక్స్ మంచి గుణాలను విశ్వసిస్తున్నారు.

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న డాక్టర్లంతా ఆరోగ్య సంరక్షణకు హార్లిక్స్ ఆదర్శప్రాయమైనదని సిఫారసు చేశారు. అంటే ఆశ్చర్యం లేదు.

హార్లిక్స్‌లో ఉన్న విలువైన, స్వచ్ఛమైన పోషక పదార్థాలను, వాటి మంచి గుణాలను కాపాడే విధంగా, తేలికగా జీర్ణమయ్యే విధంగా అద్భుతమైన పద్ధతిలో మిశ్రమం చేశారు.

హార్లిక్స్ మీ కుటుంబ జీవితంలో భాగంగా ఉండేట్టు చూచుకోండి. మీ కుటుంబ సభ్యులందరికీ కావలసిన శక్తి నంతా సమకూరుస్తుంది.




మంచి పుష్టికరమైనది

HTD-HMM-7535

వచ్చిందా, ప్రెస్‌కు ఫోన్‌చేసి ముఖచిత్రాలు (సినీ తారలవి) కాస్త తొందరగా ఇవ్వమని చెప్పండి" అన్నాడు. ఇంకా చేతిలోనే వున్న అభిమాని వుత్తరాన్ని జాగ్రత్తగా తిరిగి కవరులో పెట్టి—డ్రాయర్‌లో వేసి తాళం పెట్టాడు.

తనను కదిలించిన అభిమానుల వుత్తరాలు జాగ్రత్తగా ఫైల్ చేస్తుంటాడు రవిచంద్ర.

పాకెట్ బుక్‌లో తను బ్రీఫ్‌గా రాసుకున్న పాయింట్స్ ఒకసారి చూచుకుని, పై వారం వీక్లీకి ఇవ్వవలసిన ఎడిటోరియల్ రాస్తున్నాడు. కంపోసింగ్ చీఫ్ మాణిక్యరావు వచ్చాడు. స్వంత కష్టాలు — లోకాభిరామాయణం మాట్లాడుతుండగా ఫోన్ మ్రోగింది. ఫోన్ ఎత్తి "యస్ రవిచంద్ర... ఆఆ నమస్కారం."

"థ్యాంక్యూ . మీరెలా వున్నారు! యిప్పుడేం వ్రాస్తున్నారు."

... ... .. ... . .

"మొదలుపెట్టరా — నవల పూర్తిగా వ్రాసి పంపండి..." అవతల మాట వింటూ కళ్లు పెద్దవి చేసి మౌత్ పీస్ మూసి — "వనజగారు ఫోన్‌లోనే తను వ్రాస్తున్న కథ చెప్పేస్తున్నారు" అని చెప్పి, చెయ్యి తీసి,

"ఆ...ఆ సబ్జక్టు బాగుంది."

.. ... ... ... .

"తప్పకుండా"

. .. ... .. ...

"అలాగే, అలాగే వుంటాను" అని పెట్టేసి అలుపు తీసుకున్నాడు రవిచంద్ర.

మాణిక్యరావు 'పిళ్ల దుంపతెగ తెగరాస్తున్నారు— రచయిత్రులు ఒక ప్రక్కన వంట చేస్తూ, మరో ప్రక్కన వ్రాస్తుంటారు కాబోలు. మా ఆవిడ్ని కూడా రాయమంటున్నా —" అని నవ్వుతూ వెళ్లి పోయాడు.

భయపడ్డట్టు చూశాడు రవిచంద్ర — 'ఆవిడ వ్రాయకూడదు — రాయకూడదు. రాసిందంటే తన కొంప మునుగుతుంది. అది ఎలా వున్నా సరే — వేయమని తన ప్రాణాలు తింటాడు — వీడు' తల

## రా గా గ్ని

పట్టుకున్నాడు రవిచంద్ర.

డిప్యూటీ ఎడిటర్ రెండు చేతుల్లో కథలు — బాగున్న కథలు, బాగున్నాయనిపించిన కథలు పట్టుకు వచ్చాడు. బల్లమీద వుంచి — ఎదురుగా కూర్చున్నాడు ప్రముఖ రచయితల కథలు — వేరుగా వుంచాడు.

"ఏమన్నా వైవిధ్యమున్న కథలు దొరికాయా?" అన్నాడు — ఎడిటోరియల్ తిరిగి వ్రాస్తూ.

"హాస్య కథలు కావాలన్నామా! నవ్వుదామన్నా నవ్వు రావటంలేదు సార్! పోలీసువాళ్లమీదకు దండెత్తినట్లు పోలీసు కథలు వచ్చాయి సార్!"

"ఒకే సబ్జక్టు కాకుండా! వైరైటీ వున్న నాలుగు రకాల కథలు — ఏరి ఇవ్వు — చదివిస్తాను."

"మూడు సంవత్సరాల నవల్సు పేరుకుపోయి వున్నాయి సర్."

"ఇన్నిరోజులు వుంచేసుకుంటే ఎలాగయ్యా! వాళ్లు మనల్ని తిట్టుకుంటూ వుంటారు—ఈనెలలో అవన్నీ చూచి— రెండు సంవత్సరాలకి వుంచుకుని— ఆయా రచయితలకు తెలిపేయండి. రచయితను కనుక రచయితల మనస్సు నాకు అర్థమవుతుంది."

తర్వాత కొత్త శీర్షికల గురించి కాసేపు చర్చించుకున్నారు.

"ఈ నవల బాగుంది. కొత్త రచయిత్రి రాసింది. చూస్తారా ?"

"సీరియల్‌కి పనికివస్తుందా ?"

"సస్‌పెన్స్ అట్టే లేదు— శైలి చెప్పినతీరు బాగుంది."

"మంత్లీలో వేయండి— కొద్దిగా సెక్స్— సస్‌పెన్స్ క్రైమ్— నవలలు చూడండి— ఈసారి అలాటి నవల సీరియల్‌గా వేద్దాం— ప్రేమ కథలకి గిరాకీ తగ్గినట్లు కనిపిస్తోంది— హారర్ కథలు— సెక్స్ కథలవైపు పాఠకులు మొగ్గుతున్నారు— ఆ రకంలో నవల వ్రాయించండి— మన 'కృష్ణ'కి చెప్పండి. సెలవు పెట్టయినా రాసి యివ్వమని చెప్పండి— కథ ప్లాటు తయ్యారుచేశాక మనతో డిస్కషన్స్‌కి రమ్మని చెప్పండి— ఆ రాత్రికి డిన్నర్ ఏర్పాటుచేసి రమ్మనండి— మనం అక్కడే మాట్లాడుకోవచ్చు—"

రాత్రికి ఫస్ట్‌క్లాస్ అయిన డ్రింక్, డిన్నర్ పార్టీ. ఇలాంటి పార్టీలంటే డిప్యూటీ పడి చస్తాడు. రవిచంద్ర ఏం చేసినా గ్రాండ్‌గా చేస్తాడు. పాఠకుల నాడి పట్టుకుని చూసి—ఆ విధంగా వారికి కావలసినది వెంటనే అందిస్తాడు. అందుకే 'రచన' అన్నిరకాల పాఠకులను ఆకట్టుకుంటుంది. పత్రికా సంస్థ అభివృద్ధి చెందుతూ— లాభాలను ఆర్జించి పెట్టుతుంది. ఆ కీర్తి, ఘనత రవిచంద్రదే.

ప్రముఖ రచయితలను కొందరిని తన సంస్థకే సంబంధించిన వారిగా అనుకుని— ఇలా అవసరమైనప్పుడు పాఠకుల అభిరుచికనుగుణంగా 'రచన' కొరకు రచనలు చేయిస్తుంటాడు.

మందు కొట్టితేకాని కవిత రాయలేని కవులకు ముందు బాటిల్ వుంచి దగ్గర వుండి కమ్మని కవితలు రాయించిన రోజులు వున్నాయి. డిప్యూటీకి రవిచంద్రపై బోలెడంత నమ్మకం వుంది. అతని దగ్గర నేర్చుకోవలసినది ఎంత అయినా వుంది ఈ అనుభవంతో తను ఎడిటర్‌గా అయ్యే అవకాశం వుంది. బల్లపై తను ప్రచురణకు ఎన్నుకున్న కథలు — నవల వుంచి — సంతోషంగా నిష్క్రమించాడు డిప్యూటీ ఎడిటర్ రాజారాం.

ఎడిటోరియల్ ముగించి — తలెత్తేటప్పటికి ఫోన్ మ్రోగింది. టైం చూసుకున్నాడు. సరిగ్గా ఒంటిగంట అయింది. ఈ టైంలో — అలారం కొట్టినట్లు ఫోన్ వస్తుంది తన ప్రియమైన అభిమాని నుంచి, అని అతనికి తెలుసు. ఇష్టంగ, నవ్వుముఖంతో రిసీవర్ ఎత్తి — "రవిచంద్ర!" అని తియ్యగా పలికాడు.

* * *

గ్రీష్మ ఋతువు ప్రారంభంలోనే మండి పోతున్నాడు మార్తాండుడు. తేజస్సు తగ్గించక ముందు మరెంతగ మండిపోయేవాడో! భార్య అలిగి పారిపోగా సూర్యుడంతటివాడు తన తేజస్సు తగ్గించుకున్నాడు. రాలిన చూర్ణంతో విష్ణుచక్రం — శివుని శూలం — శంఖాలు విశ్వకర్మ చేశాడట.

పూర్తి సాంకేతిక పరిజ్ఞానం కలిగిన
సంతోష్®
ట్రాన్సిస్టర్లు, టేప్‌రికార్డర్లు, టు-ఇన్-వన్‌లు
మరియు స్టీరియోలు .
డిస్ట్రిబ్యూటర్స్: రంగా & కో గుంటూరు-3.
అన్నపూర్ణ థియేటర్ ప్రక్కన విజయవాడ.
SIVAJI
SCREENO ARTS

# జి. ఆర్. ఎస్* కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త **ప్రెస్టీజ్**

Patent pending

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes

**100% భద్రత**



### జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది. నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం. ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది. జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది.



### అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి. కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది. సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది. అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది.

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అధికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా, భద్రంగా వదలివేస్తుంది.



### జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు. అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు. దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు, ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు.**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.**

ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే. తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర్ — అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

TTK తయారీ.




ప్రెస్టీజ్ . . . భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు







ప్రకృతి శక్తులకు భయపడి వాటినిపూజించటం నేర్చుకున్న ఆది మానవుడు ఎంత చక్కగా కథలు అల్లాడు. ఆ కథ, వాస్తవంగ మనస్సుకు హత్తుకు పోయేవిధంగా రచించాడు-- యుగ యుగాలుగా ఆ పురాణ గాథలు చెప్పుకుంటూనే వున్నారు. ఎంత విన్నా చదివినా— విసుగువేయదు— ఆహ్లాదంగా వుండి దైవభక్తిని పెంపొందిస్తుంది. కథకు అంత బలం-- మనిషిపై దాని ప్రభావమెంతైనా వుంటుంది. కనుక మనిషిలో చైతన్యమూ, ధైర్యమూ, కాక విజ్ఞానవంతునిగా కూడా మారుస్తుంది కథ. అలాటి కథలకోసం వెతుకుతాడు రవిచంద్ర ఒక్కొక్కసారి చెత్తకథలు కూడా ప్రచురణకు అంగీకరిస్తాడు. రచయితలను ప్రోత్సహించాలని, రచన చేయాలన్న వుత్సాహాన్ని పెంపొందించాలని, ఆలా చెత్త కథలను ప్రచురించినందుకు పాఠకులు నిర్మొహమాటంగా తిట్టిన తిట్లన్నీ హృదయపూర్వకంగా స్వీకరించాడు.

రాత్రి తను చదివిన నవల బాగా నచ్చింది. గోపీని పిలిచి ఆ నవల యిస్తూ "బాగుంది. కొత్త రచయిత్రి అయినా, బాగా రాసింది. వెంటనే సీరియల్‌గా వేయండి..."

"జ్యోతిగారి నవల సీరియల్‌గా వేద్దామనుకున్నాం బొమ్మలన్నీ వచ్చేసి రెడీగా వున్నాయి."

'వుంటే వుండనీ — మన ఆర్టిస్ట్‌కిచ్చి, వెంటనే వేయమనండి. కథలో కొత్తదనం, కొత్త మలుపు వున్నాయి..."

"జ్యోతిగారు రోజూ ఫోను చేస్తున్నారు — ఎప్పుడు వేస్తున్నారు అంటూ ఒకటే గొడవ—"

"బొమ్మలు రాలేదు — రాగానే వేస్తారని చెప్పు —" అంటూ కన్ను గీటాడు రవిచంద్ర.

గోపి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

రవిచంద్ర ప్రక్కకి తిరిగి టేబుల్ సొరుగులో నుంచి పలు భాషలలో వెలువడిన వార, పక్ష, మాస పత్రికలు ముందేసుకుని — ఒక్కొక్కటి చూడ సాగాడు — వాటిల్లో ఏమైనా కొత్తదనం, కొత్త శీర్షికలు ప్రవేశపెట్టారా అని చూస్తున్నాడు — భాష తెలియనివి చిన్నపిల్లాడిలా బొమ్మలు చూస్తూ నవ్వుకుంటున్నాడు.

## రాగాగ్ని

ఆ సమయంలో తలుపులు మెల్లిగా తెరుచుకుని మూసుకున్నాయి ఆ తలుపులు చాలాసార్లు తెరుచుకున్నాయి కాని, ఇలాటి పరిమళాన్ని ఎవ్వరూ వెంట పెట్టుకుని రాలేదు.కమ్మని వాసన — పీల్చుకుంటూ— యథాలాపంగా కళ్ళెత్తి చూసాడు

రవిచంద్ర రెప్పవాల్చడం మర్చిపోయినట్లు చూస్తుండిపోయాడు

కొత్తావులను వెంటపెట్టుకు వచ్చిన ఆ యువతిని చూస్తుంటే వసంతం మళ్ళీ వచ్చిందా!! అనిపించింది సన్నజాజిలా, తెల్లగా — సన్నగా — నాజూకుగా — ఇరవై, ఇరవై రెండేళ్ల పడుచుపిల్ల— ఇందీవరంలాంటి నయనాలతో — తెలివిగా—చురుకుగా చూస్తుంది. పొట్టిగా వున్నా — నేరుగా వున్న ముక్కు తెల్లపుష్పాన్ని గుర్తు తెస్తుంది — పలకరింపుగా చిరునవ్వు — చిన్నగా విచ్చుకున్న తరుణారుణాధరాలు తడిగా తళతళలాడుతున్నాయి — ఆ ఎరుపు రంగులో పలువరస వెండి కిరణంలో కెంపు లీనుతున్నాయి. హృదయాకారపు ముఖంలో మొనతేలిన చుబుకం — నీరెండ రంగులో పొడుగాటి మెడ — చూపులు మరికాస్త క్రిందకి జారి వేలువ మొగ్గలాంటి చనుదోయి సందులో చిక్కుకుపోయినట్లు అక్కడే వుండిపోయాయి. ప్రయత్నంగా, అప్రయత్నంగా కూడా ఆ తరుణి పైట సర్దుకోలేదు. ఎలాగో బయటపడి వలుచని పైట క్రిందుగా పయనిస్తూ — సొంపుగ వున్న వంపులను స్పృశిస్తూండగా పద్మంలాంటి నాభిలో పడి సుడులు తిరిగి వుక్కిరిబిక్కిరై పైకి తేలి ప్రశంసాపూర్వకంగా చూస్తూంటే... పుష్పాంజలులు అర్పించినట్లు చేతులు అందంగా జోడించితే, ఆ నమస్కారం స్వీకరించి ఎదుట కుర్చీ చూపించాడు— సముద్రతీరాన నిల్చుని సూర్యోదయం చూచినట్లు, ఓ మంచి నవల చదివినట్లు— పోటీకి వచ్చిన కథల్లో చక్కని శైలి, శిల్ప లాలిత్యం, మార్దవం, బిగువున్న కథను ప్రథమ బహుమతికి తగినట్లు ఎన్నిక చేసినప్పుడు కలిగిన తృప్తిలా వుంది.

ఆమె కూర్చున్న తరువాత ఆమె వేసుకున్న దుస్తులు గమనించాడు. చక్కని చిక్కని నల్లని జుట్టు— బుజాలవరకే వుంది. ఆలివ్ గ్రీన్ షిఫాన్ చీర, అదే రంగులో పాలిస్టర్ స్లీవ్‌లెస్ బ్లౌజులో గుండ్రని భుజాలు— అందంగా వున్నాయి నవ నాగరికంగా దుస్తులు ధరించి, ఆధునికంగా కను బొమ్మలు సన్నగా తీర్చిదిద్దినా, బొడ్డుకిందకు చీర కట్టినా— ఎబ్బెట్టుగాలేదు పైగా కావ్యకన్యను చూసినట్లు వుంది

చాలా రోజుల తర్వాత మనస్సుకు హత్తుకు పోయే అందంగల అమ్మాయిని చూచిన మధుర క్షణాల్లో— 'ఆమె ఎవ్వరు? ఎందుకు వచ్చింది? తను చేయగల సహాయం ఏమిటి!' అని మర్యాదగా అడగటం మర్చిపోయాడు.

అందమూ — ఆరోగ్యము— యవ్వనం— సుఖ జీవితం గడుపుతున్నట్లున్న అతడు తనకి నచ్చినట్లు ఆమె చూపులు చెప్పకనే చెప్పుతున్నాయి.

అతడు కూర్చోమని చెప్పి ఏమీ మాట్లాడక పోవడంతో— బేగ్‌లోనుంచి కవర్ తీసి అతనికి ఇస్తూ—

"నా పేరు— 'సాహిత్య'—" అని చెప్పింది కాయితం తీస్తూ "నా పేరు" అని రవిచంద్ర చెప్పబోతుంటే—

"రవిచంద్ర, బి. యి—మేనేజింగ్ ఎడిటర్.. " అంటూ కళ్ళు తమాషాగా కదిలిస్తూ, 'రవిచంద్ర' అన్నమాట, ముద్దుగా—అపురూపంగా పిలుస్తున్నట్లు పల్కింది.

చప్పన కళ్ళెత్తాడు. ఆ చూపుల్లో చిక్కుకు పోయాడు. అనిమిషాంగనవేపే— చూస్తున్న ఆమె చూపులు— తనను మెస్మరిజం చేస్తున్నాయనిపించింది. 'ఛీ ఈ రోజు తన కేమైంది—' అని అనుకుంటూ ఆ స్పెల్‌నుంచి బయట పడటానికి రవిచంద్రకు కొన్ని నిమిషాలు పట్టింది. ఈ అమ్మాయిని యిక్కడనుంచి ఎంత తొందరగా పంపిస్తే అంత మంచిదనిపించింది.

నీటుగా మడిచిన ఆ కాయితాన్ని విప్పి యథాలాపంగా చదివాడు— మళ్లీ చదివి— వులిక్కిపడ్డట్లు 'వ్వాట్' అన్నట్లుగా చూశాడు.

సాహిత్య కళ్ళు నవ్వుతూ చూస్తున్నాయి కొంటెగా.

(ఇంకా వుంది)






**జి. ఎల్. వి. – ఖర్గపూరు**

అక్కయ్యగారూ నా మనసు పరిపరివిధాల మారుతుంది. ఒకే మార్గాన ఉండాలంటే ఏమిచేయాలి ?

★ మనిషి మనసు కోతి లాంటిది. కంట్రోల్ చేయకుండా వదిలితే ఇష్టం వచ్చినట్టు ఆడుతుంది. అదే క్రమశిక్షణ అలవరిస్తే – చెప్పినట్టు వింటుంది. ప్రయత్నించి చూడండి. ఈరోజు ఈ పని చేయాలని తెలిస్తే – ఎలాంటి ప్రతిబంధకాలు ఏర్పడినా – ఆ పూట కాపని పూర్తిచేయడం ముందు అలవాటు చేసుకోవాలి, లేదా ఆ రోజు చేయవలసినవన్నీ వరుసగా రాసుకుని – ఒక్కొక్కదాన్నీ పూర్తిచేస్తూ రావాలి. ఇది – పట్టుదలమీద, సాధన మీద ఆధారపడి అలవాటైపోతుంది.

**వి. ఏ. ఎస్. వి. – కర్నూలు**

రాజకీయాలలో బిచ్చగానికి ప్రవేశమిస్తే ?

★ మీ పిచ్చిగాని ఉన్నవాళ్లంతా ఓ రకం బిచ్చగాళ్లే ! ఓటుంటే – ఎవరైనా ఫరవాలేదు.

ఇంటికి దీపం ఇల్లాలు అంటారు. మరి స్త్రీ ఉద్యోగం చేయడం అవసరమా ?

★ పొయ్యిలో పిల్లి లేవడానికి – అవసరమే ! దీపం కంటే తిండి ముఖ్యం.

**శేఖర్ – చేబ్రోలు**

సెన్సారువారి కళ్లకు మన కళ్లకు తేడా ఏమిటి ?

★ ఏం లేదు. సెన్సారు కళ్ల ముందర రూల్సు వుంటాయి. అంతే.

అబద్ధం ఆడకుండా చెప్పండి. ఆంధ్రా సాంబారు బాగుంటుందా ? మద్రాసు సాంబారు బాగుంటుందా ?

★ నిజం చెప్పనా ? మీ ఆంధ్రాలో వండి వడ్డించేది – మద్రాసు సాంబారే కదా ?!

**ఎమ్. ఎస్. – బెల్లంపల్లి**

భారత స్త్రీకి నిజమైన స్వేచ్ఛ ఎప్పుడు వస్తుంది ?

★ ఆమెగారు తనని తానే మనిషిగా గుర్తించుకున్నప్పుడు.

**ఎమ్. వి. ఆర్. ఎమ్. – బారువా**

రచయిత(త్రు)లకు కూడా లైసెన్సు అవసరమా ?

★ ఉంటే బాగానే వుంటుంది కాని మనది ప్రజాస్వామ్యం ఇష్టమైన వృత్తి చేపట్టడం – ప్రాథమిక హక్కు. ఎవరూ కాదనడానికి వీలులేదు

**వి. ఎస్. ఆర్. – మంగవరం**

ఏ పురుషుడు తప్పు చేసినా స్త్రీ కారకురాలు ఆమె మూర్ఖత్వమో, దుష్టభావమో పురుషునిచేత తప్పు చేయిస్తుంది. కామెంట్ ?

★ పాపం పసివాళ్లు ? వాళ్లని దేవుడే రక్షించాలి.

**కె. ఎస్. – ఎమ్మిగనూరు**

వాట్ యీజ్ సర్టెన్ ఇన్ లైఫ్ – నెక్సుటు డెత్ ?

★ లివింగ్—టెల్ డెత్ ఓవర్ టేక్సు యూ !

(అబ్బ ! తెలుగు లిపిలో ఇంగ్లీషు రాయడం కష్టం సార్. తెలుగులోనే అడక్కూడదా !)

**యు. యు. – ఎమ్మిగనూరు**

'ఆకలికి అతివకు దాసుడివి కాకు. ఆత్మ స్వాతంత్ర్యాన్ని కోల్పోతావు' అని ఈజిప్టు సామెత ?

★ అందుకే కాబోలు బహుభార్యాత్వం అక్కడ నిషేధం కాదు ? – సేఫ్టీ ఇన్ నెంబర్స్ అని.

**ఎస్. ఎస్. – ఎల్లజిల్లి**

రిటైరైన ఆయనను ఎందుకు చులకనగా చూస్తారు ?

★ ఆయన నీడన చల్లగా బతికిన సంగతి మరిచి !

**డి. ఎస్. ఆర్. – గుంతకల్లు**

యథా రాజా తథా ప్రజా అన్నారు కాని ఇప్పుడు యథా ప్రజా తథా రాజా అంటాను .

★ అక్కర్లేదు యథా ప్రభుత్వం తథా ప్రజా అంటే చాలు రాజులు పోయినా – మంత్రుల్లో వారి అంశ ఆవహించి వున్నట్టే – వుంది కద !

**లక్ష్మీదేవి – ముద్దునూరు**

మీ రచయితలకు ఒకరిని చూస్తే ఒకరికి గిట్టదు. అవకాశం దొరికితే విసుర్లు విసిరేందుకు సిద్ధపడేవారిని ఏమనాలి ?

★ రచన వ్యక్తిగత సత్తాకు నిదర్శనమైన వృత్తి. అందులో పోటీపడ్డం తప్పులేదే ? ఇక విసుళ్లు అంటారా ? వినలేదా – విసినికర్రతో వారిట్టంటే—తలుపుచెక్కతో నేనిట్టనడం లాంటిదే - అపార్థం చేసుకోవలసిన పనిలేదు.

**జె. డి. – జయశ్రీ (గంజాము)**

కేవలం కర్తవ్య నిర్వహణలో జీవిత పరమార్థముందా ? లేక దైవస్మరణ తోడు లవసరమా ?

★ కర్తవ్య నిర్వహణ కూడ స్వామి కార్యమే ననుకుంటే – గొడవేలేదు. నీతినిజాయితీలతో పని చేయడం, సాటి మనిషికి గోతులు తీయకపోవడమే – చాలు దైవధ్యానం వేరే అనవసరం.

**ఎస్. హెచ్. యు. – బోనాల**

నాలుగు జట్లు కలుస్తాయి. కాని నాల్గు శిఖలు కలిసి వుండవు. కామెంట్ ప్లీజ్ ?

★ అవునండీ మీకు చాలా సంతోషం కదూ ? కాని రోజులు మారాయి భాయీ – ఇప్పుడు మగాళ్లే నల్గురు కలిసి ఏదీ సాధించలేకపోతున్నారు ముఠాలు ఏర్పడి కొట్టుకుంటున్నారు. మీ చుట్టూ ఓసారి చూడండి !








## దారిలో ఎన్నో ఎగుళ్లు-దిగుళ్లు చూశారు మీరు.

**అందుకే మేము మీ కోసమే డిజైను చేశాం
ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటి
అతిమెత్తగా, హాయిగా సాగిపోయే
సైకిల్ క్రొత్త బిఎస్ఎ డీలక్స్**



బిఎస్ఎ డీలక్స్ యొక్క సొగసైన సన్నటి బ్యారల్డ్ హబ్‌లు—ఇవి అత్యంత నాణ్యమైన, దృఢమైన కేస్ కప్స్ కలిగి సైకిల్ మెత్తగా, హాయిగా నడిచేలా చేస్తాయి.



ఎక్కువ సులభంగా తిరగడానికి వీలునిచ్చే చక్కటి గొట్టపు ఫోర్క్. దీనితో బిఎస్ఎ డీలక్స్ తొక్కడం నిజంగా సుఖకరం.



మీరు జీవితంలో ఎంతో పైకి వచ్చారు. ఎన్నో ఎగుళ్లు-దిగుళ్లను ఎదుర్కొని మరీ పైకి వచ్చారు. అందుకే మీకు కావాలి అత్యుత్తమమైనది.

అదే బిఎస్ఎ డీలక్స్. ప్రత్యేకంగా డిజైను చేయబడి అతి సులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్. పనికి వెళ్లడానికి ఇదివరకు మీరెన్నడూ తొక్కనిది. మరి ఇపుడు దినమంతా పడ్డ శ్రమ తర్వాత-ఇంటికి వచ్చాక. ఇదివరకు ఎన్నో ఇతర సైకిళ్లు తొక్కివుంటారు. కనుక వ్యత్యాసం స్పష్టంగా అనుభవించగలరు.

పచ్చ మరియు నలుపు రంగులలో లభ్యం.

## క్రొత్త బిఎస్ఎ డీలక్స్– సఫలత-మార్గంలో మీకు సుఖకరమైన తోడు.

  **BSA Deluxe**

Rediffusion-TI-1912 b TL

# ఈ పండుగ వేళలలో... ఆకర్షణీయమైన కానుకలు

పోచంపల్లి, ధర్మవరం,
నారాయణపేటల ప్రకాశవంత
మైన సిల్కు తయారీలు. గద్వాల,
వెంకటగిరి – జాలువాఉ
జరీలు, తళుకులొలుకు
ఆప్కో సృష్టి అందాలు.
రండి ! ఆప్కోవారి అద్భుత
వస్త్రశ్రేణి నుండి మీరు
కోరుకొన్నవి ఎన్నుకొనండి.




ఆప్కో
చేనేతలు కొనండి




చేనేతలు

KIRON/APCO/82,1/F

నవ్యభావాలు జీవనదులుగా ఉప్పొంగ మణులు పండే తెలుగు మాగాణి మేమేము

# స్క్రిప్ట్ ఆర్ట్స్ గ్రీటింగ్ కార్డులు

ఇవిగో!
మున్నెన్నడూ చూచి ఎరుగని
కలలోనైనా కని విని ఎరుగని
గ్రీటింగ్ కార్డులు



అవే!
ప్రతి రోజూ అమ్మకమయ్యే
ప్రతి పండుగ పోటుగను
గ్రీటింగ్ కార్డులు

## మంగళాక్షత కార్డులు

శ్రీ వేంకటేశ్వరస్వామి కళ్యాణోత్సవ మంగళాక్షతలు
(తిరుమల–తిరుపతి దేవస్థానం ప్రసాదం) ప్రత్యేకపు ఏర్పాటుతో



## నవదంపతులకు శుభాశీస్సులు

1. శ్రీనివాస కళ్యాణం 2. శ్రీ మీనాక్షీదేవి కళ్యాణం కార్డులు

తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం
ఇంగ్లీషు, హిందీ, గుజరాతీ, మరాటీ
భాషలలో మంగళకరమైన శుభాకాంక్షలు

...గ్రీటింగ్ కార్డుల ప్రచురణలో
...చుట్టనున్న శ్రీకారం

# భారతదేశం మొత్తంలో [illegible]
# నూతనాధ్యాయానికి [illegible]



బర్త్‌డే కేకులు, కేండిల్స్, పూలు, పళ్లు పొదిగిన

# బర్త్‌డే కార్డులు

మొగ్గలు తొడిగిన మమతలు

ఇంగ్లీషులో 15 రకాలు
తెలుగులో 9 రకాలు



విక్రేతలకు మనవి—
షరతులకోసం మాకు రాసి తెలుసుకోవాలి గాని ఉచితంగా శాంపిల్స్ పంపజాలం.

తెలుగులో
పాయల వ్యాగో
ప్రతిలోగిలిలోను
అనుక్షణం వినిపించే
లాలిపాటలు

**వినిమయ దారులకు విజ్ఞప్తి**

మంగళాశిత కార్డులు, బర్త్‌డే కార్డులు ఏడాదిపొడుగునా అడపా, తడపా మీకు అవసరమవుతూనే వుండవచ్చు. దయచేసి, విక్రేతలను విచారించండి. అంతే గాని, ఒకటి, రెండు విడి కార్డులకోసం మాకు వ్రాయవలదని మనవి. కారణం ఏమంటే, కార్డుల విలువకన్నా పోస్టేజి ఖర్చులు ఎక్కువకావచ్చు. అది మీకు లాభకరంకాదు, మాకు క్షేమకరంకూడా కాదు. దయచేసి మన్నించి, మా విజ్ఞప్తిని పాటించి, విక్రేతలను విచారించండి.







మా ఏజెంట్లు
ఆల్బంతో ఆర్డర్లు బుక్ చెయ్యడానికి
పర్యటిస్తున్నారు - రాకపోతే మాకు రాయండి

జానుతెనుగే మేము! జాతిఘనతే మేము!!



*For trade terms, contact Sole Concessionnaires in India*

**Cards Crafts Classics**

8, State Bank Street, Post Box No. 2421, Madras-600 002
Grams: "GREETCARDS" Phone: 8 50 29 & 8 37 92

SA-MC-82-2



# సినిమా



'పెళ్లి చూపులు'లో మోహిని, విజయశాంతి

## ప్రేమజ్వాలలో ఘరానా కన్నయ్య!

"అసలు నాకు మన మినిస్టర్లందరి తోటి 'ఒరేయ్' అంటే 'ఒరేయ్' తన్న ఫ్రెండ్‌షిప్పుందన్న సీక్రెట్టు నీతో చెప్పేసిందెవడయ్యా? ఈ ఆనంద గోడేనా? యీడి నోట్లో యే సీక్రెట్టూ దాగదయ్యా," అన్నాడు కన్నయ్య (రాళ్లపల్లి) సీరియస్‌గా.

"నేనేం చెప్పలేదు, సార్!" అన్నాడు ఆనంద రావు (చంద్రశేఖర్) బిక్కు బిక్కు మంటూ.

'పల్లెటూరి సింహం'లో కమలహాసన్



"నువ్వు సైలెన్స్ అయిపో... ఈ సంగతి చెప్పేసినోడు మొన్నీమధ్దిన ఢిల్లీ యెల్లి పంచదార ఫాక్టరీకి పర్మిట్ తెచ్చేసింది కూడా నేనేనని చెప్పే సుంటాడే! ఈడి నోరుకు జోరుండడం కాదుగాని, ఏ సీక్రెట్టూ దాగడం లేదండీ"

జగన్నాథం వినమ్రంగా "తమరంత పలుకుబడి వున్నోళ్ళు కాబట్టే కదండీ మా అబ్బాయి ఉద్యోగం కోసం మీదగ్గరకొచ్చాం," అన్నాడు.

"వచ్చార్లేవయ్యా. పోస్టులో లేకపోయినా— నా పవర్సు, నా పలుకుబడి పోలేదని మీకు తెల్సు కదా? చిన్నప్పట్నుంచీ కలిసిమెలిసి పెరిగాం. కష్ట సుఖాలు పంచుకున్నాం. ఇంతకీ, నీ పేరేటన్నావ్?" అన్నాడు కన్నయ్య.

"జగన్నాధం."

"అవతలా ఆఫీసరు కట్టుకున్న పెళ్ళాన్ని, కన్న తల్లిని నమ్మడం లేదు. అతగాడికి నోట్లకట్ట చేతిలో పెడితే తప్ప— నా నోట్లోంచి మాట రావటం లేదు."

"అమ్మా, అమ్మా! నేనంతదాకా వెళ్లలేదు. ఏదో రెండు వేల్లో..." అంటూ జగన్నాధం గత్యంతరం లేక డబ్బుతీసి ఇస్తూ, "మరి... ఆ ఉద్యోగం సంగతి..." అని గొణిగాడు.

"రేపు మా మంత్రిగారు ఈ ఊరొచ్చినప్పుడు మా ఇంట్లో డిన్నర్‌కి దిగుతారుకదా? అప్పుడు నీ సంగతి కదలేసి, టిక్కు యెట్టించేత్తాను," అని కన్నయ్య అంటూండగా టెలిఫోన్ బెల్ మోగింది. "ఒరే, సన్నాసీ! యెల్లా పోను చూడు. కలెక్టరు గోరుగాని, ఎం. ఎల్. ఎ. గోరుగాని అయితే, నేను యింట్లో లేనని చెప్పేయ్. యెవుడు పడతాడండీ యీ బాధ? రేత్రంతా మినిస్టరుగోరితో డిస్కసనింగు. మళ్ళా పొద్దున్నే యీ గోల."

ఆనందరావు వెళ్ళి, ఫోన్‌లో మాట్లాడేసి వస్తూ, "ఆ పోను కలెక్టరుగోరు చెయ్యలేదండి. మీరు బట్టలకొట్టుకి బాకీ ఉన్న ఏడు వందలూ సాయంకాలంలోగా యిస్తారా— యివ్వరా అని అడుగు తున్నారు," అన్నాడు

కన్నయ్య తెల్లమొహం వేసినా వెంటనే తమాయించుకొని, "ఉష్! సైలెన్స్ అయిపో రాంగ్ నెంబర్ అయ్యుంటాది యెళ్ళి ఆ ఫోన్ పెట్టేయ్ యీ టెలిఫోన్‌లొకటండీ మా చెడ్డ న్యూసెన్స్ అయిపోతున్నాది," అని గొణుక్కున్నాడు

ఎన్ కృష్ణాజీ నిర్వహణలో తయారైన భీమేశ్వర ఆర్ట్ మూవీస్ "ప్రేమజ్వాల" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం . పి. వి రాజు

## సుమన్ క్రియేషన్స్ సినిమాస్కోప్ చిత్రం

"కె ఎస్ ఆర్ దాసు, లక్ష్మీదీపక్‌ల వద్ద శిష్యరికం చేసి, ఇటీవలే ఒక తమిళ చిత్రానికి దర్శకత్వం నెఱపిన బి ఎల్ వి. ప్రసాద్‌కు డైరెక్షన్‌ను అప్పగించాం," అన్నారు ఎం రామకృష్ణా రెడ్డి. ఈయన సమర్పించే సుమన్ క్రియేషన్స్ సినిమాస్కోప్ చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 22న మొదలైంది కవిత, సుమన్, ప్రభాకరరెడ్డి, ప్రసాద్‌బాబు, పూర్ణిమ, నూతన్‌ప్రసాద్, అత్తిలి లక్ష్మి, జయమాలిని పాత్రధారులు. ఎం. డి సుందర్ కథ, పరుచూరి సోదరుల సంభాషణలు, చక్రవర్తి సంగీతం, సత్తిబాబు ఛాయతో శ్రీమతి ఎం. శ్యామలారెడ్డి నిర్మాత.

'ప్రేమ పిచ్చోళ్లు'లో గీత, గుమ్మడి



# విశేషాలు

-జి. వి. జి.



'మంచు పల్లకి'లో నారాయణరావు, చిరంజీవి

## సకల కళా ప్రియుడు

"సంపన్నుల కుటుంబంలో పుట్టిన ఒక ఆకతాయి యువకుడు బాధ్యతలనేవి ఏమాత్రం ఎరక్కుండా జాలాయిలా పెరుగుతూంటాడు. అతనికి జీవితమంటే చాలా చులకనభావం. ఎలాగైనా మార్చాలని తండ్రి ప్రయత్నించేలోగా ఆ యువకుడు కనిపించకుండాపోతాడు. దాంతో కథ అనూహ్యమైన మలుపులు తిరుగుతుంది. ఆద్యంతం కడుపుబ్బ నవ్విస్తుంది," అన్నారు గోటేటి శ్రీ రామారావు. మోహన్, పూర్ణిమాజయరాం, సిల్క్ స్మిత, వెన్నిరాడై మూర్తితోపాటు నటి శ్రీప్రియ తల్లి కూడా ఓ కీలక పాత్రను ధరించింది. వీటూరి మాటలు, పాటలు రాశారు. శంకర్ గణేశ్, ఎ. ఎ. రాజ్ సంగీత దర్శకులు. గాంధీ సంకలనకర్త రామనారాయణ కథకుడు, దర్శకుడు.

## గర్జన

"పూర్తిగా మన రాష్ట్రంలోనే షూటింగ్ జరుపుతాం. అక్టోబర్ 27న పాటల రికార్డింగుతో ప్రారంభోత్సవం జరుగుతుంది" అన్నారు శ్రీ లలితా మూవీస్ అధినేత జి. జగదీశ్ చంద్రప్రసాద్. ఈయన కోడి రామకృష్ణ స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో నిర్మించే "గర్జన" చిత్రంలో చిరంజీవి, సత్యనారాయణ, గొల్లపూడి, రాధిక, జయంతి వగైరా తారాగణం. గొల్లపూడి, సత్యం, కె. ఎస్. మణి, బాలు ప్రభృతులు తెర వెనుక కృషి చేస్తారు.



## అమ్మాయి మనసు

"కొండకోనల్లోని ఓ పల్లెటూరి గడుగ్గాయి అమ్మాయి జయసుధకు, అక్కడికి పట్నం నుంచి అసిస్టెంట్ ఇంజనీర్‌గా వచ్చిన ఓ సంగీతాభిమాని చంద్రమోహన్‌కు– మధ్య మూగప్రేమ. టెండర్ లవ్ స్టోరీ," అన్నారు డైరెక్టర్ చేకూరి కృష్ణారావు. ఈయన పదేళ్ళపాటు సింగీతం శ్రీనివాసరావు వద్ద శిష్యరికం చేశారు. ఇప్పుడు సి. హెచ్. శ్రీదేవి, కె. సీతాలక్ష్మి నిర్మించే శ్రీనివాస చక్రవర్తి ఫిలిమ్స్ "అమ్మాయి మనసు" చిత్రానికి స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. షూటింగ్ సెప్టెంబర్ 13న భద్రాచలం– దండకారణ్యానికి సమీపాన ఉన్న మారేడుమిల్లి గ్రామం కొండల ప్రాంతంలో మొదలైంది. శరత్‌బాబు, కాంతారావు, అప్పలస్వామి, నిర్మల, వంశీకృష్ణ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. యడవల్లి మాటలు రాశారు. ఆత్రేయ, వేటూరి గీతాలకు రాజన్–నాగేంద్ర బాణీలు కూర్చారు. లోకసింగ్ ఛాయ, మూరి శిల్పం, అనిల్ కూర్పు, మణి నిర్వహణతో కె. ఎస్. మూర్తి సహకార నిర్మాత.

## దాసరి రచన, దర్శకత్వంలో రావణ సంతానం

"అంతా కొత్తవారితోనే తీస్తాం. ఆరుగురు హీరోలుంటారు. జూడో ఫైట్స్‌కు ప్రాధాన్యతగల వెరైటీ కథ. అన్ని తరగతుల ప్రేక్షకులనూ ఆకర్షించే ఎన్నో అంశాలున్నాయి," అన్నారు నిర్మాత రాయపరాజు. "రావణ సంతానం" చిత్రానికి దాసరి నారాయణరావు కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ భారాలు వహిస్తారు. అక్టోబర్ 15 నుంచి పాటలు రికార్డ్ చేస్తారు. నవంబర్–డిసెంబర్ మాసాల్లో ఔట్‌డోర్‌లో షూటింగ్ పూర్తయిపోతుంది. ఇది హేమ మూవీస్ సినిమాస్కోప్ చిత్రం.

## పి. ఎ. పి. వారి కొత్త చిత్రం

"కొత్త నటీనటులతో ఒక టీనేజ్ ప్రణయ గాథను అక్టోబర్ 1న స్టార్ట్ చేస్తున్నాను," అన్నారు ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత అనుమోలు వెంకటసుబ్బారావు. దర్శకత్వం వహించే ప్రత్యగాత్మ కథకు మల్లాది వెంకటకృష్ణమూర్తి సంభాషణల కర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. హరనాథ్ ఛాయ, తరణి శిల్పంతో విశాఖపట్టణంలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది.

'బెజవాడ బెబ్బులి'లో షావుకారు జానకి



# సినిమా

## "కళాసాగర్" 1981 అవార్డులు!

ఉత్తమ చిత్రం "సప్తపది". ఉత్తమ దర్శకుడు – భారతీరాజా (సీతాకోక చిలుక). ఉత్తమ నటుడు – కమలహాసన్ (అమావాస్య చంద్రుడు). ఉత్తమ నటి – జయసుధ (ప్రేమాభిషేకం). ఉత్తమ హాస్యనటుడు–వీరభద్రరావు (ఎర్రమల్లెలు). ఉత్తమ హాస్యనటి – కృష్ణవేణి (వారాలబ్బాయి). ఉత్తమ కేరెక్టర్ ఆక్టర్ – జగ్గయ్య (ధర్మవడ్డీ). ఉత్తమ కేరెక్టర్ ఆక్ట్రెస్ – లక్ష్మి (చట్టానికి కళ్ళు లేవు). ఉత్తమ కథా చిత్రం – "న్యాయం కావాలి". ఉత్తమ గీత రచయిత – వేటూరి ("సప్తపది"లో "ఏ కులమూ"). ఉత్తమ నేపథ్య గాయకుడు – ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం ("ప్రేమాభిషేకం"లో "ఆగదు"). ఉత్తమ నేపథ్యగాయని – ఎస్. పి. శైలజ ("ఎర్రమల్లెలు"లో "నాంపల్లి") ఉత్తమ సంగీత దర్శకుడు – ఇళయరాజా (సీతాకోక చిలుక). ప్రత్యేక బహుమతులకు చిరంజీవి (చట్టానికి కళ్ళు లేవు), రాధిక (న్యాయం కావాలి) ఎంపిక అయ్యారు.

## "మంజీర వాదాలు"

"నృత్య ప్రధాన చిత్రం. కొత్త నటీనటులతో తీస్తున్నాం. సెప్టెంబర్ 1న అమరావతిలో ప్రారంభించిన షూటింగ్ నెలరోజులలో పూర్తవుతుంది," అన్నారు కె ఎల్. నరసింహారావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో ఎస్. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, వి భవానీప్రసాద్, జి. సుశీలా సాంబశివరావు, అట్లూరి పద్మావతి నిర్మించే గీతా ఆర్ట్ క్రియేషన్స్‌వారి పై చిత్రంలో సరళ, రాఘవన్, ఆర్. నాగేశ్వరరావు, శేషు, హరితారెడ్డి, లక్ష్మి, మాధురి, ఉమారాణి, సాధన, శాంతి, కొల్లి సత్యనారాయణ, దిగంబర్ సోనీ, కమల్‌ప్రసాద్, మధుసుబ్బారావు, ఎస్. ఎస్. రెడ్డి, రమణమూర్తి నటిస్తున్నారు. తెరవెనుక ఎ. ఎ. రాజ్, వసంతా సుధాకర్, బి. బాబు, రణధీర్, దిలీప్‌సింగ్, కణ్ణన్, వి. మాధవరావు, కరుణ, వి. వాసుదేవరావు, రంగనాధం నారాయణమూర్తి, శేషగిరిరావు, వి.వి. దుర్గాప్రసాద్ కృషి చేస్తున్నారు.

## బలిదానంలో బలే శాస్త్రం!

హాలులో అందరూ కూర్చొని ఉన్నారు. మాధవి మాత్రం నిలుచొని ఉంది. కుశల ప్రశ్నలనంతరం జానకి (కాకినాడ శ్యామల) "రేపట్నుంచి ఆషాఢ మాసం ఆరంభమవుతుంది, అక్కగారూ! శాస్త్ర ప్రకారం ఈ నెల రోజులూ అమ్మాయిని మా ఇంటికి తీసుకువెళ్ళాలని," అంటూ తమ ఆకస్మిక రాకకు కారణం వివరించింది.

"తీసుకెళ్ళొద్దా మరి? ఆచారం అంటే ఆచారమే. శాస్త్రమంటే శాస్త్రమే," అంది నిర్మల.

విషయం బోధపడని విజయ్ (శోభన్‌బాబు) "కరెక్ట్ – కరెక్ట్! నెల రోజులపాటు నేను అత్తవారింట్లో ఉండడం అంటే – కొంచెం ఇబ్బందే అనుకోండి. కాని, శాస్త్రం ఒప్పుకోదు కదా? వస్తాలెండి," అన్నాడు.

జానకి వింతగా చూస్తూ, "ఆషాఢ మాసంలో అత్తా అల్లుడూ ఒక్క గడప దాటకూడదని శాస్త్రం, బాబూ!" అంది.

"ఓ–కే... ఏం చేస్తాం? నేను గడపమీద కాలు వెయ్యకుండా లాంగ్ జంప్ చేసి వస్తాన్లెండి. ఎలాగూ నేను స్పోర్ట్స్‌మెన్ని కదా?" అన్నాడు విజయ్.

జానకి, ఆమె భర్త శాస్త్రి (జగ్గయ్య) ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. శాస్త్రి "అదికాదు, బాబూ! ఈ మాసమంతా అత్తా అల్లుడూ ముఖాలు కూడా చూసుకోకూడదని పెద్దలు చెప్పారు," అంటూ విశదపరిచాడు.

అప్పటికీ విజయ్ "చెప్తారండీ! వాళ్ళు పెద్దవాళ్ళు కదా? కరెక్ట్‌గానే చెప్తారు. కాని, నేను ఈ నెల రోజులూ మీ ఇంట్లో ఉంటే – పాపం అత్తగారు ఎక్కడుంటారు? పోనీ, మా ఇంట్లో ఉండమనండి," అన్నాడు.

నిర్మలకు ఒళ్ళు మండింది. "ఏం చదువు చదివావురా నువ్వు? ఆషాఢ మాసంలో నువ్వూ, అమ్మాయీ ఒక ఇంట్లో ఉండకూడదని శాస్త్రంలో రాశారు."

"ఎవడా రాసిన గాడిద?... మరేం పర్వాలేదు, మావయ్యగారూ! మహా మహా చట్టాల్నే మనం మార్చుకుంటున్నాం. వెధవది–శాస్త్రం ఓ లెక్కా?" అన్నాడు విజయ్.

"ఆచారం ఆచారమే, బాబూ!" అన్నాడు శాస్త్రి.

"ఒప్పుకున్నానండీ. . కాని, మా పెళ్ళయి ఇంకా రెండు నెలలైనా అవలేదు కదా? అప్పుడే ఓ నెలరోజులు విరహం అనుభవించడం అంటే... ఆ పాయింట్ మీద మనం డిస్కస్ చేసుకుంటే—" అంటూ విజయ్ ఆగాడు.

నిర్మల చికాగ్గా "డిస్కషనూ లేదు. కస్కషనూ లేదు. మీరు అమ్మాయిని తీసుకెళ్ళండి, బాబూ!" అంది.

విజయ్ దిగాలుగా చూశాడు. మాధవి ముసిముసిగా నవ్వుకుంది.

ఎస్. ఎ. చంద్రశేఖర్ దర్శకత్వంలో ఎ. శ్రీనివాసరావు, ఎ. లక్ష్మణరావు నిర్మించే "బలిదానం" చిత్రంలో రావు గోపాలరావు. గుమ్మడి, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, సి. హెచ్. కృష్ణమూర్తి ఇతర పాత్రధారులు. శోభ కథకు కాశీ విశ్వనాధ్ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీతం, సోమనాధ్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, ఆర్. తరణీరావు సహకార దర్శకత్వంతో ఎ. రాజప్రసాద్ నిర్వహణ బాధ్యతలు వహించారు.




"అమ్మా! నేనెప్పుడు పెద్దయి హీరోయిన్ వేషాలు వేస్తానే?"

'ఈ నాడు'లో ఒక దృశ్యం





విశ్వ విఖ్యాత నటసార్వభౌమ, నటరత్న
డా॥ యన్.టి.రామారావు నటించిన
పల్లవీ దేవీ ప్రొడక్షన్స్
నాదేశం
అక్టోబరు 27 విడుదల
నిర్మాతలు:
యస్.వెంకటరత్నం
కె.దేవీవరప్రసాద్
దర్శకత్వం:
కె.బాపయ్య
సంగీతం
చక్రవర్తి
ఫొటోగ్రఫీ
ఎస్.వెంకటరత్నం
నైజాం: రామకృష్ణ
సీడెడ్: నవభారత్



'యువరాజు'లో పద్మనాభం, అక్కినేని నాగేశ్వరరావు

## ఇది కాదు ముగింపు లో మధ్య తరగతి మానవుడు!

కుటుంబరావు (సత్యనారాయణ) ఆనందో ద్రేకంతో ఇంట్లో ప్రవేశించి, "ఏమే! అమ్మాయి అదృష్టవంతురాలే. వాళ్ళు పెళ్ళికి ఒప్పుకున్నారు. నా చిట్టితల్లి జీవితం ఏమవుతుందోనని గాభరాపడి పోయాను. కిందటి జన్మలో ఏ పూజ చేసుకుందో— తను కోరుకున్నవాడ్నే కట్టుకుంటోంది," అన్నాడు.

జానకమ్మ (జానకి) వదనం వికసించింది. "లగ్నాలు ఎప్పుడు పెట్టుకుందామన్నారు?" అంది.

"మన చేతిలో యాభై వేలు ఎప్పుడు ఉంటే అప్పుడు... కట్నమే! మరి, ఊరికే చేసుకుంటా రనుకున్నావా? వాళ్ళకెంత ఆస్తి ఉందో తెలుసా?"

"ఎక్కడ్నించి తెస్తారండీ! ఇప్పటికే ఉన్న అప్పులతో సతమత—"

ఇంతలో వాళ్ళ కొడుకు శివశంకర్ (శివకృష్ణ) "నిజం చెప్పావమ్మా... నాన్నా! నా స్నేహితుడు కిరణ్ అని ఉన్నాడు. చెల్లిని పెళ్ళి చేసుకోటానికి ఇష్టపడుతున్నాడు. పైసా కట్నంకూడా తీసుకోడు," అన్నాడు.

దీప (జ్యోతి) నివ్వెరపోయింది "అన్నయ్యా!"

శివశంకర్ "అవును, చెల్లీ! నువ్వు కోరుకునే మనిషికంటే నిన్ను కోరుకునే మనిషి సాంగత్యంలోనే జీవితం సుఖంగా ఉంటుందమ్మా!" అన్నాడు

జానకి ఆదుర్దాతో "ఎవరు బాబూ ఆ కుర్రాడు?" అని అడిగింది.

"ఉన్నాడ్లే .. మా కాలేజీ ప్యూను కొడుకు," అంది దీప చప్పగా.

కుటుంబరావు ఆకాశమంతెత్తుకు లేచాడు "ఛీ— ఛీ! ఏరా! నా కూతుర్ని ఒక ప్యూన్ కొడుక్కిచ్చి పెళ్ళి చేస్తావా? నా అంతస్తెక్కడ? వాడి అంతస్తెక్కడ?"

"ప్రజాపతిరావు మేడ మెట్లెక్కేముందు నీకు అంతస్తు గుర్తురాలేదా?" శివశంకర్ రెట్టించాడు

"నోర్ముయ్! నన్నే ప్రశ్నిస్తున్నావా?"

"నిన్నుకాదు, నీలో ఉన్న మధ్య తరగతి మానవుడ్ని ప్రశ్నిస్తున్నాను అందుబాటులో ఉన్న పేదవాడికి దూరమై అందలం ఎక్కి కూర్చున్న పెద్దవాడ్ని చేరుకోవాలని నువ్వెందుకు కోరుకుంటున్నావ్?"

"ఒరేయ్! నీ చెల్లెలు పెద్దింటి కోడలైతే చూడలేని కుళ్ళుతో మాట్లాడుతున్నావ్‌రా నువ్వు!"

"శభాష్! అసలు సిసలైన మధ్య తరగతి మనిషిలా ఇప్పుడు మాట్లాడావ్. తలకు మించిన భారాన్ని మోసే మధ్య తరగతి మనస్తత్వం అంటే ఇదే, నాన్నా!"

"శివా! నువ్వూరుకోరా!" అంటూ జానకి, భర్తవంక తిరిగి, "వాడు చెబితే మీకు కోపం వస్తుంది గాని, ఎక్కడ్నుంచి తెస్తారండీ యాభై వేలు?" అంది.

"ఉన్న కొంపంతా తెగనమ్మి, మిగతాది అప్పు చేసైనా సరే— చేస్తాను," అన్నాడు కుటుంబరావు.

"ప్రజాపతిరావు మీ దగ్గర కట్నం ఎలా తీసుకుంటాడో నేనూ చూస్తాను," అంటూ శివశంకర్ విసురుగా వెళ్ళిపోయాడు.

వేజెళ్ళ సత్యనారాయణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అన్నమరెడ్డి కృష్ణకుమార్ సమర్పించే యురేకా సినీ ఎంటర్‌ప్రైసెస్ "ఇది కాదు ముగింపు" చిత్రానికి పి. సాంబశివరావు, పి. వి. వి. ప్రసాద్ నిర్మాతలు.



'కిరాయి రంగడు'లో రాధిక, రజనీకాంత్

## అపరంజి బొమ్మ

"దేవాలయంలో నృత్యంచేసే ఓ అమాయకురాలి జీవిత కథ ... నృత్య ప్రధాన చిత్రం," అన్నారు ఎం. ఎస్. ఎన్. ఆచార్యులు. ఈయన శ్రీ లక్ష్మీ వినాయక ఆర్ట్ ప్రొడక్షన్స్ పతాకంలో నిర్మించే పై చిత్రానికి ఎం. ఎస్. కోటారెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు. సెప్టెంబర్ 19న తొలి గీతం రికార్డయింది. ఇంతవరకు మూడు పాటలు రికార్డయ్యాయి. మరో మూడు పాటలను నవంబర్‌లో రికార్డ్ చేసి, డిసెంబర్ నుంచి హైదరాబాద్ పరిసరాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తిచేస్తారు. కథ · ఎం. సరోజినీదేవి. మాటలు · ఎం. టి. వి. ఎస్. ఆచార్యులు. గీతాలు · వేటూరి, గోపి. సంగీతం . ఎస్. రాజేశ్వరరావు.

## ప్రేమ దీపాలు

"నిజమైన ప్రేమికులు – ప్రేమ కోసం ఎంత త్యాగమైనా చేస్తారు అనే అంశంమీద అల్లబడిన కథ," అన్నారు సి. ఎస్. బోస్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో షూటింగ్, ఫైనల్ ఎడిటింగ్ పూర్తయిన పై వెంకటేశ్వర ఆర్ట్స్ చిత్రంలో శరత్‌బాబు, భానుప్రియ, కవిత, రాజా, చలపతిరావు, అప్పారావు, ఝాన్సి, అత్తిలి లక్ష్మి, గిరిజారాణి పాత్రధారులు. కథ : సి. ఆనందారామం. మాటలు . భరత్. గీతాలు : సి. నారాయణరెడ్డి. సంగీతం · పెండ్యాల. కూర్పు · శ్యాం. పి. వెంకటేశ్వరరావు, జి. నాగేశ్వరరావు నిర్మాతలు.



'నా దేశం'లో ఎన్. టి. రామారావు, జయసుధ


అనంతలక్ష్మి ఇంటర్నేషనల్
మొండిఘటం
నిర్మాత డి. భాస్కరరావు
స్క్రీన్‌ప్లే- దర్శకత్వం రాజాచంద్ర



'పిచ్చి పంతులు'లో సత్యనారాయణ, మురళీమోహన్

## ఇరుగు - పొరుగు

★ మధురలో ''తెలుగుదేశం'' శాఖ ఇటీవలే ప్రారంభమైంది అక్కడికి ఎన్ టి. ఆర్. త్వరలోనే విచ్చేస్తారట !

★ పదేళ్ళుగా వరుసగా ఫిలిమ్‌ఫేర్ నిర్వహించే బేలట్‌లలో కమలహాసన్ ఎనిమిదిసార్లు ఉత్తమ నటుడుగా బహుమతులు అందుకున్నాడు — 5 సార్లు తమిళ చిత్రాలకు, 2 సార్లు మలయాళ చిత్రాలకు, ఇటీవల ఒక తెలుగు చిత్రానికి ఎంపిక అయ్యాడు.

★ కుమార్ గౌరవ్, పూనమ్ ధిల్లాన్ నటించిన ''తేరీ కసమ్'' చిత్రం ఆ మధ్య నాగపూర్‌లోని ఓ గృహంలో వీడియోలో ప్రదర్శింపబడింది తలా 25 పైసల టిక్కెట్టు చొప్పున కొని తిలకించారు. బొంబాయికి కేబుల్ టి. వి వచ్చేసింది. కొంతకాలం క్రితం ''సీతా ఔర్ గీతా'' చిత్రం బొంబాయిలోని ఓ హోటల్ నుంచి కేబుల్ టి. వి. ద్వారా కొన్నిగృహాలలో ప్రదర్శింపబడింది. వీడియో కేసెట్లు కొనడం, అద్దెకు తీసుకోవడం కన్నా కొంత చందా చెల్లించి కేబుల్ ద్వారా ప్రదర్శింపచేసుకోవడం చాలా చవక.

★ జితేంద్ర సినిమారంగంలో ప్రవేశించడానికి ముందు బొంబాయిలోని తన మేనమామ నగల కొట్టుకు తరచు వెళ్తూండేవాడు అక్కడికోసారి నగలు కొనడానికి వచ్చిన ప్రఖ్యాత దర్శక నిర్మాత వి. శాంతారాంతో తనకు సినిమాలలో నటించే ఉద్దేశ్యం ఉన్నట్లు తెలియజేశాడు. అతనికి శాంతారాం ముందు ఓ చిత్రంలో చిన్నవేషం ఇచ్చి, ఆ తర్వాత ''గీతా గాయే పత్థరోంనే''లో హీరో పాత్ర ఇచ్చాడు.

★ స్మితాపాటిల్ బి. యె. చదువుతున్నప్పుడు ''నిషాంత్'' చిత్రంలో నటించి, కాలేజీ కమిటీ ఆగ్రహానికి గురైంది.

★ అరుణాఇరానీ నిర్మించే చిత్రంలో ఋషికపూర్ హీరో

★ ఫైటర్ శెట్టి మరణించాక కొన్నిచిత్రాల్లో విలన్‌లను అతనిలాగే చూపించడానికి ప్రయత్నిస్తున్నారు నిర్మాతలు. అలా ఇటీవల అమ్రేష్‌పురికి గుండు కొట్టించాడు దర్శక నిర్మాత రాజేష్‌కుమార్.

★ ''కూలీ'' చిత్రం షూటింగ్‌లో అమితాబ్‌బచ్చన్ గాయపడడానికి ముందు అతనితో స్టంట్ సీన్‌లో పాల్గొన్న పునీత్ ఇస్సార్‌ను ఒక ప్రధాన పాత్రకు శత్రుఘ్నసిన్హా తాను రామాయణ చిత్ర పతాకంలో నిర్మించే ''కల్కి'' చిత్రంలో బుక్ చేశాడు.

★ కె. బాలచందర్ చిత్రం ''అగ్నిసాక్షి''లో సరిత స్వయంగా మూడు పాటలు పాడిందట !

★ ''ఒక సెన్సార్ ఆఫీసర్‌ను పెళ్ళాడేస్తాను చూస్తూండండి,'' అని సెక్సీ తార సిల్క్‌స్మిత ఆ మధ్య ఒక జోక్ వేసిందట. అది సెన్సారాఫీసులో కొందరికి ఆగ్రహం కలిగించిందట !

★ సినిమా తారలు తమతో షూటింగ్‌లకు తీసుకొచ్చే కుర్చీలమీద తమ పేర్లు వేసుకుంటారు. సుజాత కుర్చీమీద మాత్రం ''మిసెస్ జయకర్'' అని ఆమె భర్తపేరు ఎంబ్రాయిడరీ చేయబడింది.

★ మధురలో దాదాపు 10 షాపులకు సిల్క్‌స్మితా పేరు పెట్టబడింది.

★ హిందీ చిత్రసీమలో మొత్తం 43 మంది 'కపూర్'లు ఉన్నారు !

★ నటి సుభాషిణి వచ్చే సంవత్సరం శ్రీమతి కాబోతోంది. హైదరాబాద్‌లో ప్రభుత్వోద్యోగి అయిన తన మేనమామ కొడుకు అంజనీకుమార్‌తో జనవరి 17న మద్రాసు న్యూ వుడ్‌లాండ్స్‌లో ఆమె వివాహం నిశ్చయమైంది.

★ ''మేరా ఫైస్లా'' చిత్రం షూటింగప్పుడు అమ్రపానీ నోటి వద్ద రతి అగ్నిహోత్రి ఒక సీసాను ఉంచాలి. కాని, షాట్‌లో ఆమె కాస్త విసురుగా ఆ సీసాను తగిలించడంతో అమ్రపానీ పన్నొకటి విరిగిపోయింది !

## సినిమా

### అవార్డ్

''యువతరం మారాలి'' చిత్రం తర్వాత విజయప్రకాష్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ చిత్రం ''అవార్డ్''. ''ఈ చిత్రంలో ప్రధానమైన పాత్రికేయుని పాత్రను ధరించడమే కాకుండా సంభాషణలు కూడా రాశాను,'' అన్నారు విజయప్రకాష్. ఇంకా సత్యనారాయణ, ప్రభాకర రెడ్డి, నూతన్‌ప్రసాద్, జె. వి. సోమయాజులు, గిరిబాబు, ప్రసాద్‌బాబు, మాడా, సత్యేంద్రకుమార్, రాజ్యలక్ష్మి, మంజాభార్గవి పాత్రధారులు. ''డిసెంబర్‌లో గుంటూరులో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు ఈ చిత్ర కథకుడు, నిర్మాత మోహన్‌రావు.



'ఆంధ్ర కేసరి'లో విజయచందర్

### పల్లెటూరి సింహం

''ఆత్మహత్యకు పాల్పడిన అబలను రక్షించి, ఆమెపై అమానుషంగా ప్రవర్తించిన వ్యక్తి చేతనే తాళి కట్టిస్తానని శపథం చేసి, అక్షరాలా నెరవేర్చిన బాలయ్యగా కమలహాసన్ మరపురాని నటనను ప్రదర్శించారు,'' అన్నారు సుజాత ఫిలిమ్స్ అధినేత ద్వారకీష్. ''పల్లెటూరి సింహం''లో అంబిక, తులసి, మహేంద్ర, స్మిత, పుష్పలత ఇతర పాత్రధారులు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. ఇళయరాజా సంగీతం, బాబు ఛాయ, విఠల్ కూర్పుతో ఎస్. పి. ముత్తురామన్ దర్శకుడు.

### "జండాపై కపిరాజు"

''ఆద్యంతం కడుపుబ్బ నవ్వించే చిత్రం,'' అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన దర్శకత్వంలో శ్రీ దుర్గా పిక్చర్స్ నిర్మించే పై చిత్రం షూటింగ్ నవంబర్‌లో ప్రారంభమై, డిసెంబర్‌కు పూర్తవుతుంది. రవీంద్రబాబు కథకుడు. చక్రవర్తి సంగీత దర్శకుడు. 

జి.ఎస్.రాజు
సమర్పించు

విశ్వచిత్ర
సినీ ఎంటర్‌ప్రైజెస్

# ప్రళయ రుద్రుడు

SAI KRISHNA ADS




దర్శకత్వం: ఎ.కోదండరామిరెడ్డి నిర్మాత: జి.ఆర్.కె.రాజు
సత్యానంద్ చక్రవర్తి నవకాంత్ కుదరవల్లి డి.వెంకటరత్నం



అలారం మోతకు లేచి కూర్చొని గడియారం వైపు చూసింది ఇందిర. నాలుగయింది. బద్ధకం వదిలించు కుంటూ లేచి కిటికీ వద్దకు వెళ్ళి నిల్చుంది.

ఇంకా చీకటి విడనేలేదు. ఆకాశంలో చుక్కలు చక్కగా మెరుస్తున్నాయి. ఆ రోజు అంతా వేకువనే లేవటానికి కారణం గుర్తు తెచ్చుకుంటే పెదవులపైన చిరునవ్వు విరిసింది.

ప్రక్క గదిలో నిద్రపోతున్న తమ్ముళ్ళిద్దరినీ లేపింది. తట్టి లేపితే ఎంతకీ లేవనివాళ్ళు తీరా, "ఇవ్వాళ మన ప్రోగ్రామ్ మరిచిపోయావా? మళ్ళీ అమ్మ, నాన్న లేచారంటే ఏమీ చేయలేం!" అని గుర్తు చేసేసరికి టక్కున లేచారు. ముగ్గురూ నిశ్శబ్దంగా ముఖాలు కడుక్కొని పనులలోకి జొరబడ్డారు.

ఇందిర పూరీల పిండి కలపసాగింది. రమేష్ బాయిలరు వెలిగిస్తుంటే, సురేష్ వెళ్ళి పాలు తీసుకువచ్చాడు. ముగ్గురూ కలిపి బ్రేక్‌ఫాస్ట్ తయారుచేసి టేబుల్ పైన సర్దాక, కాఫీ గ్లాసులు తీసుకొని వెనక వరండాలో కూర్చున్నారు.





# నీలాకాశం

శ్యామల

కొత్త సీరియల్ ప్రారంభం

''ప్రొద్దున్నే లేవాలంటే బద్ధకంగా ఉంటుంది కాని, తీరా లేచాక ఎంతో హాయిగా, హుషారుగా అనిపిస్తుంది!'' అన్నాడు రమేష్ వేడికాఫీ చప్పరిస్తూ.

''ఈ రోజు 'స్పెషల్‌డే' అని లేచానుకాని, ఇందులో హాయి ఏముంది బాబూ ?'' అన్నాడు సురేష్. వాళ్ళిద్దరూ కవలలు. ఒకరిని విడిచి మరొకరు ఉండలేరు. కాని ఒకరు అన్నమాటను రెండవవాళ్ళు వెంటనే వ్యతిరేకించకుండా ఉండలేరు.

''నేను ఇకనించి రోజూ ఇలాగే లేస్తాను'' అన్నాడు రమేష్.

సురేష్ వెంటనే ''నేను మాత్రం చస్తే లేవను !'' అన్నాడు.

ఇందిర నవ్వింది. ''ఇంక వాదులాడుకోవటం మాని మిగిలిన పనులు చూడండి'' అని కాఫీ గ్లాసులు తీసుకొని లోపలికి వెళ్తూ ''ఉషని కూడా లేపుతాను. లేకపోతే మళ్ళీ ఏడుస్తుంది'' అంది.

ఆ తర్వాత పదేళ్ళ ఉషను లేపేందుకు కాస్త శ్రమ పడవలసివచ్చినా, ఆపనీ చేసింది ఇందిర.

మామూలుగా ఆరు గంటలకు నిద్ర లేచింది సుభద్ర. గది తలుపులు తీయబోతే రాలేదు. ఆశ్చర్య పోతూ మళ్ళీ లాగింది. ''అమ్మా, అయిదు నిమిషాలు అగు !'' అన్న ఇందిర గొంతు వినిపించింది తలుపు బయటనించి.

''బయట గడియ పెట్టారా పిల్లలు ? ఎందుకు ?'' మంచంపైన లేచి కూర్చుంటూ అడిగాడు రామారావు ఆశ్చర్యంగా.

''ఏమో !'' ఆవిడకు ఏం అర్థం కాలేదు.

అంతలోనే తలుపు తెరుచుకుంది. గుమ్మం బయట నిలబడి ఉన్నారు పిల్లలు నలుగురూ. ''మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే !'' అన్నారు ఏక కంఠంతో.

రామారావుకీ, సుభద్రకీ అర్థమయింది, ఆ రోజు తమ పెళ్ళిరోజు కనక పిల్లలు ఏవో ఏర్పాట్లు చేశారని.

''మేము పెద్దవాళ్ళయిపోయాంకదరా, ఈ పండుగలు చేసుకొనే వయస్సు దాటిపోయింది !'' అన్నాడు రామారావు నవ్వుతూ. అతను పిల్లలతో స్నేహితులతో మాట్లాడినట్లే మాట్లాడుతాడు.

''నో, డాడీ ! పెద్దవాళ్ళయినకొద్దీ ఈ పండుగకు విలువ ఎక్కువవుతుంది'' అన్నాడు సురేష్.

''ఈ రోజుకి మరీ ఎక్కువ విలువ ఉంది. సిల్వర్ జూబిలీ సెలిబ్రేషన్స్ !'' అంది ఇందిర.

సుభద్రకి సిగ్గుగా ఉంది. సంతోషంగానూ ఉంది. ''అప్పుడే పాతికేళ్ళయింది మా పెళ్ళి జరిగి'' అనుకుంది.

ఉష తల్లి చేతిలో పూలగుత్తి పెట్టింది. పొద్దున్నే లేచి బంతిపూలు, ఆకులు కలిపి గుత్తిగా కట్టింది ఆ పిల్ల.

ముఖాలు కడుక్కొని వచ్చేసరికి టేబుల్‌మీద పూరీలు, కూర, ఇడ్లీలు, చట్నీ కనిపించాయి. ''ఎప్పుడు లేచారు, ఇవన్నీ చేయటానికి? చప్పుడయినా కాలేదు ! ఎందుకర్రా ఇంత శ్రమపడ్డారు'' అంది సుభద్ర. తల్లి ఆశ్చర్యానికి అంతా నవ్వారు.

''రోజూ నువ్వు మాకోసం శ్రమపడ్తావు కదమ్మా ! అందుకని ఈ ఒక్కరోజూ మేము...'' అంది ఇందిర.

టిఫిన్లయినాక తల్లితండ్రులని ముందుగదిలోకి పిల్చుకువచ్చారు. వాళ్ళను కూర్చోబెట్టి తల్లికి కనకాంబరం రంగులో జరీచీర, తండ్రికి ఒక కవరు ఇచ్చారు.

రామారావు కవరు చింపాడు. దానిలో మ్యాట్నీ టిక్కట్లు రెండు ఉన్నాయి.

''అంతా కలిసి వెళ్దాం సినిమాకి'' అంది సుభద్ర.

''నో !'' అన్నారు రమేష్, సురేష్ వెంటనే.

రామారావు భార్యని చూసి ముసిముసిగా నవ్వాడు.

ఎర్రబడిన ముఖం పిల్లలు చూస్తారేమో నన్నట్లు చటుక్కున లేచి లోపలికి వెళ్ళింది సుభద్ర.

స్నానంచేసి లేతాకువచ్చరంగు జార్జెట్ చీర కట్టుకొని అందంగా తయారైంది ఇందిర. భోజనాల వేళ అయినా ముందు గదిలోంచి కదిలి రావటంలేదు.

''ఎవరికోసం చూస్తున్నావు ?'' తెలియనట్లే అడిగాడు రమేష్.

''ఎవరో వి. ఐ. పి. కోసం అనుకుంటాను. శ్రద్ధగా తయారయింది ఇందు ఈ రోజు'' నవ్వు దాచుకుంటూ అన్నాడు తండ్రి.

''మీరే వి. ఐ. పి. డాడీ !'' అంది ఇందిర నవ్వుతూ.

''అబద్ధాలాడకు, ఆడపిల్లలు పుడ్తారు'' వెక్కిరించాడు రమేష్.

''నాకు ఈ పాతచింతకాయ సామెతలు గిట్టవు! ఆడపిల్లలు పుట్టడం ఒక పెద్ద శిక్షా ?'' కయ్యానికి కాలుదువ్వాడు సురేష్.

''ఊరికే మాట వరసకి అన్నాను'' సర్దుకున్నాడు రమేష్.

''డాడీ, మీరు కనీసం రెండయినా అబద్ధాలు చెప్పి ఉండాలి ఎప్పుడో!?'' అడిగింది ఇందిర తనను, చెల్లెలిని చూపిస్తూ.

''నేను కాదమ్మా అబద్ధాలు చెప్పింది— మీ అమ్మ'' రామారావు మాటలకు అంతా నవ్వారు.

మధు వచ్చాడు అప్పుడే, ''ఏమిటో జాలిగా ఉన్నారు అందరూ'' అంటూ.

''హల్లో, బదరిన్నా, కూర్చోండి'' కుర్చీ చూపించాడు సురేష్.

''మీకోసం ఎదురుచూసి, చూసి మా అక్క కళ్ళు కాయలు కాచిపోతున్నాయి'' అన్నాడు రమేష్.







'నిజమా' అన్నట్లు ఇందిరవైపు కొంటెగా చూసి, "విష్ యూ మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అని రామారావుతో కరచాలనం చేశాడు మధు.

సుభద్ర వచ్చింది లోపలినించి. "ఇప్పుడేనా రావటం ?" అని మధుని పలకరించి, భోజనాలకు లేవమని అందరికీ చెప్పింది.

భోజనాలయినాక రామారావు, సుభద్ర స్కూటర్‌పైన సినిమాకు వెళ్ళారు. అందరూ కబుర్లలో పడ్డారు. రమేష్, సురేష్ ఇంటర్ ఫైనలియర్ చదువుతున్నారు. ఇంటర్ అవగానే మెడిసిన్ చదవాలనేది రమేష్ కోరిక అయితే, ఇంజనీర్ కావాలనేది సురేష్ ఆశయం.

"ప్రతి యింట్లోను ఓ డాక్టరు వెలుస్తున్న ఈ రోజుల్లో మెడిసిన్ చదవటం చాలా బుద్ధి తక్కువ పని ! వీధికి పది డాక్టర్ల బోర్డులు కనిపిస్తున్నాయి" కావాలని రమేష్‌ని కవ్వించాడు సురేష్.

"ఇంజనీర్లకి ఉద్యోగాలే లేవు కదుటోయ్ అసలు ! డాక్టర్లయితే కనీసం బోర్డు తగిలించుకొని అయినా నాలుగు డబ్బులు సంపాదించుకోగలరు !" అన్నాడు రమేష్.

"ఇంజనీరింగ్ చదివి దేశప్రగతికి పాటుపడ్తాను. జీవితంలో డబ్బే ప్రధానం కాదు !" అన్నాడు సురేష్.

మధు నవ్వాడు. "నీకు వయస్సు తక్కువ కనక అలా అంటున్నావు. జీవితంలో డబ్బు ముఖ్యం కాదని ఏ కాస్త అనుభవం ఉన్నవాడయినా అనడు."

"నేను ఒప్పుకోను. డబ్బుతో కొనలేనివి చాలా ఉన్నాయి" వాదనకు దిగింది ఇందిర.

"ఏదయినా ఒక్కటి చెప్పు !" అన్నాడు మధు.

"సంతృప్తి."

"ఎంత అమాయకంగా మాట్లాడుతున్నావు ఇందిరా ! సంతృప్తిగా బ్రతకటానికి తిండి, బట్ట కావాలి కదా ! కొద్దో, గొప్పో సరదాలు తీరాలి కదా! డబ్బు లేకపోతే ఇవి సాధ్యమేనా!?"

"ఇవన్నీ ఉన్నా, సంతృప్తిగా బ్రతకలేకపోతున్న ధనవంతులు ఎందరో ఉన్నారు" అంది ఇందిర.

## నీలాకాశం

"నిజమే. కాని ఇవేవీ లేకపోయినా సంతృప్తిగా ఉన్నవారెవరినయినా చూపించు ! ఆకలితో మాడుతూ, నేను తృప్తిగా ఉన్నానని ఎవరయినా అనగలరా? డబ్బు లేనిదే మనిషి బ్రతకలేడు ఇందిరా! డబ్బు లేనివాడిని ఎవరూ గౌరవించరు !"

"ఆశయాలు, ఆదర్శాలు అనేవి జీవితంలో ఉండకూడదన్నట్లు మాట్లాడుతున్నావు మధూ !"

"కాదు, కేవలం ప్రాక్టికల్‌గా మాట్లాడు తున్నాను, అంతే. డబ్బుతో కొనలేనివి చాలా ఉన్నాయి అన్నావుకదూ, మరేదయినా ఒకటి చెప్పు."

"ప్రేమ !"

నవ్వాడు మధు. "మై స్వీట్ చైల్డ్— నువ్వు నిజంగా చైల్డ్‌వే ! డబ్బు సంపాదించలేని మగవాడిని ఏ భార్య ప్రేమిస్తుందో చూపించు. తల్లితండ్రులకు కూడా ఎక్కువ డబ్బు సంపాదిస్తున్న కొడుకుపట్ల ఉండే ప్రేమ తక్కువ సంపాదిస్తున్నవాడిపట్ల ఉండదు ! ఒకమాట అడగనా, నేను బ్యాంకి ఆఫీసరుగా పనిచేస్తూ, నెలకు వేయి రూపాయల పైన జీతం తెచ్చుకుంటున్నానుకదా ! నాకు ఈ జీతం, ఈ ఉద్యోగం లేకపోతే మీవాళ్ళు పెళ్ళి సంబంధం విచారిస్తూ నావద్దకు వచ్చేవారా? నేను నీకు నచ్చేవాడినా ?"

నవ్వుతూ అంది ఇందిర, "పెళ్ళిని డబ్బుతో ముడిపెట్టటం ఇష్టంలేదని, కట్నం తీసుకోని వ్యక్తినే చేసుకుంటానని, నేను పెళ్ళిచూపులలోనే చెప్పాను. మరి నీవెందుకు ఒప్పుకున్నావు?డబ్బుపైన అంత వ్యామోహమే ఉంటే, కట్నం ఇచ్చేపిల్ల దొరకటం కష్టంకాదే ? ఊరికే వాదనకోసం అంటున్నావు కాని మధూ, నిజానికి నీవేమీ డబ్బు మనిషివికావు, అంతేనా ?"

"నాకు నువ్వు, నీ చదువు, నీ మాటలు, నీ ధైర్యం అన్నీ నచ్చాయి ఇందిరా, అందుకని ఒప్పుకున్నాను. కట్నం డబ్బు ఎట్లాగయినా నిలిచేది కాదు — నగలు, చీరలు, పెళ్ళి ఖర్చులు అంటూ కొట్టుకుపోతుంది. దానికోసం నిన్ను కాదనలేక పోయాను" ఆప్యాయంగా ఇందిర చేతిని అందుకుంటూ అన్నాడు మధు.

"ప్లీజ్, స్టాప్ ! పెద్దవారున్నారు ఇక్కడ!" తటాలున అన్నాడు రమేష్.

ఇందిర చేయి వదిలేశాడు మధు. సిగ్గుతో ఎర్రబడిన ఆమె ముఖం చూసి తమ్ముళ్ళు నవ్వేశారు.

"మమ్మల్ని అవతలికి వెళ్ళమంటారా ?" అడిగాడు సురేష్ లేచి నిలబడుతూ.

"ఫర్వాలేదు, ఇంజనీర్‌గారూ ! కూర్చోండి" అన్నాడు మధు.

"నన్నలా వెక్కిరిస్తే ఒప్పుకోను" ఉడుక్కున్నాడు సురేష్.

ఇందిర లోపలికివెళ్ళి అందరికీ టీ చేసి తెచ్చింది. ఉష టీ త్రాగుతూ అడిగింది "బావా, నాకు పట్టు పరికిణీ కొంటానన్నావు. ఎప్పుడు కొంటావు ?"

### ఆయుర్దాయానికి సైకిల్ !

పశ్చిమ జర్మనీలో సుమారు 2.9 కోట్ల సైకిళ్ళున్నాయి. అంటే దేశంలో ప్రతి ఇద్దరిలో ఒకరికి సైకిలున్నది. కొన్ని సంవత్సరాల క్రితం సైకిల్ త్రొక్కడం ఒక వ్యాయామంగా ప్రారంభమైంది. అన్ని తరగతుల వారు ఆరోగ్యం కోసం సైకిలు తొక్కేవారు. ఈ రోజు చాలా మందికి హాబీగా మారింది. కొంతమందికి సైకిలు తొక్కడం ఒక ఆట. 1981 లో 200 కిలో మీటర్ల సైకిలు యాత్రలో నాలుగు వేలమంది పాల్గొన్నారు. ఇది చాలా తక్కువే. కారణం ఆ రోజు వాన కురుస్తున్నది. 1980లో పదివేలమంది సైకిలుయాత్రలో పాల్గొన్నారు. రోజూ సైకిలు తొక్కేవారు మిగిలిన వారి కంటే ఐదు సంవత్సరాలు ఎక్కువ బ్రతుకుతారు. అనారోగ్యం ఉండదు. గుండె జబ్బులు రావు. సుఖంగా నిద్ర పడుతుందని డాక్టర్లు అంటున్నారు.

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

**నైసిల్**
**ఉపయోగించండి**
**అతి శీఘ్రంగా**
**ఉపశమనమునిచ్చే**
**చెమటకాయల పౌడర్.**






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

## నైసిల్ తెచ్చుకోండి
## చెమటకాయల బాధ మరిచిపోండి.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLNr 4-203 TEL

# వారఫలం

**29–10–1982 శుక్రవారం మొదలు**
**4–11–1982 గురువారం వరకు**

మేషం: దూరబంధువుల నుండి శుభ వార్తా శ్రవణం కొందరకు తప్పనిసరి ప్రయాణాలు, కొందరకు సభలో, విందువినోదాలలో పాల్గొను అవకాశం ఏర్పడ గలవారం. స్త్రీలకు: శుభ కార్యాల హడావుడి, పేరంటాల తొందరలు, కళా రంగావకాశాలకు అనుకూల వారం.

వృషభం: గ్రహించండి బాగా శ్రమించ దగిన వారం. నాలుగు రంగాలలోని ప్రసిద్ధులను అధికారులను కలిసికోగల అవకాశాలు ఉంటాయి బంధువులు తలవని తలంపుగా యింటికి రావటం. తద్వారా అధికంగా వ్యయం చెప్పదగిన వారం. స్త్రీలకు: సుఖశాంతులకు, ఉద్యోగంలో ఉన్నత స్థితికి సదవకాశాలు లభింప నున్నాయి.

మిధునం: చాలమంది విషయంలో, ముఖ్యంగా వయసు మీరిన వారు ఆరోగ్య విషయంగా జాగరూకత వహించాలి. వస్తు వాహనాలు సమ కూర్చుకొనే అవకాశం లేకపోలేదు. ఆదాయానికి, ఆదరణకు, అధికారుల వలన జరుగదగిన మేలునకు లోపం లేదు. స్త్రీలకు: నాలుగు రంగాలలో సదవకాశాలకు చోటు గల వారమే.

కర్కాటకం: కళా రంగంలో అవకాశాలు కొందరకు లభించగలవు. కొందరకు సభా గౌరవం, కొందరకు పత్రికా గౌరవం సమకూడే అవకాశం గల వారమే. చూచి చూడనట్లు కొన్ని విషయాలలో మెలగాలి అట్టే పట్టుదలతో ఉండరాదు. స్త్రీలకు: అభీష్టం నెరవేరుతుంది. కాస్త ఆదాయం కూడా లేకపోలేదు.

సింహం: చాలమందికి అంటే వయసు మీరిన స్త్రీపురుషులకు ఆరోగ్య విషయమై హెచ్చరిక! ఎంతో జాగ్రత్త వహించాలి. నరాల బలహీనత వలన రక్తపుపోటు వలన బాధ చెప్పదగి యున్నది. స్త్రీలకు: అధిక కార్యభారం, అప్రయత్నంగా వ్యయం తగలటం, ఆస్తి విషయంలో తర్జనభర్జనలు చెప్పదగిన అంశాలు.

కన్య: మీ వలన మేలు పొందిన మిత్రులు ఏరుదాటి తెప్ప తగలెయ్యక, మరల మీకు సహాయ సంపత్తులు అందింప నున్నారు వీలైనంతలో స్వీకరించండి. చుట్టపక్కాలతో ఘర్షణకు అవకాశం ఉంటుంది. ఓర్పు ఎంతైనా అవసరం. స్త్రీలకు: సహనంతో, శాంతంతో, కుటుంబ వ్యవహారాలు ఉద్యోగ వ్యవహారాలు నెరవేర్చుకోవటం ఎంతైనా అవసరం. విలువగల వస్తుసేకరణకు అవకాశం గలవారం.

తుల: ఒకటి చేయబోయి ఒకటి చేయటం అనుకొనేది ఒకటి చేసేది మరొకటిగా ఉండేవారం ఏమయినా ధనాభావం, చికాకులకు దోహదం చేసే వారం స్థితిగతులందు ఏమాత్రం అభివృద్ధి కనిపించదు స్త్రీలకు. ఆదాయాభివృద్ధి, ఉద్యోగ ప్రగతి చెప్పదగి వారం.

వృశ్చికం: కళా రంగంలో, సాహితీ రంగంలో 'ఆకాశవాణి', 'దూరదర్శిని' యిత్యాది సంస్థల అవకాశాలు సమర్థులైన, కొందరకు ఈరాదివారికి లభ్యములు. ఆస్తిని కొనుగోలు చేయు ప్రయత్నాలు ఫలితానికి రాగలవు, ప్రయత్నించి చూడండి. స్త్రీలకు: ఉద్యోగాన్వేషణులకు ధనాదాయం ఉంటుంది

ధనుస్సు: ఎలాచూచినా నాల్గు విధాలా అనుకూల వారమే. మీ నుండి ధనసహాయం పొందిన వారు సలహాలనంది బాగుపడినవారూ, తిరిగి చూడరనే విషయం గ్రహించినమీద బాధ పడుతారు. చాలమంది ఆరోగ్య విషయంలో జాగరూకత వహించటం ఎంతైనా మేలు. స్త్రీలకు రచనావకాశాలు, తద్వారా ఆదాయం సంభవం

మకరం: నూతన వస్తు సేకరణకు, వస్త్ర సేకరణకు, వాహన సేకరణకు, భూసంపదను అభివృద్ధి పరచుకొనుటకు అవకాశం గలవారం. మోస కృత్యానికి ఎలాగో లోనుకావలసి ఉంటుంది. స్త్రీలకు: వృత్తియందు కించిత్తు అయివోజుకు, కొందరకు స్వల్ప ప్రయాణాలకు అవకాశం గల వారమే.

కుంభం: ఒకానొక కార్యం నెరవేర గలవారం. అప్రయత్నంగా ధనలబ్ధికి అవకాశం ఉంటుంది. వస్తు వాహన సేకరణకు సాహితీ రంగంలో సదవకాశాలకు అవకాశం గలవారం. స్త్రీలకు: అధికంగా అయివోజు లభించుటకు అవకాశం గలవారం.

మీనం: శ్రద్ధగా రంగాలలో యత్నాలకు దిగండి. బంధువుల నుండి శుభ వార్తా శ్రవణ మున్నది నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలితానికి రాగల అవకాశాలుంటాయి. ఎంత శ్రేష్ఠతతో ఏ కార్యాలు సాధన చేసికొంటే అంత మంచిది. ధనలబ్ధికి అవకాశ మున్నది. స్త్రీలకు. వృత్తి ఉద్యోగాలందు, క్రయ విక్రయాలందు, నూతన వస్తువులు సాధించు కొనుటకు అవకాశం గలవారం

— విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి *

## నీలాకాశం

"ఎప్పుడు కొంటానన్నానో గుర్తుందా ?" అడిగాడు మధు నవ్వుతూ.

"ఆ, గుర్తుంది. మీ పెళ్ళికి కొంటానన్నావు ఎప్పుడు పెళ్ళి ?"

"మీ అక్కని అడుగు."

"ఏం, అక్కా ! పెళ్ళెప్పుడు ?"

"నాకు తెలీదు. మీ బావనే అడుగు."

"అక్కకి తెలీదుట బావా, నువ్వే చెప్పు !"

"నేను చెబుతాను, ఇటురా" పిలిచాడు సురేష్ చెల్లెలి చెవిలో ఏదో చెప్పాడు రహస్యంగా. కిలకిలా నవ్వింది ఉష.

"ఏమిటో ఆ జోక్ ?" అడిగాడు మధు.

"చెప్పం ! మేము చెప్పం !" చప్పట్లు కొడ్తూ ఇంకా నవ్వింది ఉష.

"ప్లీజ్ చెప్పవా ?" (బతిమలాడింది ఇందిర

"ఊహూ" అంటూ రమేష్ దగ్గరకు వెళ్ళి, అతని చెవిలో చెప్పింది ఉష. అతను గట్టిగా నవ్వాడు

మధు, ఇందిర చిరునవ్వుతో ముఖాముఖాలు చూసుకున్నారు, ఏమిటో ఆ రహస్యం అన్నట్లు.

ఎవరో తలుపుతట్టిన చప్పుడయింది. అంతా నవ్వులు ఆపి చూశారు.

ఇందిర లేచి వెళ్ళి తలుపు తీసింది. అక్కడ ఒక అపరిచితమైన వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతను ఏం చెప్పాడోకాని, అతని వార్తకు తనలోని శక్తి అంతా హరించుకుపోయినట్లు పాలిపోయింది ఆమె ముఖం నిలబడలేనట్లు తలుపు పట్టుకుంది.

"ఏమిటి ?" ఆత్రంగా వచ్చారు రమేష్, సురేష్.

"మీ పేరెంట్స్‌కి స్కూటర్ ఆక్సిడెంట్ అయింది. హాస్పిటల్‌లో ఉన్నారు. మీ నాన్నగారి పర్స్‌లో అడ్రస్ చూసి, డాక్టరుగారు నన్ను ఇక్కడికి పంపించారు."

రమేష్‌కి, సురేష్‌కి నోటమాట వెలువడలేదు

"సీరియస్‌గా ఉన్నారా?" అడిగాడు మధు.

"నాకు తెలియదు... వెంటనే రండి" హాస్పిటల్ అడ్రస్ చెప్పాడు.

ఇందిర మెల్లగా కదిలింది. ఉష చిత్తరుపోయి చూస్తున్నది. చెల్లెలివైపు చూసేసరికి దుఃఖం పొర్లుకువచ్చింది. కాని తను ఏడిస్తే చెల్లెలు, తమ్ముళ్ళు ఇంకా చిత్తరుపడిపోతారు ... ధైర్యంగా ఉండాలి ... వివేకం హెచ్చరించింది. చెల్లెలిని దగ్గరకు తీసుకుంటూ "భయపడకమ్మా ఉషా ! పద వెళ్దాం" అంది.

అందరూ టాక్సీలో హాస్పటల్ చేరుకున్నారు. టాక్సీ ఆగుతూనే ఒక్క పరుగున లోనికి వెళ్ళింది ఇందిర.

"రామారావుగారి అమ్మాయా ?" బయట వరండాలో ఎదురయిన నడివయస్సు వ్యక్తి—డాక్టరు కాబోలు — అడిగాడు.

అవునన్నట్లు తలూపింది. "అమ్మ, నాన్న ఎలా ఉన్నారు ?" అని అడుగుదామంటే గొంతు పెగిలిరాలేదు.

"ఇట్లా కూర్చోమ్మా ముందు" (పక్క గదిలోకి తీసుకువెళ్ళి కుర్చీ చూపించాడు.

ఇందిర అసహనంగా చూస్తుంటే, బలవంతంగా కూర్చోబెట్టి "చూడమ్మా .. నీవు ధైర్యంగా ఉండాలి . మీ అమ్మ, నాన్న ఇద్దరూ అరగంట క్రితమే ఈ లోకంనించి వెళ్ళిపోయారు" నింపాదిగా చెప్పాడాయన

క్రూన్పడిపోయింది ఇందిర.

అప్పుడే అక్కడకు వచ్చిన మధు, రమేష్, సురేష్, ఉష ఆ మాటలు విన్నారు. ఉష అక్క ఒడిలో వాలిపోయింది.

"అక్కా !" అంటూ రమేష్, సురేష్ దగ్గరకు చేరేసరికి దుఃఖం ఆపుకోలేక రెండు చేతుల్లో ముఖం దాచేసుకుంది

"చూడమ్మాయ్, నీవే కదా పెద్దదానివి ? ఇది మీ కందరికీ పెద్ద షాక్ — నాకు తెలుసు. అయినా ధైర్యం తెచ్చుకొని నువ్వు లేవకపోతే, నీకన్న చిన్నవాళ్ళు ఏమయిపోతారు ? లేమ్మా, లే" ఆదరంగా అన్నాడు డాక్టర్.

నిజమే, తను పెద్దది. ఏడవకూడదు. ధైర్యంగా ఉండాలి చెల్లిని, తమ్ముళ్ళని తనే ఓదార్చాలి... తలెత్తి చూసింది రమేష్, సురేష్ నీళ్ళు నిండిన కళ్ళతో తననే చూస్తున్నారు ఉష సరేసరి—అక్కను గట్టిగా వాటేసుకొని ఏడుస్తున్నది.

చిన్నగా లేచింది ఇందిర. ఏమయినాసరే తను కన్నీరు కార్చకూడదు. చిన్నవాళ్ళు మరీ బెంబేలెత్తిపోతారు గుండెల్లో మంట అక్కడే ఉండాలి బయటకు రాకూడదు.

ఉష చేయి పట్టుకొని, "రామ్మా, అమ్మా వాళ్ళను చివరిసారిగా చూద్దాం" అంది. "రమేష్.. మనం దురదృష్టవంతులం" అంటుంటే గొంతు నిండుకువచ్చింది. సురేష్ కన్నీళ్ళు తుడిచింది.

మధు దగ్గరగా వచ్చాడు. "ఇందిరా. . ఎంత షాక్..." ఆదరంగా భుజాన చేయి వేశాడు. అతనికీ నీళ్ళు తిరుగుతున్నాయి.

లోపలగదిలో ప్రక్కప్రక్కనున్న బెడ్స్పైన ఉన్నాయి రామారావు, సుభద్రల నిర్జీవ దేహాలు. ఇద్దరికీ మెడవరకు దుప్పట్లుకప్పి ఉన్నాయి ముఖాలపైన మాత్రం ఏ గాయాలూ లేవు ప్రశాంతంగా నిద్రిస్తున్నట్లే ఉన్నారు.

ఉష వెక్కివెక్కి ఏడుస్తున్నది. ఆ పిల్లకు అంతా అయోమయంగా ఉంది.

ఇందిర అలా చూస్తూ నిలబడిపోయింది. ఈ రోజు ఉదయం తామంతా ఎంత ఉత్సాహంగా ఉన్నారు ! అమ్మ, నాన్నల పెళ్ళిరోజు అని సందడిగా ఎన్ని ఏర్పాట్లు చేశారు ! పిల్లలు శుభాకాంక్షలు చెప్తుంటే అమ్మ ముఖంలో ఎంత కాంతి ! నాన్న ముఖంలో ఎంత ఆనందం ! ఆ కళ్ళల్లోని వెలుగు ఇప్పుడు ఏమయింది ? ఆ ముఖాల్లోని కళ ఎంతలో ఎంతగా అంతరించిపోయింది ! ఎక్కడికివెళ్ళిపోయింది ఆ చైతన్యం అంతా ? అమ్మా ! నాన్నా ! ఇంకమీరు కనబడనేకనబడరా? మాట్లాడనేమాట్లాడరా? ఇదంతా నిజమేనా !? లేక పీడకల కాదుకదా ! సడెన్‌గా ఏదో ఆశ కలిగింది ఇందిరలో ఇదంతా ఒక చెడ్డకల కాస్సేపట్లో మెలకువ వచ్చేస్తుంది "ఇందూ" అనే అమ్మ పిలుపుతో తను లేస్తుంది

కళ్ళు నులుపుకొని మళ్ళీ చుట్టూ చూసింది రమేష్, సురేష్ తల్లితండ్రుల శరీరాలపైన పడి ఏడుస్తున్నారు ఉష తన ఒళ్ళో తల పెట్టుకొని బావురుమంది మధు అనునయంగా తన చేతిని పట్టుకున్నాడు ఇది కలకాదు ఇదంతా నిజమే చెంపలపైన కన్నీరు కారిపోతున్నది

"ఉషా ! ఏడవకమ్మా ! మనం ఇలా ఏడిస్తే అమ్మ, నాన్న బాధపడరూ ?" అంది కళ్ళు తుడుచుకుంటూ

"అమ్మ ఏదక్కా ? లేదుగా !" ఇంకా గట్టిగా ఏడుస్తున్నది ఉష.

"అమ్మ, నాన్న ఎక్కడికీ వెళ్ళలేదమ్మా ! మనకు ఇంక కనబడరు కాని మన మధ్యనే ఉంటారు —"

అయోమయంగా చూసింది ఉష చెల్లెలికి, తమ్ముళ్ళకి ధైర్యం చెప్పటానికి నిబ్బరంగా లేచి నిలుచుంది ఇందిర

(ఇంకా వుంది)


చిత్రకళ: సంతను చిత్ర విద్యాలయపు రజతోత్సవము






స్థాపితం: 19 ఏప్రిల్ 1957

ఫోన్ నెం. 846188

గత 25 సంవత్సరములుగా తపాల పాఠములద్వారా చిత్రకళను, తమిళం తెలుగు, ఇంగ్లీషు, మలయాళం, హిందీ మొదలగు 5 భాషలలో కొన్నివేలమంది విద్యార్థులకు సాధన నిచ్చుచున్న గొప్ప సంస్థ ఇది యొక్కటే ! మీరుకూడా ఈ సంస్థనందుచేరి, తక్కువ వ్యయముతో ఎక్కువ పాఠములు పొంది, చిత్రకళ నభ్యసించి మంచి చిత్రకారులగుటకు ఎంతో అవకాశమున్నది. పూర్తి వివరములకొరకు 90 పైసలు తపాల స్టాంపుతో వ్రాయండి

సంతను చిత్ర విద్యాలయము C/o చిత్రకుళ్ళన్ (P),
179, సింగన్న చెట్టి వీధి, చింతాద్రిపేట, మద్రాసు-600 002.




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### టి. వి. ఎల్. — వైజాగ్

మా పాపకు 6 సంవత్సరములు. 6 నెలల క్రితం పాపకు మలపరీక్ష చేయిస్తే టేప్‌వర్మ్స్ వున్నట్లు తేలింది. చాలా మందులు వాడాము. ఈ మధ్య మరల పరీక్ష చేయిస్తే ఇంకా టేప్‌వర్మ్స్ వున్నట్లు తెలిసింది. పాప అప్పుడప్పుడూ కడుపు నెప్పి, మంట అంటుంది.

★ నిక్లోసాన్ అనే మాత్రలు ప్రస్తుతం మందుల షాపులో దొరుకుతున్నాయి. ఆరు సం.ల పిల్లలకి 500 మి.గ్రా. మాత్రలు ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి వంతున వాడవలసి ఉంటుంది. హెచ్. నానా అనేరకం టేప్‌వర్మ్ ఉంటే వరుసగా అయిదు రోజులు మాత్రలు వాడాలి.

ఈ మాత్రలు వాడేముందు 48 గంటలనుంచి స్వల్ప ఆహారం మాత్రమే ఇవ్వవలసిఉంటుంది. ఈ మాత్రలు వాడితే విరేచనానికి వేరేమందు వాడవలసిన అవసరం లేదు.

### కె. డి. పి. — విజయవాడ

నా వయస్సు 20 సం॥లు. నెల రోజుల క్రితం కళ్ళు దురదపెట్టి, నలిపితే ఎర్రగా అయి రెప్పలు అంటుకుపోయేవి. పగలే కళ్ళలో పుసులు కట్టేవి. మళ్ళీ మళ్ళీ అలాగే వస్తోంది. కంటికి డ్రాప్స్ వాడినా తగ్గలేదు.

★ దీనిని క్రానిక్ కన్‌జెన్‌క్టివైటిస్ అని అంటారు. వ్యక్తిగత అలవాట్లలో పరిశుభ్రత లేనందువల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. కళ్ళలో కట్టిన పుసులను లేబరేటరీలో కల్చర్ - సెన్సిటివిటీ పరీక్ష చేయించి ఆ ఫలితాన్ననుసరించి యాంటీబయాటిక్‌లు కళ్ళలోను, మాత్రలరూపంలో లోనికి వాడవలసి ఉంటుంది. వ్యక్తిగత పరిశుభ్రత చాలా అవసరం. కళ్ళలో దుమ్ము మొ॥వి పడకుండా కళ్ళజోడు వాడవచ్చును.

### ఎ. — కె. రాజుపాలెం

మా నాన్నగారికి కొన్ని సంవత్సరాల నుండి కడుపులో మంట వస్తోంది. 2 లేక 3 నెలలకి వస్తోంది. వస్తే విపరీతంగా బాధ పడతారు. అలా వచ్చినప్పుడు 3 రోజుల వరకు ఉంటుంది. కడుపులో సబ్బు బిళ్ళంత బిళ్ళ తయారైంది ఎన్ని మందులు వాడినా ఫలితం కనబడటంలేదు.

★ మీ నాన్నగారికి కడుపులో "అల్సర్" ఉన్నట్లు పై లక్షణాలవల్ల తెలియవస్తున్నది. అల్సర్ ఏర్పడిన తర్వాత పైలోరిక్ స్టినోసిస్ ఏర్పడితే ఇలా బిళ్ళలాగా కనబడటం జరుగుతుంది. రోగ నిర్ధారణకిగాను బేరియం మీల్ సీరీస్ ఎండోస్కోపీ మొదలయిన పరీక్షలు చేయించి, శస్త్రచికిత్స చేయించుకోవటం అవసరం. మందులు మాత్రం వాడటంవల్ల ఎక్కువగా ఫలితం ఉండదు.

### ఇ. ఏ. — యేకపాదంపల్లె

మా తండ్రికి కుడిప్రక్క గొంతుకి కేన్సర్ అని హైద్రాబాదులో కరెంటు పెట్టించినాము. కొంత బాగయింది. మళ్ళీ నెప్పిగా ఉంటే హైద్రాబాద్ వెళ్ళారు అది బాగవుతుందా ? కేన్సర్ వ్యాధి రాకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలి ?

★ కరెంట్ పెట్టిన తర్వాత కూడా కేన్సర్ పెరగటం జరుగవచ్చును. కేన్సర్ ప్రథమ దశలో ఉన్నప్పుడు శస్త్రచికిత్సగాని, రేడియాతేరఫీ వల్లగానీ నయమయ్యే అవకాశం ఉంటుంది కేన్సర్ చాలా రోజులుగా ఉంటే ఈ చికిత్సా విధానాలు అమలు జరిపినా అయిదేండ్ల జీవితకాలం మాత్రమే రోగికి ఇవ్వటం జరుగుతుంది. కేన్సర్ రోగం ఎందువలన వచ్చేదీ నిర్ణీతంగా తెలియదు. శరీరంలోని కొన్ని ప్రాంతాల కేన్సర్‌కి కొన్ని కారణాలు దోహదం చేస్తాయని మాత్రమే ప్రస్తుతం తెలుసు. ఉదా :— పొగత్రాగటం, మధుపానం, కొన్నిరకాల వృత్తులు మొ॥ వీటికిగాను జాగ్రత్తలు తీసుకొంటే చాలు

### ఎస్. ఎస్. — పులివెందల

మాకు వివాహమయి మూడు సంవత్సరములు అయినది. సంతానము లేదు లేడీ డాక్టరుకి చూపించగా పరీక్షచేసి గర్భకోశం చిన్నదిగా వున్నది అన్నారు నేను బహిష్టు అయ్యేముందు 5, 6 రోజులు వైట్ డిశ్చార్జ్ అవుతుంది నాకు సంతానము కలుగకపోటానికి కారణమేమిటి ?

★ సంతానం కలుగకపోవటానికి స్త్రీలలోను, పురుషులలోను లోపం ఉండవచ్చును. ముందుగా పురుషులు పరీక్ష చేయించుకోవటం అవసరం. వారికి సెమెన్ అనాలిసిస్ మాత్రమే అవసరం అవుతుంది. స్త్రీలకి 'డి అండ్ సి', ట్యూబ్ టెస్టింగ్ మొదలయిన పరీక్షలు చేయటం జరుగుతుంది. వైట్ డిస్చార్జికీ గర్భం రాకపోవటానికీ సంబంధం లేదు. గర్భకోశం కొద్దిగా చిన్నదిగా ఉన్నంత మాత్రాన గర్భం రాకూడదని లేదు. మీరు అన్ని వసతులూ ఉన్న పెద్ద ఆస్పత్రులలో పరీక్ష చేయించుకోవటం మంచిది. ★

థ్రిల్, థ్రిల్, థ్రిల్, ఆమాటే ఎంతో థ్రిల్‌గా వుంది. ఈ థ్రిల్ కోసం ఏం చేయాలి? ఎవరినైనా హత్యచేస్తే, ఏ బ్యాంక్‌నైనా లూటీచేస్తే, ఎవరిగారాల బిడ్డనైనా ఎత్తుకుపోతే లేక.... ఏ అమ్మాయినైనా ............. అన్నీవున్న రమేష్ థ్రిల్ కోసం ఎదుటివారి జీవితాలతో ఆడుకోవాలనే ఆరాటం.
పిల్లలకు డబ్బు, సుఖం ఎక్కువగా వుంటే, క్రమశిక్షణతో పెంచకపోతే, ఎలా పెడత్రోవలు పెడతాయో చాటిచెప్పిన నవల
శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి
అపూర్వ పాత్ర, సన్నివేశ, సంఘటనల చిత్రీకరణతో.....
హృదయగానం వెల రు. 21
అన్ని పుస్తకాల షాపుల్లోనూ దొరుకుతుంది లేదా ఒకరూపాయి తగ్గించి M.O. చేయండి.
ఆరూపాయికి V.P. పంపుతాము క్వాలిటీ పబ్లిషర్స్ రామమందిరం వీధి విజయవాడ-2

"ఈ స్టూడెంట్స్‌కి టీచింగ్ మహా పెద్ద యజ్ఞమనుకో" అంది రాధ నిట్టూరుస్తూ.

"నీవు బాగా టీచ్ చేస్తావని ప్రక్కింటి గోపి అన్నాడే" అంది దేవకి.

"అదే స్టూడెంట్స్‌తో వచ్చిన చిక్కు. వాళ్ళకు నచ్చితే అదే లెక్చరర్ కావాలని గోల పెడతారు, అందువల్ల స్టాఫ్ రూంలో మిగిలినవారిని ఎదుర్కోవడం చాలా కష్టం తెలుసా! నాకు తెలిసినవాళ్ళు, రిలేటివ్స్ క్లాసులో ఉండబట్టి నన్ను స్టూడెంట్స్ కోరుతారని నా కొలీగ్ శ్యామల తీర్పు" అంది రాధ.

"ఇంతకీ ఎవరే ఆ రిలేటివ్స్ నీకు తెలియకుండా?" అంది దేవకి.

"నీకు తెలియకుండానేగాదే, నాక్కూడా తెలియకుండా' అను. అందుకే 'ఆడది అసూయ ద్వేషాల స్వరూపము అని తెలుసుకొనుము ఓ మూర్ఖ నరుడా' అన్నారు పెద్దలు" అంది నాటకపక్కీలో అనూరాధ.

'అచ్చు ప్రసాద్ మామయ్యలా మాట్లాడుతున్నావే' అంది దేవకి, మామయ్య తలపుతో ఆ అమ్మాయి మొఖం వెయ్యి వాల్టుల బల్బులా వెలిగిపోయింది.

"దేవీ, చెప్పటం మరిచాను, పోయిన నెల ఢిల్లీకి ఇంటర్వ్యూకని వెళ్ళాను, అప్పుడు ప్రసాదు గెస్ట్ హవుస్‌లోనే వున్నాను, నాలుగు రోజులు" అంది రాధ.

అనుమానంతో అప్పుడే సుడులు తిరుగుతున్న భావాన్నిబయటికి కనపడకుండా "ఎప్పుడూ టూర్‌లని అనేవాడు క్వార్టర్స్‌లో వున్నాడా" అంది దేవకి తల్లి.

"లేకేమండీ నాలుగు రోజులు శెలవు పెట్టి ఢిల్లీ అంతా తిప్పాడు, ఇంకా వుంటే ఆగ్రా కూడా తీసుకెళ్తానన్నాడు కానీ నాకే శెలవు లేక వచ్చేశాను" అంది రాధ.

తల్లీ కూతుళ్ళు ఉన్నట్టుండి మౌనం వహించడం చూచి అర్థము చేసుకొన్న రాధ "దేవీ సినిమాకు వెళ్దామా విచిత్రబంధంకు" అంది.

"నేను రాను" అంది దేవకి నీరసంగా.

కామాక్షమ్మ లోపలికి వెళ్ళిపోయింది. ఇంక ప్రయోజనం లేదని "నేను వెళ్ళొస్తానే" అంటూ వెళ్ళిపోయింది.

వెళ్తూన్న రాధవైపు చూస్తూ ఉండిపోయింది దేవకి. మడత చెరగని దుస్తులలో ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ వుండే రాధలో ప్రత్యేక ఆకర్షణ వుంది. ఆమె ప్రతి కదలికలో నాగరికత తెలిసినది, చదువుకొన్నది, సంస్కారవతి అని అనిపించేట్లు ఉంటుంది. అటువంటి రాధ నాలుగురోజులు మామయ్య క్వార్టర్స్‌లో ఉంది. ఆమె మాటలు, పాటలు నాలుగురోజులు చూచిన మామయ్య ఇంక తన గురించి ఆలోచిస్తాడా? అని దేవకికి సంశయం కలిగింది. ఎందుకో తెలియనంత నీరసం వచ్చేసింది. అయినా ఒకే ఊరిలో ఉంటూ, క్లోజ్ ఫ్రెండ్స్ అయిగూడా ఢిల్లీ వెళ్తున్నట్లు, మామయ్యతో గెస్ట్ హౌస్‌లో వుంటున్నట్లు చెప్పని రాధంటే దేవకికి చెప్పరాని కోపం వచ్చింది. నిస్పృహయంగా అలా కూర్చుండిపోయింది.

* * *

"ఆ చదువుల సుందరి లేదూ!" అంది కామాక్షమ్మ.

"అదెవరు, సుందరి అంటే అందకత్తెగానీ చదువుల సుందరి ఎవరబ్బా" అన్నాడు గోవిందరావు.

"చాల్లేండి సరసాలు, మన రాధలేదూ, పోయిన నెల ఢిల్లీ వెళ్ళిందట. ప్రసాద్‌తో నాలుగు రోజులుందట" అంది కామాక్షమ్మ.

ఏదో భూకంపం వచ్చి పట్టణాలు మునిగిపోయాయన్నట్లు చెప్పింది.

"వెళ్తే?" అన్నాడు గోవిందరావు అర్థం గానట్లు.

"బాగుంది, వాడికి మన దేవకి నిద్దామని గదండీ! అయినా 'దానికి ఢిల్లీ చూపరా' అంటే 'తీరికలేదు' అన్నవాడు, ఈవిడ పోగానే శెలవు పెట్టి ఊరంతే చూపాడట. ఇంకా ఉంటే ఆగ్రా కూడా చూపుతానన్నాడట, అయినా పెళ్ళికాని పిల్ల వాడితో తిరగటం ఏమిటి! దీనికి బుద్ధి లేకపోతే వాడికుండ వద్దా" అక్కసు వెళ్ళపోసింది కామాక్షమ్మ.

'అయినా ఇపుడేం కొంపలంటుకుపోయిందే, ఏదో చిన్నప్పట్నుంచీ తెలిసినవాడు, అదీగాక ఢిల్లీలో ఇంకెవరూ లేకపోవటంతో వాడి సహాయం తీసుకొనుంటుంది. అంతలో అసూయ ఎందుకు? ఏమి ఆడబుద్ధో గదా,' అన్నాడు గోవిందరావు.

'మీ మగవాళ్ళంతా ఒకటే, ఎవరైనా నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చిన ఆడదాన్ని చూస్తే ఒళ్ళు తెలియదు మీకు. మీలాంటి వాళ్ళ బలహీనతలు పట్టుకొనే ఈ చదివిన అమ్మాయిలింత బరి తెగించారు,' అంది కామాక్షమ్మ.

'చదివినంత మాత్రాన, నలుగురితో కలిసి తిరిగినంత మాత్రాన చదివిన అమ్మాయిలంతా నీ అంత పతివ్రతలు కాకపోరే కాముడూ! అయినా చదువులో ఏం ఉంది, వారివారి బుద్ధిలో వుంది. అయినా ఏం చదువు చదివి మన పనిమనిషి మొగుడ్ని వదిలేసింది' అన్నాడు గోవిందరావు.

'అసలు మీరేం తక్కువ? ఇల్లు దొరకలేదని నాలుగు రోజులు టైపిస్ట్‌ని మన ఇంటి గదిలో వుంచలేదా? మీ మొగాళ్ళకు ఇంటికి వంటకు ఒక పెళ్ళాం వుండాలి. ఆ తర్వాత ఎంతమందైనా ... అసలుండండి ఆ ప్రసాదుకే రాసి ఏదో ఒకటి తేలుస్తాను' అంటూ విసవిసా లేచి వెళ్ళిన భార్యను నవ్వుతూ చూస్తుండిపోయాడు గోవిందరావ్.

* * *

ప్రశ్నలకు, సంశయాలకు జవాబుగా ఉన్నట్లుండి ఊడిపడ్డాడు ప్రసాదు. ఇంటిల్లిపాది ఆశ్చర్య ఆనందాలతో స్వాగతం చెప్పారు.

'వాడినడిగి ఏదో ఒకటి తేలుస్తాం' అంది కామాక్షమ్మ.

'మనకున్నది ఒక్కగానొక్క కూతురు, అది మోజుపడుతోందనేగానీ ఇంతకు మించిన సంబంధాలు తేగలను. అతన్నే తేలనీ' అన్నాడు గోవిందరావు.

"ఏం చేస్తున్నావు దేవీ?" అన్నాడు ప్రసాద్.

"పువ్వులు కడ్తున్నాను" అంది దేవకి సిగ్గుగా.

"నేనిచ్చిన బుక్స్ చదువుతున్నావా" అడిగాడు ప్రసాదు.

"లేదు మామయ్య, నాకు ఇంటరెస్ట్ లేదు" అంది దేవకి.

"చూడు పోయిన నెల రాధ ఢిల్లీ వచ్చింది ఆమె ఎమ్. ఎ. పాసైంది, సైకాలజీ లెక్చరర్‌గా జాబ్ చేస్తోంది కూడా" అన్నాడు.

"నాకెందుకు మామయ్య జాబ్‌లు! నేను ఒకే కూతుర్ని. రాధలాగ గంపెడు చెల్లెళ్ళు, అక్కలు, తమ్ముళ్ళూ లేరు" అంది గర్వంగా.

"చదువు జాబ్ కోసంగాదు దేవకి. రాధ చూడు ఎంత సోషల్‌గా వుంటుందో. నిజంగా గర్ల్‌ఫ్రెండ్ అని చెప్పుకోడానికెంతో గర్వంగావుంది నా ఫ్రెండ్స్‌తో అందుకే చదువుకో అని చెప్తాను. నలుగురిలో మసలడం వస్తుంది, అని. నలుగురు మగాళ్ళని చూస్తే మొగ్గలా ముడుచుకుపోతావు ఆ రాధను చూస్తే చాలు కడుపు నిండిపోతుంది ఆ నాలుగు రోజులు పుస్తకాల గురించిగాని, సినిమాల గురించి గానీ, పాలిటిక్స్‌గానీ మా ఫ్రెండ్స్ అందరం గూడా వాదించినా ఆమెను గెలవలేకపోయాం. ఆమెను చూస్తేనే కడుపు నిండిపోతోంది" అన్నాడు మెచ్చుకోలుగా.

"ఈ ఊర్లోనే కాలేజిలో పని చేస్తోంది. వెళ్ళి కడుపు నింపుకో" అంటూ విసవిసా వెళ్ళిపోయింది దేవకి.

* * *

"హలో! ఇంత అకస్మాత్తుగా ఊడిపడ్డావేం ఎలావున్నావ్" అని పలకరించింది, అప్పుడే కాలేజీ నుండి బస్‌స్టాండు దారిపట్టిన రాధ ప్రసాదును చూడగానే.

"ఉదయమే దిగాను. పని ఎలావుంది?" అన్నాడు ప్రసాదు నవ్వుతూ.

"పనికేంగానీ నీ పుణ్యమా అని నాకు ఢిల్లీ ఇంటర్వ్యూలో సెలక్షన్ వచ్చింది. అంటే త్వరలో రాధగారు ఫారిన్ చెక్కేస్తారు" అంది రాధ సంతోషంగా.

"మరి చెప్పవేం! అయితే పార్టీ ఎప్పుడు? అయినా నీవు సెలెక్ట్ కాకపోతే ఇంకెవరు సెలెక్ట్ అవుతారులే. రాధా నీతో మాట్లాడాలి పార్కుకి వస్తావా?" అడిగాడు ప్రసాదు.

"ఇప్పుడా? సరే పక్కనున్న విజయా పార్కుకు పద, ఇంతకీ ఏమిటబ్బా అంత అర్జెంటుగా నాతో మాట్లాడవలసిన విషయం" అంది సాలోచనగా రాధ.

"మా ఫ్రెన్స్ నీకు విషెస్ చెప్పమన్నారు రాధా" అన్నాడు.

"అదే విషయం అయితే పార్క్ వరకు ఎందుకు?" అంది.

"ఛ ఛ అదిగాదు ఒక పర్సనల్ మేటర్ చర్చించాలి" అన్నాడు.

పార్కులో చెట్టు నీడన కూర్చున్నారు ఇద్దరు. "నేను ఢిల్లీ వెళ్ళానని, నీ గెస్ట్‌హవుస్‌లో వున్నానని చెప్పగానే నాతో మాటలు మానేసింది నీ దేవకి" అంది, రాధ నవ్వుతూ. కావాలనే ఆ ప్రసక్తి తెస్తూ, 'నీ' అనే పదాన్ని వత్తి చెప్తూ.

ప్రసాదు మాట్లాడలేదు. మౌనంగా రాధను చూస్తున్నాడు.

"ఇంతకీ ఎందుకు రమ్మన్నావ్ పార్క్‌కి ?" అంది రాధ చివరకు.

'ఏం లేదు రాధా! పెళ్ళి విషయం మాట్లాడుదామని' నసిగాడు ప్రసాదు.

"బాగుంది. నీ పెళ్ళి విషయం నాతో ఏం మాట్లాడుతావు ?" ఆటలుపట్టిస్తూ అంది రాధ.

"నీవు ఒప్పుకుంటే నిన్ను పెళ్ళి చేసుకుందామని" అన్నాడు ప్రసాదు, రాధలో మార్పును జాగ్రత్తగా గమనిస్తూ.

"వాట్ !" ఉలిక్కిపడ్డది రాధ. "ఏమిటీ నన్నా ? నీవా ? పెళ్ళా ? ఓ గాడ్ ! దేవకి నేం చేస్తావు, రుక్మిణి రోల్ ఇస్తావా ?" అంది రాధ నవ్వుతూ. 'నీవు ఈ విషయం అడుగుతావులే అన్నట్లుంది' ఆమె ప్రవర్తన.

"రాధా ! దేవకిని చేసుకుందామనుకున్నాను. కానీ దేవికి నీకేగాదు నా వుద్యోగంలో వున్న ఏ పురుషునికీ తగిన భార్య గాదేమో" అన్పిస్తుంది.

"అంటే నీ ఉద్యోగంలో వుండేవాడికి, భార్య కావల్సినవాళ్ళకి స్పెషల్ కొమ్ములుండాలా ? అవి నాకున్నయ్యా" అంది రాధ మళ్లీ నవ్వుతూ.

"అదిగాదు రాధా ! దేవకి అందమైంది, కాదనను. కానీ పల్లెటూరిదానిలా ప్రవర్తిస్తుంది. ఢిల్లీలో వున్న నాకు తగదేమో అన్పిస్తుంది, అసలు నలుగురిలో మెలగలేదు, మగాళ్ళను చూస్తే మొగ్గలా ముడుచుకు పోతుంది, నాలాంటివాళ్ళ ఫాస్ట్‌లైఫ్‌లో ఇమడలేదేమో అనిపిస్తుంది" అన్నాడు.

'ఎప్పట్నుండి అనిపిస్తుంది?' అంది రాధ.

'నిన్ను నాలుగు రోజులు దగ్గరగా చూసిన తర్వాత నుంచి,' తడవుకోకుండా జవాబిచ్చాడు ప్రసాదు.

పెద్దగా కిలకిల నవ్వింది రాధ.

ప్రసాదు ముఖం ఎఱ్ఱబడ్డది. 'ఎందుకంత నవ్వు' బలవంతంగా అడిగాడు.

'నీవేం తమాషా చేయటం లేదుగదా' అంది రాధ సీరియస్‌గా.

'రాధా ! చాలా సీరియస్‌గా అడుగుతున్నాను, నవ్వకుండా జవాబివ్వు' అన్నాడు ప్రసాద్.

రాధ మౌనంగా వుండిపోయింది కొంతసేపు.

"మౌనం, అంగీకారం అనుకోవచ్చా' అన్నాడు ప్రసాదు.

చివ్వున తలెత్తింది రాధ. కొంచెం బెదిరాడు ప్రసాదు.

'ప్రసాద్, నీకు దేవకికి పెళ్ళి చిన్నప్పట్నుండి అనుకొన్నది. అదీగాక నీకు దేవకికీ మధ్య ఉన్న సంబంధం తెలుసు. నేను ఢిల్లీ వచ్చిన రోజు దేవకి గురించి నీవు తరచి తరచి అడగటం నాకు గుర్తే. అలాంటిది నాతో నాలుగు రోజులు తిరుగ్గానే, దేవకి కన్నా, నేనే నీకు తగినదాన్నని అనిపించటం చాలా బాధాకరమైన విషయము. నీవు నన్ను ఢిల్లీ తిప్పతే నాకు చాలా ఆనందమైంది. కానీ నాకప్పడే నీచెల్లెలు సీత వస్తే 'మర్నాడే బండి ఎందుకు ఎక్కించావా' అని అడిగాలని అన్పించింది. కానీ, డెలికసీవల్ల అడగ లేదు. నా సబ్జెక్ట్ సైకాలజీ. నేను మొన్న ఇంటర్వ్యూకి ఢిల్లీ వచ్చింది దానిలో డాక్టరేటు స్కాలర్‌షిప్ కోసం. విదేశాలు వెళ్దామని ఆశతో.

# మానవ నైజాలు

దేవుని దయవల్ల నాకు దొరికింది. నేను త్వరలో ఫారిన్ వెళ్తున్నాను. నీతో నా ప్రవర్తన సన్నిహితంగా వుండి వుంటుంది. అందుకే నీవిలా అడుగుతున్నావ్. కానీ యోచిస్తే ఇప్పుడు నీతో నాకు విషస్ పంపిన అందరితోనూ నేనదేవిధంగా ప్రవర్తించాను గదా ! వారందరినీ పెళ్ళి చేసుకోనా ? నీవిలా అడిగావనీ, నేనిలా ఉపన్యాసం ఇచ్చానని దేవితోచెప్పకు. చిన్నతనంనుండి చదువుమానేసి నిన్నేభర్తగా ఊహించుకొని స్వర్గలోకంలో విహరిస్తోంది. దానికి నా మీద అనుమానం కల్గింది. ప్రేమలో అనుమానం తప్పదు గదా ? నేనేదో తనకి అన్యాయం చేస్తానని కాబోలు, నాతో మాటలు మానేసింది. పిచ్చిపిల్ల ! అయినా ప్రసాద్ ! ఇన్నేళ్ళుగా నిర్ణయించుకొన్న వివాహాన్ని నాలుగురోజుల నా పరిచయంతో రద్దుచేసుకోదలచిన నీవు, ఇంకా అందమైన, సమర్ధురాలైన అమ్మాయితో ఒక గంట పరిచయం అయితే నన్ను కూడా కాదని ఆ అమ్మాయి వెంట పడవని ఏంటి నమ్మకం ? మగవాళ్ళకు కావల్సింది స్థిరచిత్తం. పేరుకు ఆడదాన్ని చంచలచిత్తమంటారు. కానీ అసలు చంచలులు మీరే ! అదీగాక ఎప్పుడూ ఎవరికీ అన్నివిధాల తగినవారు లభించరు. దొరికిన వారినే మన కనుగుణంగా మార్చుకోవాలి. అందుకు ఆ వచ్చేవారు సహకరించాలి. దేవకి అన్ని విధాల నీకు తగింది. లెక్చర్ ఇచ్చి బోరు కొట్టానా ! ఇప్పుడు నా మీద కోపంగా వున్నా, దేవకితో పెళ్ళి జరిగిం తర్వాత అంతా మరచిపోతావు. 'ఎంత పిచ్చిగా అడిగాను రాధను' అనుకొంటావు. నాకు బస్ టైమ్ అయిపోయింది. నేను బహుశా నీ పెళ్ళికి వుండనేమో ! అడ్వాన్స్‌గా నా హృదయపూర్వక శుభాకాంక్షలనందుకో, వస్తా !" అంటూ పరుగెత్తుతున్నట్లు వెళ్ళిపోయింది రాధ.

మాటలేని బొమ్మలా చూస్తూండిపోయాడు ప్రసాదు.

* * *

ప్రసాదు ఇంటికొచ్చేటప్పటికి దేవకి చేతిలో ఉత్తరం పెట్టుకొని ఆలోచిస్తూ వుంది.

"ఏమిటి దేవీ, దేన్ని గురించి అంతగా ఆలోచిస్తున్నావు ?" అడిగాడు ప్రసాదు.

మౌనంగా ప్రసాదు చేతిలో వుత్తరం వుంచింది దేవకి.

ఉత్తరం విప్పాడు ప్రసాదు

"దేవీ,

నిన్న ప్రసాద్‌తో నాలుగురోజులు ఢిల్లీ తిరిగానని చెప్పగానే నాతో మాట్లాడటం మానేశావు. నీ పరిస్థితిలో వుంటే నేను అదే చేసేదాన్నేమో ! కానీ భగవంతుని దయవల్ల అలాంటి పరిస్థితిలో నేను చిక్కుకోలేదు. నీకు కొంత నిజం చెప్పాలని ఇది రాస్తున్నాను. చేదుగా వున్నా వదలకుండా జీర్ణం చేసుకో. నేను ఎమ్. ఎ. మగాళ్ళతో కలిసి చదివాను. నాకు చాలామందితో పరిచయం వుంది. నేను అబ్బాయిలతో, అమ్మాయిలతో ఎన్నోసార్లు పార్టీలు, పిక్నిక్కులకు, టూర్లుకు వెళ్ళాను. ఎన్నో చర్చలు చేసాను. అందువల్ల కనబడ్డ ప్రతి మగాడ్నీ పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తానని అనుకోకు. అలా నీవుగానీ, అనుకుంటే అది ..పాటు దానివల్ల నష్టం నాకేం లేదు, బహుశా నీకే నష్టం సుమా ! మనశ్శాంతి పోతుంది మీ మామయ్య కూడా నాకు స్నేహితుడు. అందులో దగ్గిర దగ్గర ఇండ్లలో పెరిగాం మనం కాబట్టి చనువు నాకు. చదువు, వుద్యోగం అంటూ బయలు దేరితే మడికట్టుకొని వుంటే ఎలా ? అందుకని హద్దులు మీరినా నష్టం గూడా నాకేగదా ! ఇంతవరకు ప్రసాద్‌తో క్లోస్‌గా మాట్లాడటం తప్ప ఏ విధంగా హద్దుమీరి ప్రవర్తించలేదు నా హద్దులు నాకు తెలుసు. ఈ విషయం మీ మామయ్య ద్వారా తెలుసుకొనగలవు. అయినా చిన్నతనంనుండి 'మామయ్యే నా ప్రపంచం, అతని తలపులతో నేనేం చదువుతాను, నేనేం పాస్ అవుతాను' అనే నీవు నాలుగు రోజులు మీ మామయ్యతో మాట్లాడి, తిరగ్గానే అంత నీరసపడి, అంత అనుమానించావు నీవు నిజంగా మీ మామయ్యను ప్రేమిస్తున్నావా ? అని నా అనుమానం. బుద్ధిగా ఆతన్ని పెళ్ళి చేసుకో ఇంకా ఎంతోమంది ఆడవాళ్ళతో మీ మామయ్య మెలగాల్సి వస్తుంది. అందర్నీ పెళ్ళి చేసుకుంటూ పోతే . అర్థమైందా ? పిచ్చిగా అనుమానాలతో మనసును, ఆరోగ్యాన్ని పాడుచేసుకోకు.

నీవు, నిన్ను ప్రేమించి పెళ్ళాడే మీ మామయ్య చాలా అదృష్టవంతులు.

మీకు సుఖమైన వైవాహిక జీవితం ప్రసాదించమని ఆ దేవుని ప్రార్థిస్తూ, వుంటా.

నీ

రాధ"

ఉత్తరం పూర్తిచేసిన ప్రసాదు దేవకిని చూసాడు. దేవకి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

'మామయ్యా నిన్నా, రాధను అనుమానించిన మాట నిజమే. అందుకు నామీద నాకే అసహ్యంగా వుంది' అంది దేవకి.

'పిచ్చిదానిలా చిన్నచిన్న విషయాలు ఎందుకంత పెద్దవి చేసుకోటం ప్రేమ ముదిరితే అనుమానంగా మారుతుంది, అందుకే త్వరలో ముడిపడితే క్షేమం' అన్నాడు దేవకి చెవిపట్టి ఆడిస్తూ.

'మామయ్యా! నీవెంత మంచివాడివి. నేను నిన్ను అనుమానించానన్నా కోపించకుండా నన్ను ఓదారుస్తున్నావు. నీలాంటి భర్త దొరకటం నా అదృష్టం' అంది పరవశంగా దేవకి.

'ఇప్పడే గనక రాధ వుంటే 'ఆడది గాబట్టే దేవకి తప్పు ఒప్పుకుంది, మగబుద్ధి పోనిచ్చుకోకుండా ఏతప్పూ చేయనివాడిలా పోజులు కొడ్తున్నావా ?' అంటుంది' అనుకొన్నాడు ప్రసాదు మెల్లగా నవ్వుతూ.

'ఎందుకు మామయ్యా నవ్వుతున్నావు' అంది దేవకి.

'నీ అమాయకత్వానికి దేవీ! ఏ పురుషుడైనా కోరుకునేది అమాయకురాలైన భార్య, నా అదృష్టం కొద్దీ నీవు దొరికావు' అన్నాడు ప్రసాదు.

'నిజంగా రాధలాంటి అతి చురుకైన ఆడ వాళ్ళని, ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టగలవాళ్ళని భరించడం కష్టం' గండం గడిచినట్లు నిట్టూరుస్తూ దేవకిని లోపలకు నడిపించాడు, ఎద్వాన్సుగా పాణిగ్రహణం చేసేస్తూ.



# పచ్చి-నిజం

— బేహరా శ్యామసుందర పాత్రో

సమయం ఉదయం ఆరు గంటలు కావస్తోంది! పనిపిల్ల ఇంకా రాలేదు—ఈ కుర్రపిల్ల యెక్కడ చచ్చిందో యేమో!! అంటూ వంటింట్లోంచి వచ్చిననాంచారమ్మకు "అదిగోనే! వస్తోంది! యింతలోనే అంత హడావుడి దేనికి? పనివాళ్ళుకూడా మనుషులే కదా? రావద్దా! అసలే తల్లి—తండ్రి లేని పిల్ల. దానికి తోడు తమ్ముడు ఒకడు. వాడిని చూసుకుని, దాని పని ముగించుకొని వచ్చేసరికి ఆమాత్రంవేళవుతుంది" భూషణం గారనడం పనిపిల్ల పార్వతి రావడం ఒకేసారి జరిగింది.

"యేమే యింతఆలశ్యం—యింతవేళవరకూ పాచిపనిచేయకపోతే యెలా! ఈవేళకయింది; యిక ముందు వేగంగా రావడం నేర్చుకో" అంటూ వంటింటివైపు దారితీసి; పాత్రలు—గిన్నెలు—పళ్ళేలు— వగైరా పాచిపని పార్వతికి అప్పజెప్పి విసురుగా భర్త దగ్గర కొచ్చింది—"మీరు పనివాళ్ళని వెనుకేసుకుని రాకండని చాలాసార్లు చెప్పాను. మీధైర్యం చూసుకునే అదలా వస్తోంది" భర్తకు హెచ్చరించింది—

"చూడు నాంచారీ! మనపాప వయసు—పార్వతి వయసు యించుమించు ఒకటే కదా! మనపాప కనీసం పక్క మీదనుంచి యింకా కదలనే లేదు. కాని పార్వతి తన తమ్ముడ్ని చూసుకొని, తన ఇంటిపని చూసుకొని; కోడి కూసే వేళకే వచ్చేది. ఈ వేళ యేదో కొంత పని పడుంటుంది—కాస్త ఆలశ్యమైంది" భూషణంగారు అన్నమాటలకి; "మనపాపకి—పనిపిల్లకీ పోలిక ఏమిటండీ? చదువు సంస్కారం వున్న ఆఫీసరు బిడ్డ మనపాప కాలిగోటికి కూడా సరిపోని కూలి దానితో పోల్చుతారేం?" అన్నంతలో పాచిపని పూర్తి చేసుకొని పార్వతి వచ్చింది. "అమ్మగారూ! తమ్ముడికి సానా జోరంగా వుంది! యేమైనా డబ్బుంటే సరుదు బాటు సేయండమ్మా!" అంటూ ప్రాధేయపడుతూ అడిగింది.

"నిన్ననేకదేబట్టలేవో మీతమ్ముడికి తీయాలని 20 రూపాయలు పట్టుకెళ్ళావు. మళ్ళా

మీకు బేబి/బాబు కావాలా



ఆపరేషన్, ఇతర వైద్య చికిత్సలతో నిరాశ చెందిన సోదరీమణులు అనేకులు మా సలహాలచే సంతానవతులయి ఇచ్చిన యోగ్యతా పత్రములు గలవు. స్త్రీ పురుష సంధ్యాదోష నివారణా నిపుణులు. ఉచిత వివరము లకు:

శ్రీ నాగార్జున మూలిక కుటీరం,

రామాలయం వీధి, తెనాలి—2.

2వ లైను, కేదారేశ్వరపేట, విజయవాడ-3.



చర్మ రోగం పోకిందా?



ఉపశమనం కల్గించే లిచెన్‌సా స్కిన్ ఆయింటు మెంటు నిరపాయకరంగా, శీఘ్ర నివారణ కలిగిస్తుంది.

రుజువు చేయబడిన 6 మందులతోకూడిన నిరపాయకరమగు నాణ్యమైన మలాము అమోఘంగా పనిచేస్తుంది చర్మరోగాలకు, కోతలకు, పుండ్లకు...మరియు మొటిమ లకు, చెమటకాయలకు పొడుపుడుకాయ లకు!

చర్మరోగాలు కన్పించీ కన్పించడంతోటే నిరపాయకరమైన శీఘ్ర నివారణకు లిచెన్‌సా వెంటనే ఉపయోగించండి.

లిచెన్‌సా

స్కిన్ ఆయింటు.మెంటు

7560 TG


## పచ్చి నిజం

యింతలోనే డబ్బుఎక్కడిది అమ్మాయికేదో అర్జంటు పనుందంటేనే యివ్వలేక పోయా."

"అమ్మా – అలా అనకండి – రాతిరినుంచి; ఆడిని మూస్తుంటే; నా కడుపు చెరువయి పోతోంది– పున్నెముంటాది – యెలాగో మీ రునం తీర్సుకుంటాను" "యేం? ఒక్క సారి చెప్తే నీక్కాదు!! రోజా డబ్బులు మేమివ్వ లేం? నీ కిష్టం లేకపోతే పని మానెయ్!" అంది నాంచారి.

నిస్సహాయంగా పార్వతి నిష్క్రమించింది. వెళ్తున్న పార్వతి వంక తదేకంగా చూస్తూ భూషణంగారు అక్కడి నుంచి లేచి బైట వరండా పైనున్న వాలుకుర్చీలో కూర్చుని పాపం పార్వతి 'ఏకాకి' వెనుకా ముందు ఎవ్వరూ లేరు! ఈ కరువు రోజుల్లో మూడు పదులు జీతం యే మాత్రం! అందునా మరొక యింటికెళ్ళని పిల్ల– తల్లి దగ్గర నుంచి అలవాటు పడ్డది గనుక, ఈ ఇంట్లో పనిచేస్తోంది– రూపాయికూలి చేసుకున్నాముచ్చావల సినిమాకి; పావలా టీ కని ఖర్చుచేసుకునే ఈ రోజుల్లో; తనతో పాటు తనతమ్ముడి కడుపు నింపుతోంది. ఈ కాలం పిల్లల్లా సినిమాలు–షికార్లు... వేషాలు... లేనిపిల్ల... పాపం మనిషికి యవ్వనంలో దరిద్రం శాపం లాంటిది.

...బాల్యంలో నైతే జ్ఞానం తెలియక పోతుంది. వార్ధక్యంలో నైతే బాధ్యతలతో కలిసిపోతుంది. కాని "యవ్వనం" అన్నీ కావాలంటుంది! కాని... యేమీ అందదు.

ఋతువులలో వసంతం లాంటిదేజీవితంలో యవ్వనం. అటువంటి వయసులో మనసు విలాసాలు, వినోదాలు, సరదాలు... సందళ్ళ మీదనే వుంటుంది అసలు అటువంటివన్నీ అనుభవించవలసింది యవ్వనం లోనేకదా!

కానీ, ఆ వయసులో బాధలు... బాధ్యతలు ...కష్టాలు పడుతూ బ్రతకటం కష్టమే... కాదు ... నరకమే ... పార్వతిగురించి ఆలోచిస్తున్న భూషణం గారి వద్దకు ఆ వూరి పెద్దలు వచ్చారు– "యేమిటిలా వచ్చారు! యేమైనా ఎన్నికలు వచ్చాయా ఏమిటి?" అంటూ భూషణంగారు వారిని లోనికి తీసుకు వెళ్ళి; వారిని కూర్చుండబెట్టి తనూ కూర్చున్నారు. "యేమీ...లేదు బాబూ ...మనూరికి రామ్మందిరం లేదు కదా! అది కట్టిద్దామని...మొన్న మన పెద్ద కాపు సోమయ్యతో అంటే, ముందు మన భూషణం గారి సలహాతీసుకోండి అని అన్నారు–అందు కని ముందు తమవద్దకి కొచ్చినాం..."

"ఓహో! అలాగా! అయితేతప్పకనాసహాయ ముంటుంది మధ్యాహ్నం మూడు గంటలకి రండి! అప్పుడు మంచిది మొట్టమొదటి చందా యిస్తాను ఆప్రకారం మిగతా వారి వద్ద "వసూలుచేద్దాం!" అంటూ అందరూ లేస్తారు– భూషణం వారిని సాగనంపి యింట్లోకి వెళ్ళిపోతారు–

మధ్యాహ్నం రెండు గంటలు కావస్తోంది! వసంత గాలులు వేడిగా వీస్తున్నాయి. గదిలోంచి కిటికీతలుపులు తెరచి వీధి గుమ్మం వైపు చూసిన భూషణంకి - తన భార్యా– కూతుర్ల జాడ కన్పించలేదు మధ్యాహ్నం అయింది. భర్తభోజనం చేయలేదు, ఆయన కింత పెట్టి -తన పనిచూసుకోవాలనే జ్ఞానం భార్యకు లేదు పిల్ల సంగతీ సరేసరి! "గొడ్డు పొలంలో మేస్తే - బిడ్డ గట్టున మేస్తుందా" అన్నట్లు, తల్లి కితగ్గ కూతురు. పైగా చదువుకున్న పిల్ల–యేమంటే "నాగరి కత నీకు తెలీదంటుంది" నాగరికతంటే దానిదృష్టిలో... మొఖానికి రంగు రాసుకుని, జుత్తు ముందుకు నలుపుకొని; శరీరంలో అంగాంగాలు కన్పించే దుస్తులతో వయ్యా రంగా (జుగుప్సాకరంగా) తిరగడమేనా! పోనీ యెవరి మాటకేం? కన్న తండ్రినైన నావద్ద కూడ ఛ ...ఛ ... వెధవ నాగరికత ...నవ్వుతోంది!! దీనికంటే పనిచేసుకుని బ్రతికే పార్వతేనయం... యెంతో బాధ్యతగా తమ్ముడ్ని పెంచుతుంది. సభ్యతగా...సంస్కా రంగా, వినయ విధేయతలతో 16 అణాల తెలుగు పడుచులా వుంటుంది... అంతలో "బాబుగారూ! అమ్మగారూ!" అన్న కేక విన్పిస్తుంది. ఎవరది? అంటూ భూషణం తలుపు తీస్తాడు. ఎదురుగా పార్వతి మాసిన చీర... 1, 2 కుట్లు పడ్డ జాకెట్టు ... మాసిన తల, పాలిపోయిన ముఖం...నీర్సించిన కళ్ళతో ప్రాధేయపూర్వకంగా 'అమ్మగారు లేరా బాబూ! నా తమ్మునికి ఉదయం కంటే జొరం ఎక్కువైనాది బాబు! అందరూ మందిప్పించకపోతే బతకడంట్రను బాబు!' అని యేడుస్తోంది. 'ఆహా! భగవంతుడా అన్యం–పుణ్యం యెరుగని ఈ అబలనెందుకు శిక్షిస్తున్నావు? అసలీపిల్లపై నీకెందుకంత

డి. బోస్ ఇంగ్లీష్
స్పీకింగ్ కోర్స్
అనే పుస్తకం చదివి చక్కని ఇంగ్లీష్ మాట్లాడటం వ్రాయటం నేర్చుకొనండి
అన్ని పుస్తకముల షాపులలో దొరుకును.
పేజీలు 400 రు 22.50 వ్రాయండి:
డి. బోస్ & బ్రదర్స్
3-3-858 కాచిగుడ, హైదరాబాద్-500 027

డా॥ పి. వి. కె. రావ్, B. A.,
వైద్యవిద్వాన్, వైద్యాచార్య, సెక్స్ స్పెషలిస్ట్.

వివాహము వాయిదా వేయ నవసరము లేదు. హస్త ప్రయోగం, నరముల బలహీనత, శీఘ్రస్ఖలనములకు ఆయుర్వేద చికిత్స.
పోస్టుద్వారా చికిత్స కలదు
రావూస్ క్లినిక్,
టి. బి. రోడ్, తెనాలి.
ఫోన్ : 700, 1010.

మీ గృహాలంకరణకు కావలసిన
ఫర్నిషింగ్స్, డోర్ కర్టెన్స్
బెడ్ షీట్స్, టవల్స్
కార్ సీట్ కవర్స్
ఆకర్షణీయమైన రంగులలో అసంఖ్యాకమైన డిజైన్లలో లభించును.
PHONE: 73708
డెకార్స్
V. H. R. కాంప్లెక్స్
బీసెంట్ రోడ్
విజయవాడ-2.

భారతదేశంలో ప్రప్రథమ తయారీ
గృహిణులకు కల్పవల్లి!
గోపి
కిచన్ మిషన్


- ధరతక్కువ మన్నికెక్కువ
- 8-ఎటాచ్‌మెంట్స్ - రకరకాల వంటపదార్థాలకోసం వంటింటి వరప్రసాదం.
- అధికశక్తి. ఎంతసేపైనా పనిచేయుగల మోటారు
- బ్లేడ్లను మార్చనవసరంలేని ప్రత్యేక సౌకర్యములతో.
- శాకాహారులకు, మాంసాహారులకు విడివిడిగా ఉపయోగపడే ఏకైక మిషన్.
- తక్షణమే ఉచిత సర్వీసు చేసే గోపి సర్వీసు సెంటర్లు-ప్రత్యేకత తో.

మీ అభిమాన గోపి కిచన్ మిషన్




## పచ్చి నిజం

కష, అని మనసులోనే అనుకుంటూ, పెట్టె వద్ద కెళ్ళి డబ్బు తీసి చేత బెడుతుండగా, నాంచారమ్మ - కుమార్తె సమేతంగా వచ్చి గోడ ప్రక్క నిల్చుంటూరు. యిదుగో పార్వతీ! నీకెప్పుడు అవసరమున్నా అమ్మ గారు లేనప్పుడురా! నేనిస్తాను అనిచెప్పగా యెంతో ఆనందంతో; కారు మేఘాలునుంచి బయట పడ్డ చంద్రబింబంలా ముఖం పెట్టుకొని; 'దండాలు బాబు!' అంటూ వెను తిరిగేసరికి ...అమ్మగారూ... అమ్మాయిగారు అయినా వాళ్ళని పట్టించుకోకుండా ఆతృతగా పరుగు తీసింది పార్వతి - తన తమ్ముని బతికించు కునేందుకు-

"యేమిటే నాటకం! యెన్నాళ్ళ నుంచి జరుగుతోందీ చాటుమాటు వ్యవహారం" అన్న మాటకు ... 'నాంచారీ!' అని గర్జిస్తాడు భుజంగం! ...'ఏమండీ! అంతకోపం! వున్న మాటన్నాననేగా! "గారెలు తిన్నమ్మకి గరు కెక్కువ" "బూరెలు తిన్నమ్మకి బిరు సెక్కువ" అన్నట్లు—అంటు నాంచారి తన ప్రపంచ జ్ఞానాన్నంతా ఒలకబోస్తోంది- నీ విన్నాలు తిరిగి ... యింతవయసొచ్చి.. ఈ ప్రపంచాన్నెంతో! అర్థంచేసు కున్నాననుకున్నాను—చాలా సంతోషం నాంచారీ కట్టుకున్న భర్తనే అర్థంచేసుకోలేని నీకు యేం చెప్తే మాత్రం యేంతెలుస్తుంది. అందుకే అన్నారు పెద్దలు "ఆడది తిరిగి చెడ్డాది—మగ వాడు తిరక్క చెడ్డాడు" అని... ...

ఈ రభసంతా రామ్మందిరం చందా కని వచ్చిన నల్గురు గ్రామపెద్దలూ వింటూ; వారికి తెలిసిన పరిజ్ఞానంతో తలా ఒకటి అనుకుంటూ ముందుకు నడుస్తున్నారు - సమయంలో సంగీతంలా యిదేమ్మిటూ! శివా మనొత్తే. యిలాగ యిదేదో రంకుకేసునాగుందిరా! ... నాగుందిరా ఏంటి... రంకు కేస్రా...అదినేదు...పారువతి...అది ...అది భూషణంగారిని బుట్టవేసుకుంది .. అద్గదీ సంగతీ అనాకాకపోతే... యిన్నాలూ యెలా బతుక్కొచ్చిందిరా యిలాంటలాంటి వారు బతకనేని ఈరోజూల్లో; బైట మరేపనికెల్తాకుంటూ...తన తమ్ముడూ... అది ... యెలా నెగ్గుకొత్తది...ఆడది...వయసులో చిన్నది.. అదే ఆచ్చేరంగుండేది నాకు! ... ఆడది ... యవ్వనంలో వున్నదిగనకే బతకగలుగుతుందిరా

... ఆయింత వయసు బిగువు లేకపోతే విపడిత్నా(డా డబ్బు !! అంటు వెళ్ళిపోతారు. ఈ లోకం గుడ్డిది బతుకుకోసం ... బజారో అడుక్కోక కాయకష్టంచేసి బతుకుతున్న కన్యలెందరో ఈ సమాజంలో యిలాంటి నిందలు పడుతునే వున్నారు.... అయినా అది అనుకున్నవారి తప్పులేదు—ఆమె పేదరికంది... ఈ సమాజం పేదవారికిచ్చే బిరుదులు రెండే రెండు. ఆడది బతికితే "రంకు"ది. మగవాడు బతికితే "దొంగ" వాడు యిది అనాది నుంచీ వస్తున్న, మన సాంప్రదాయమేమో! మరి—......

పేదరికంలో ఆడదానికి అందం కూడా శాపమే! ఆవూర్లో ఆమె అందానికి అనేక మంది పెద్ద మనుషులు ఆశ్రయ మిస్తామన్నారు — పోషిస్తామన్నారు. కాని ఆమె ఎవరికీ తలొగ్గలేదు ఎవరు చూపిన ఆశకి లొంగలేదు సరిగదా లెఖ్ఖ చేయలేదు ... సంస్కారవంతురాలైన పార్వతికి తెలుసు ఈ సమాజపు మాయమాటలు. .కపట నాటకాలు ఎందరో కన్యలను పొట్టన పెట్టుకుని అవి "కుళ్లి" కంపు కొడుతున్న ఈ సమాజంలో ఎవరి పొట్టకీ అందకుండా బతుకుతుందనే అక్కసు ఆ వూర్లో యెందరికో వుంది. ఆమె పేదరికానికి తన అందం అడ్డుపెట్టుకొని బతుకుతుందని అపోహ కొందరికుంది. అందుకే ఆమె మీద అభాండం దావానలంలా ఆవూర్లో వ్యాపించింది.

కాలగర్భంలో మరో నాలుగు రోజులు కలిసిపోయాయి—ప్రపంచంలోని పాపపుణ్యాలను తనకీ చేసేందుకు ఉదయభానుడు బయల్దేరుతున్నాడు. ప్రపంచ నాటకం ప్రారంభింపబడుతున్నవేళ—ఆమని వచ్చినవేళ—అంధకారం నుంచిప్రజలు మేలుకొంటున్నారు—నాంచారమ్మ ...పని పాట్లను పార్వతి కప్పజెప్పి భర్త గారి వద్దకు వచ్చి......

యేమండీ !

ఏం ?

అమ్మాయికి యెల్లుండి నుంచి పరీక్షలంటా ! అయితే ! నన్నేం చేయమంటావు— అలాగంటారేంటి ! దానికి మంచి బట్టలు... సూట్‌కేస్... వగైరా...కావాలంట... యేం ! అమ్మాయిని బట లేవా ! సూట్‌కేస్ లేదా ! మరివన్నీ యిపుడెందుకు ? మంచివారేనండీ ! ఒక్కగానొక్క పిల్ల ... పరీక్షలకెల్తుంటే పాతగుడ్డలు పాతపెట్టెతో యేమెల్తుంది...

అవునవును...మనము పాతతల్లితం డులమే! అందుకని కొత్తవారిని చూసుకోమని చెప్పావా ! మీకిష్టంలేకపోతే మానేయండి ! కాని ! సూటిపోటి మాటలాడొద్దు...మీదృష్టిలో...పార్వతి కంటే ... చులకనా నాకూతురు ... అంటు యేమిటో ఈ మధ్య మీ ప్రవర్తన పూర్తిగా మారిపోయింది— అంటు వెళి పోతుంది. వెళుతున్న భార్యను పిలిచి ! కూర్చుండ బెట్టి "ప్రతి మనిషి తను కష్టపడి సంపాదించింది తనొక్కడి తిండికేకాదు - తనవారు ... ఇంకా ఎక్కువ సంపాదిస్తే తనతరువాత తరంవారు సుఖపడతారనే" కాని...యిలా దూబరా ఖర్చు పెడితే తరాలు వరకుకాదు, కనీసం మనతరంలోనే బతకలేనిరోజువస్తుంది. అందుకన్నానే గాని, మీ సుఖం అక్కర్లేక కాదు...

యెందుకీ సోదంతా ! కొంటేకొనండి ! లేకుంటే మానేయండి ! సంపదుందంటే సుఖపడ్డానికి గాని ; పిసినారిలా బతకడానికిగాదు. అంటూ కోపంగా అంటుంది

పిసినారితనం కాదే ! "పొదుపు"అవసరానికి తగ్గ ఖర్చు. అంతకి మించి ఖర్చు అనర్థం.

సర్లెండి! దానికనేసరికి! మీరు పెట్టరు ! యివ్వరు ! ఈ మధ్య పూర్తిగా మా మీద అభిమానం పోయింది. కన్నకూతురు, కట్టుకున్న భార్యఅక్కర్లేదు...మీకు. అవసరముంటే అమ్మగారు లేనప్పుడురా ! అని పార్వతికి చెప్పారే ! అంతకి అధ్వాన్నమా మేము అంటూ విసురుగా ...... నాకంతా అయోమయంగా వుంది. మీ ప్రవర్తన అంటూ లేవ బోయే సరికి...యిదిగో డబ్బు...జాగ్రత్తకోసం అలా అన్నానే గాని, మీ కంటే నా కెవరున్నారు. యేమేమి కావాలో కొనుక్కోమను. నాకు కొడుకైనా కూతురైనా అదే కదా ! ఇంకెవరున్నారు. అని ఆమె కోపాగ్నిపై... నీరు పోస్తాడు. కొంచెం కోపంగావున్నట్టునటిస్తూ ...అఖర్లేదులెండి ! అని బెట్టు చూపుతుంది. శుభమాఅని అమ్మాయి పరీక్షల కెల్తుందని అడిగావు—యిప్పుడు నీవలా అనడం అశుభం— అందుచేత, సంతోషంగా వెళ్లి, అమ్మాయికే మేమి కావాలో ! కొనుక్కోమను... లేదంటే అలా అమ్మాయితో నీవువెళ్ళి, షాపింగుచేసుకు రండి అంటూ బుజ్జగిస్తాడు...నాంచారమ్మ చిరుకోపంతోనే లేస్తూ యింటోకి వెళ్ళి... అమ్మా ! అని కూతుర్ని పిలిచి నాన్న డబ్బిచ్చారు ! అలా షాపింగ్ వెళ్దాం...సిద్ధంఅవు అంటూ యిద్దరూ సింగారాలలో పడతారు..

ప్రవర్తన సక్రమంగాలేని ప్రతి వక్కరూ.. యెదుటివారి ప్రవర్తనబాగుంటంలేదనుకోవడం సహజమెమో ! మరి. భర్తంటూ వున్నాడని జ్ఞానంలేకుండా ... సంఘాలు... సమాజాలు స్నేహితులు అని తిరిగే భార్య. వయసు మీదుంది కదా అన్న సిగ్గు... వినయం... విధేయతలేని కూతురు పైగా షికార్లు... బోయ్ ఫ్రెండ్స్... నైట్ ట్యూషన్స్... ... ఛ.. ఛ .. యిదంతా తన అసమర్థత. అంటూ తనకి తానే నిందించు కుంటూ వయ్యారంగా



# ఆంధ్రపత్రిక

రుధిరోద్గారి

సంవత్సరాది సంచికకు

రచయితలు/రచయిత్రులు

తమ రచనలను

**31-12-1982** తేదీలోపుగా

పంపకోరుచున్నాము.

—సంపాదకుడు





## పచ్చి నిజం

వెళ్తున్న తల్లి – కూతుళ్ళను చూస్తూ నిట్టూర్చుకుంటూ మంచంపైకెళ్తాడు–

విధి తన నిర్వహణలో యే మాత్రం జాప్యం లేకుండా కాల చక్రాన్ని కదుపుకుంటూ పోతుంది. అది సాయంకాలం పక్షులు పశువులు. తమ, తమ, గూళ్ళకు చేరుకుంటున్నాయి. సాయంతం బజారు పూర్తి చేసుకున్న ప్రజలు తమ, తమ, ఇళ్ళకు చేరుకుంటున్నారు....

"చీకటి తన కబంధ హస్తాలలో వెలుగుని యిరికించుకొంటోంది" చీకటంటే ప్రతివారు అసహ్యించుకుంటారు... కాని. ఆ చీకటే తనలో యెన్నోచేదు నిజాల్ని దాస్తుంది. "యెందరి పవిత్రతనో కాపాడుతుంది" "యింకెందరికో విశాంతి నిస్తోంది."

"ఎందరి కామక్రోధాలనో వెలుగు పడనివ్వకుండా రక్షిస్తుంది"

సమయం రాత్రి 9-30 గంటలు కావస్తోంది. సినిమాకెళ్ళిన భార్య, ట్యూషన్‌కి వెళ్ళిన కూతురు యింకా రాలేదు. భూషణం వరండాపై పచార్లుచేస్తూ, వక్కసారి, ఆగి వరే సూరయ్యా! చీకటిగావుంది, అమ్మాయిగార్ని తీసుకొచ్చేందుకు వెళ్తాను– ఇల్లు జాగ్రత్తగా చూడు అంటు భూషణం బయల్దేరతాడు–తమున్న వీధి మలుపు తిరిగి రెండవ వీధిలోకి వెళ్తాడు. అంతా చీకటిగా వుంది. యేమీ కన్పించుటలేదు – అంతలోనే ఆ వీధి గుండా పార్వతి వస్తూ భూషణాన్ని పోల్చి, బాబుగారూ! ఏందిలా వచ్చారు! అని అడుగుతుంది. చీకటిగా వుందికదా! అమ్మాయిని తీసుకెళ్దామని వచ్చాను—ఆ ప్రయివేటు మాష్టరు ఇల్లు నీకు తెల్సా? అని అడుగగా పదండి బాబు చూపుతానని తీసుకెళ్తుంది – నీవెక్కడికెళ్ళావు పార్వతీ! అని అడుగగా మందుకెళ్లాను బాబు! కొంచెం తగ్గిందా! అని భూషణం అడుగగా! యేటో! తగ్గుతుంది! మల్లా ఎచ్చుతుంది. అని చెప్తూ! యిదేని బాబు మేట్సారి యిల్లు! వుండండి పిలుస్తానని; తలుపు వేసివుంటే; కిటికీ తలుపు తోస్తుంది! తలుపు తెరుచుకుంది... పార్వతి రెండు చేతులతో ముఖం కప్పుకుంది...ఏమిటి! అని భూషణం వెనుకనేవచ్చి, కిటికీలోంచి చూస్తాడు – యేముంది! తన పరువు – ప్రతిష్ఠ మంట

కలుపుతూంది తన కూతురు. సుమారు 45 సం. వయస్సు, బట్టతల, నరాలు కన్పిస్తున్న చర్మం, వంటినిండా రోమాలుతో వున్న ఆ మాష్టారుతో సరసల్లాపాలాడుతుంది. భూషణం ముఖం జేవురించింది. కళ్లు ఎర్రబడ్డాయి,చేతులు బిగుసుకున్నాయి, గుండెవేగం హెచ్చింది. మనిషి నిలువునా వణికిపోతున్నారు. కంటంట నీరు ధారగా కారుతుంది. స్థాణువై గోడకి చేరబడ్డ భూషణాన్ని యింకొక్క క్షణం యిక్కడుంటే పరిస్థితి వేరుగా వుంటుందని, అయ్యగారు! రండి! అని అతని చేయి పట్టుకొని, లాగి... తనతో...అక్కడికి మూడో యిల్లనే తన గుడిసెవద్ద మంచం వేసి కూర్చుండబెట్టింది. భూషణం మతి పోతూంది! కాని! యిప్పుడేంచేసినా తన పరువు–మర్యాద మంటకలుస్తుంది. అందుకే అలా నిగ్రహించుకొంటున్నాడు.

యింతలో భార్య నాంచారమ్మ ఆ దారంట వస్తూ, తన భర్త పార్వతి గుడిసెవద్ద వుండడం గమనించి, నలుగుర్నీ కూడగట్టుకొని,గుడిసెవైపు వస్తూంది.అదేసమయంలో పార్వతి రెండు చేతులు పట్టుకొని, యివి చేతులుకావు కాలనుకో! ఈ సంగతి యింకెక్కడా చెప్పకు! అని బ్రతిమాలుతుంటాడు భూషణం. నాంచారి నలుగురికీ చెప్పిన మాటకి భూషణం, పార్వతికి అతి దగ్గరగా వుండి చేతులు పట్టుకుంటుండం, అంతా ఆమె అనుమానాన్ని అంగీకరించారు. అలా దగ్గరకొచ్చి భర్తని నిలదీసి, యిన్నాళ్లు మీరాడుతున్న నాటకం యిదన్నమాట దీనితో కులకటానికేనా యిటు వచ్చారు అన్న నాంచారమ్మ చెంప ఛెళ్ మంది...చూడండి బాబూ! యేమి న్యాయమిది — దరిద్రపు ముండా! బ్రతకలేకపోతే; అడుక్కొని బ్రతుకే! గాని, నా బ్రతుకుతో ఆడుకుంటావా! నీకు తండ్రి లాంటి వారితో నీకు సరసాలా? అంటూ పార్వతిని పట్టి దూస్తుంది.

అమ్మగోరూ. యిది నాయం కాదు! అయ్యగోరు, నాకు దైవంతో సమానము; మీ పాదాల సాక్షిగా చెపుతున్నా, అని నాంచారి పాదాలు పట్టుకున్న పార్వతిని, కాలితో తంతూంది నాంచారి. ఆ తాపుతో కొద్ది దూరంవెళ్లి పడుతుంది పార్వతి.

రంకునేర్చింది. బొంకునేర్చిందట...వెధవ బ్రతుకు ఎన్నాళ్లు బ్రతుకుతావే ... వయసు పొంక ఎక్కువైతే ఎవర్నో కట్టుకోరాదూ! ఎవరి బ్రతుకులు తీస్తావే! లంజా! అని నలుగురూ నానా మాటలాడి, మా బోటి సంసార్ల వీధిలో నీ లాంటి వ్యభిచారి వుండరాదు. తక్షణం మా యిల్లు ఖాళీ చేసి వెళ్లిపో! అంటూ పార్వతిని గెంటబోయేసరికి ... ఆగండి ... నా వంటిమీద చెయ్యివేస్తే బాగుండదు ... మీరు వెళ్లనక్కర్లేదు. యిటువంటి రాక్షసులున్న వూర్లో నేనే వుండను. అంటూ గుండె చెరువైనట్లు విలపిస్తూ గుడిసెలోకి పోతుంది.

నాంచారమ్మ.. ముందు వెళ్తుండగా..వెనుక భూషణం ఒక్కొక్క అడుగువేస్తూ! తను వేసే ప్రతి అడుగునూ తను నైతికంగా క్రిందికి దిగిపోతున్నట్లు బాధపడుతూ యింటి ముఖం పడతాడు.

ఇంట్లో అడుగు పెట్టేసరికి, యెదురుగా సోఫాలో తన అందాల కూతురు, యెంతో వినయంగా చదువుకుంటోంది ... పాప పరీక్షలుకి యెల్లుండి వెళ్తావమ్మా! మాష్టారు ట్యూషను బాగా చెప్తున్నారా! అని మండే హృదయాని అదుపులో తెచ్చుకొని అడుగుతుంటే. "మీ పాపిష్టి కల్లు దాని మీద పడనీయకండి; మీ నీడ పడితే, పాప బ్రతుకు కూడ కళంకమైపోతుంది" అని భార్య పుత్రికా రత్నం ప్రక్కకి వచ్చి అంటుంది.

"నిజమే! తన నీడ పడితే కళంకమొస్తుంది. కళంకం లేనివాళ్ళకి కాని...తన కూతురు కళంకంతోనే పుట్టింది. యింకా దానికి అంటేదేమిటి? మచ్చలేని దానిపై మచ్చపడితే కన్పిస్తుంది కాని పూర్తిగా మచ్చలున్నవారికి, మరొక మచ్చపడితే కన్పిస్తుందా! యేమైనా యిది సమయం కాదు... తరువాత...నాంచారికి చెప్తాను, లేకుంటే తన కూతురుని వెనకేసుకొని యింకాస్త బజారు పెడుతుంది. అందుకే అన్నారు ఆడ పెద్దరికం యెక్కడ పనికి రాదని, స్త్రీబుద్ధి ప్రళయాంతకం అన్నట్లు.. యెంతో గొప్పపనిచేసి యేమీ యెరుగనట్లున్న కన్నకూతుర్ని చూసి.. మరామొఖం చూడలేక వెళిపోతాడు.

"అసలీ ప్రపంచం పేదవారిని బ్రతకనీయదు" కాని యేదో ఒక బంధంతో భగవంతుడు చావనీయుడు" లేకుంటే తనవెధవ బ్రతుక్కి తోడు ఈ తమ్ముడెందుకు? వీడే లేకుంటే ఈ గ్రామంనుంచే కాదు! ఈ లోకం నుంచే వెళిపోయేదాన్ని కాకుంటే ఈలోకాన్నికాళికనై కబళించేదాన్ని! కాని యేంలాభం? ఇందుకే అవ్యర్థ ఆలోచనలు.. యేమయినా ఈ వూరు విడిచి పెట్టాలనిధృఢనిశ్చయానికొచ్చిచాపపై తమ్ముడి ప్రక్క చేరబడుతుంది.

అర్ధరాత్రి తలుపు చప్పుడైంది. పార్వతికేదో భయంవేసింది. భయానకహృదయంతో ఏవరది? అని ప్రశ్నించింది :

నేనమ్మా! భూషణాన్ని! తలుపుతీయ్! బాబూ! తవరా! ఇంత అరదరాత్రి యెందుకొచ్చా బాబూ? రాకుండా! యెలా వుండ



గలను పార్వతీ ! నీకు జరిగిన అన్యాయం నన్ను నిద్ర పట్టనీయలేదు .. అసలీ ప్రపంచంలో భగవంతుడు వున్నాడా వుంటే ; యింత అన్యాయం జరిగినప్పుడు యిది అన్యాయమని చెప్పడేం.. హుఁ మన భ్రమ నిజమెప్పుడూ సాక్ష్యానికిరాలేదు—సాక్ష్యమెప్పుడూ నిజంచెప్ప లేదు .. చూడమ్మా ! నన్ను అసహ్యించు కోనంటే ఒక నిజం చెప్తాను " ఏమిటది బాబూ... మీ ఉప్పుతిని బతికినోలం... మీకు అసహించుకోడమా !

కాదమ్మా ! ఒక్కొక్కొసారి "నిజం" కంటే అబద్ధమే తీయగుంటుంది. ఆ అబద్ధం తోనే, యిన్నాళ్ళు బ్రతికాను. కాని.. ఎప్పటి కైనా .. నిజం నిజమేకదా ? "నిజమంటే" నిప్పుతో సమానమమ్మా ఆ నిజమనే నిప్పు నా హృదయాన్ని దహించేస్తుంది.. అందుకే ఆ నిజం నీతో చెప్పేందుకు వచ్చాను.

ఏమిటి బాబూ ఆ నిజం !

చెప్తానమ్మా! చెప్తాను.. అది నేను యవ్వనంలో వున్నరోజులు అంటే 25 సంవత్సరములుండవచ్చు.. మీ అమ్మ మా ఇంట్లో పనిచేస్తుండేది....మీ అమ్మ...ఎంతో అందంగా వుండేది. మీ అమ్మ అందానికి నేను మోహితుడునయ్యాను.. వీలున్నప్పుడల్లా ఆమెను రెచ్చగుడుతుండేవాడిని .. కాని ఆమె తప్పుబాబు అనేది.. యెంతైనా వయసులో వుంది కదా... ఒకరోజు జోరుగా వర్షం పడుతుంది. యింట్లో ఎవ్వరు లేరు.. మీ

## పచ్చి నిజం

అమ్మ పనిచేసుకుంటుంది. నేను దగ్గరికి వెళ్ళాను. ఎన్నోమాయమాటలాడాను.. ఎంతో ఒప్పించాను.. కాని ఆమె ఒప్పుకోలేదు. ప్రాధేయపడ్డాను.. అంగీకరించలేదు.

ఇంట ఎవరూ లేకపోవడం... మా యిద్దరమే వుండడంచేత నేను బలాత్కారంగా మీ అమ్మను వశపరుచుకున్నాను. అవకాశం మనిషిలో బలహీనత రెచ్చగొడ్తుందమ్మా అంటూ యేడుస్తూ దగులకొని తూలిన భూషణాన్ని చాపపై కూర్చుండ బెడుతుంది.

ఆ తరువాత !

ఏముందమ్మా ! నరమాంసం తిన్న పులి.. ఆడదాన్ని మరిగిన మగవాడు మరలా వాటిని విడువడమ్మా ! అలా నరమాంసం తిన్న మృగాన్ని నేను. యిలా కొన్నాళ్ళు సాగింది.. యింతలో మానాన్నగారు అర్జంటుగా మా మేనమామ గారింటికి పంపించారు యేమిటో గదా... అర్జంటుగా వచ్చేస్తానను కున్నాను... కాని వచ్చేసరికి రెండు నెలలయింది తిరిగి వచ్చేసరికి .. మీ అమ్మకి మా పాలేరు రామయ్యతో వివాహం జరిగిపోయింది... ఒక రోజు ఎవరూ లేనప్పుడు మీ అమ్మని అడిగాను ఏమిటి ? ఎందుకింత తొందరగా వివాహం జరిగింది. అందునా మా నాన్నగారు ఖర్చుతో జరిపారట కదా ! అని.. అప్పుడు మీ అమ్మ యేడ్చుతూ నేనోరోజు వాంతి చేసాను....ఆ




డోకులు అలా వస్తూండడం మీ అమ్మగారికి అనుమానమొచ్చి, నన్ను గట్టిగా నిలదీసారు. నేను నిజం చెప్పాను అంతే. ఆ తరువాత మీరెళ్ళిపోవడం నాకు వివాహం జరగడం జరిగి పోయిందని – అంతే ! ఆ బిడ్డ నేనమ్మా ! ఆ బిడ్డవే. ఆ తరువాత రామయ్యకి పుట్టిన వాడు వీడు. అందుకేనమ్మా నీ వంటే జాలి, అభిమానం కాని యేం చేయగలను. స్వార్థపరుడ్ని...నా బిడ్డ నా యెదుటే హింస అనుభవిస్తుంటే, చూస్తూ నా బిడ్డని ఆదుకోలేని దౌర్భాగ్యుడ్ని, నా బిడ్డకి, నాతోనే రంకు కట్టునప్పుడు, నా బిడ్డతో నాకేమిటని చెప్పలేని పిచుడ్ని తల్లీ. నిజంగా నీ వంటి కూతుర్ని, కూతురుగా గర్వంగా చెప్పుకోవాలి తల్లీ ! కాని...కాని ... చెప్పలేను. చెప్పలేను తల్లీ, అని హృదయ విదారకంగా విలపిస్తూ అమ్మా పార్వతీ, నీ వెంత ఔదార్యవంతు రాలవమ్మా ! ఆ రోజు యే పాపం తెలియని నిన్ను, నాంచారి, రంకుది అన్నప్పుడు... అన్నీ తెలిసిన నీవు నీ కూతురు రంకుది.. అని అనలేదు – యిది చాలమ్మా నీ గొప్ప మనస్తత్వానికి .. నీవు సాకుతు మీ తల్లి గుణాలతో పుట్టావు తల్లీ, నా కూతురు సాక్షాత్తు నా బుద్ధులతో పుట్టించాడా భగవంతుడు – ఆ నాడు చేసిన పాపానికి యీ నాడు యీ శిక్ష నాకు చాలమ్మా! బ్రతికివుండి క్షణం క్షణం చస్తూనేవున్నాను. యింతకన్నా మరణమే మేలమ్మా ! అంటూ రోదించిన భూషణాన్ని యీ నిజం యిదివరలో చెప్తే యీ మచ్చ వచ్చేది కాదు కదా బాబు ! అన్న పార్వతి మాటలకి, యీ నిజం బైట పెట్టవద్దు తల్లీ ! నా బ్రతుకు నలుగురిలో నవ్వులపాలవుతాది. పైగా నీకు కూడ రంకుదాని కడుపున రంకుంది పుట్టిందిరా అంటుందిలోకం ... యేమైనా యీ నిజాన్ని మాత్రం బైట పెడితే నీకు కన్పించేది, నేను కాదమ్మా ! నా శవం ... అంటూ ఆమె వద్దనుంచి లేస్తాడు. లేస్తూ కొంత డబ్బుని ఆమెచేత బెడుతూ యిదిగో నమ్మా యీ డబ్బుతో యెక్కడికైనా వెళ్ళిపోయి బ్రతకండని యివ్వబోగా ! ...

ఆ నాటి మా అమ్మను పెడగొట్టినందు కిత్తన్నా యీ డబ్బు ! యీనాడు నా మూల కంగా అపకీరితి వత్తాదేమో ! నని, నాకు యెళ్ళగొట్టడాని కిత్తన్నా యీ డబ్బు ఛీ! ఛీ! నా కొద్దు బాబూ నా కొద్దు








బులుసు వేంకటరమణయ్య

# పండుగలు - పర్వాలు

ప్రపంచం అంతటా అన్నికులాల వారు పండుగలను జరుపుకుంటున్నారు. మనకు సంవత్సరం పొడుగునా పండుగులూ, పర్వాలూ వస్తూనే ఉంటాయి. ఉగాది, శ్రీరామనవమి, శ్రావణపౌర్ణమి, జన్మాష్టమి, వినాయక చతుర్థి, ఆయుధపూజ, విజయదశమి, దీపావళి, పెద్దపండుగ మున్నగువాటిని హిందువులు పాటిస్తే ముస్లింలు మొహరం, రంజాన్, బక్రీద్ మున్నగువాటినీ, క్రైస్తవులు క్రిస్ట్మస్, ఈస్టర్ మొదలైనవాటిని జరుపు కుంటారు.

పండుగులకు ముందే ప్రయత్నాలు జరుగు తాయి. నాడు అందరూ స్నానాలుచేసి పరిశుద్ధులై వీలగునంతలో మంచి దుస్తులను ధరించి, ఇష్టమైన వంటకాలతో భోజనం చేసి, సంతోషంగా ఉండడానికి ప్రయత్నిస్తారు. పర్వాల దినాలలో వారివారి దైవ మందిరాలకు వెళ్లి పూజలు, ప్రార్ధనలుచేసి తృప్తిపడతారు.

పయి పద్ధతులనుబట్టి చూస్తే ఐహికమైన సంతోషానికే కాకుండా పారలౌకికమైన ఆనందానికి కూడా కాంక్షాలని చెప్పాలి. ఈ ఆశయంతోనే ఇవి ఏర్పడి వున్నాయి.

భగవంతుడు కాలస్వరూపుడని మన పురాణాలు చెపూతున్నవి. అందువల్ల కాలాన్ననుసరించి వచ్చిన సంక్రమణ పర్వాలు, జన్మదినోత్సవములు ముఖ్యములైనాయి. శ్రీరామనవమి నాడు, అతనినిపూజించి, ఆ మహనీయుని ధైర్యసాహసాలనూ, ఉత్తమశీలాన్నీ, ధర్మగుణాన్నీ గ్రహించి, వాటిని అలవరచుకొనుటకు ప్రయత్నించాలి అలాగే శ్రీకృష్ణాష్టమినాడు శ్రీకృష్ణుని పూజించి అతని మాహాత్మ్యన్ని అవగాహన చేసుకోవాలి ఆ భగవానుడు భగవద్గీతలో ఉపదేశించిన విషయాలను గ్రహించి, ఆ విధంగా నడుచుకొనుటకు సర్వవిధాలా యత్నించాలి. ఇతర పర్వాలలో వాని ప్రయోజనాన్ని గుర్తించి ఆయా దేవతలను పూజించాలి ఈ రీలిగా వీటివల్ల ఐహికంగానూ, ఆముష్మికంగానూ పయోజనం ఉంది. మనస్సు సంతోషంగా ఉన్నప్పుడే ఆధ్యాత్మిక విషయాలు అవగాహన కాగలవు. ◉



యీ డబ్బు. యీ పాపిష్టి డబ్బు ముట్టుకుంటే, మాకూ పాపపు బుద్ధులొత్తాయి బాబూ! మీ కవమానం మేత్తాదనే! నన్నెలిపోమంత్రనుగాని నా కొచ్చింది అవమానం కాదా! కాని మిమ్మల్ని యెలిపోమనలేను. ఎందుకంటే. మీరు గొప్పోళ్లు. నేను కూటికి లేనిదాన్ని.. అంతేకద బాబూ.. కూటికి లేకపోయినా గుణం లేనోళ్లంకాదు బాబూ... మీ కూతురిలా కొవ్వెక్కి... కానిపను లేవీ సేయలేదు బాబూ.. కాని పనులు సేసిన కూతురిని కమ్మగా... పెల్లి సేసి ..పతివ్రతగా రేపు పంపిత్తారు. కాని...పాపం... పుణ్యం... యెరుగని నేను పతితగా యెళిపోవాలి! యేం బాబూ! అలా మొఖమెట్టారూ! యిదిగో! భూషణం బాబూ! పైసా లేకపోయినా. పేదవాలెప్పుడూ పడుపు వృత్తికి దిగరు బాబూ! పోతే! మీ నాటి మధాంధుల బలత్కారాలకి నొంగితే చెప్పలేను గాని, మనస్పూర్తిగా ఆ పని చేయరు బాబూ! కాని... ధన మదంతో, ఒళ్లు కొవ్వెక్కి, కామాంధకారంలో కల్లు కప్పబడి...తల్లి... తండ్రి...అన్నా. . పెల్లి...గురువు ..దైవం... చిన్నా పెద్దా భేధం లేకుండా మీరే అలాంటి పనులు సేత్తారు. యిది నగన సత్యం, చేదునిజం. యిదుగో బాబూ! నా మూలకంగా మీ కెప్పుడూ అమరియాద రాదు కాని మీ కుటుంబం మూలకంగా రాకుండా చూసుకోండి యెల్లండి బాబూ! యెల్లండి. యిక్కడొక్క ఛణం వుండొద్దు. నెనిలాటి పూర్వో వుండమన్నా వుండను. యేదో మీరు సెప్పినట్టు కన్నతం డంతను... కాని మీరామాట యెక్కడా అనకంటి. పరువు మర్యాదగల పాలేరు రామయ్య కూతుర్నే నేను - మీకూతుర్నని చెప్పెంత పిస్సమాలిన దానని కాను బాబూ! యెల్లండి! అని బలవంతంగా ఆయన్ని బయటకి పంపించేస్తుంది.

అవును.. నిజమే నా లాంటి కామాంధుడి కూతురని చెప్పకోవడం నీకూ సిగ్గే నమ్మా అని కుమిపోతూ... నైతికంగా పతనమైపోతున్న తన పరువు - మర్యాదనే, ... బంగళా వైపు వెళ్లిపోతున్నాడు భూషణం.

తూర్పున కర కర మని పొద్దు పొడుస్తూంది. గుడిసెలో పార్వతి కు రాదు లేరు. పార్వతిలేదు. వెళిపోయింది యెక్కడికో! యేమో...ప్రజల ముచ్చట్లు... వెళ్లిపోయింది ...పార్వతి నిజం పగటి వెలుగు చూడకుండా వెళిపోయింది వెలుగుని చూడలేని నిజం యెక్కడో గాఢాంధకారంలో దాక్కునేందుకు వెళిపోయింది. పచ్చినిజం ..పగతిని చూడదేమో! మరి!! ◉

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**బాలల ఇంద్రజాలం :**

మనం పసిపిల్లలను బూచీబూచీ! అంటూ భయపెడుతుంటాం. హాష్‌కాకీ! అంటూ మభ్యపెడుతుంటాము. వాతాపి జీర్ణం !— అంటూ పొట్ట నిమిరి మాయ చేస్తుంటాము. ఇవన్నీ మనకూ, వారికీ తెలీకుండానే వారిలో మూఢ విశ్వాసాలకు నార్లుపోస్తాయి. పరిసరాలనుబట్టి, పెంపకాన్నిబట్టీ ఈ మూఢ విశ్వాసాలువారిలో బలపడవచ్చు. బలపడక పోనూవచ్చు. బాలబాలికలు మూఢ విశ్వాసాలలోనూ, పులిగిలుల అపోహల లోను కొట్టుకొనిపోకుండాచేసి, వారిమనస్సు నిశ్చలంగాను, వివేకవంతంగాను ఎదిగి హృదయం వికసించడానికి ఏమిటిదోవ— అని ఆలోచించారు బాలల అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారు. అరవై సంవత్సరాలుగా బాలబాలికల మనసెరిగిన పెద్దలు. బాలలకు చిన్ననాటి నుంచే ఇంద్రజాలం వంటివి నేర్పిస్తే, వారికీ, ఇతరులకూ వినోదం, అనవసరమైన అపోహలూ, అనుమానాలు పటాపంచలై విజ్ఞానం కూడ విస్తరిస్తుంది— అన్న భావం కలిగింది. ఎంతో రహస్యమని, మంత్ర తంత్రాలతో కొనసాగుతున్నదని భావింపజేస్తూ గోప్యంగాతమవృత్తిని భద్రపరచుకుంటున్న ఇంద్రజాలికులు, పిల్లలకు తమ రహస్యాలు చెప్పి రచ్చకెక్కుతారా ? అలా చేస్తే వారి పరువేమి కాను ? మరి ఎలా ? ఆ సమయంలో ముందుకు వచ్చారు ప్రొఫెసర్ భావరాజు వెంకటపట్టాభిరాం. చిల్లిగవ్వ తీసుకోకుండా, తన బృందం ఖర్చులు కూడా తానే భరిస్తూ ఇంద్రజాల ప్రదర్శనలు ఇస్తూ, ఇంద్రజాలిక సంప్రదాయాలకు భంగం కాకుండా ప్రవర్తిస్తున్న అభ్యుదయ పదగామి ప్రొఫెసర్ పట్టాభిరాం. ఇకనేం ! నారాయణ గూడలోని ఆంధ్ర బాలానంద సంఘంలో ఇంద్రజాల పాటశాల (మ్యాజిక్ స్కూలు) బాలబాలికల కోసం 1982 ఫిబ్రవరి 10వ తేదీనవెలసింది. శ్రీమతి ఎం. ఎస్. విజయలక్ష్మీదేవి ఈ పాటశాల ప్రారంభోత్సవం జరిపారు. శ్రీమతి జె. జమున రమణారావు పిల్లలను ఆశీర్వదించారు. ప్రొఫెసర్ పట్టాభిరాం. ఈ ఇంద్రజాల పాటశాలకు డైరెక్టరు. భారత్‌మేజిక్ స్కూల్ సభ్యులు ప్రొఫెసర్ సి. వి. రమణ, బాలానంద సంఘం మాజీ సభ్యుడు ఇంద్రజాలికుడు శ్రీ ఎస్. వి. అశోక్ పట్టాభిరాంకు సహాయకులయ్యారు. శ్రీ పి. సూరిబాబు ఈ పాటశాల నిర్వాహకులు. ఈయన బాలానందం సంయుక్త కార్యదర్శి కూడా. ఆగ్నేయాసియాలోనే ఇది తొలి ఇంద్రజాల పాటశాల. వందల కొలది పిల్లలు ఎగబడ్డారు ఇంద్రజాలం నేర్చుకోడానికి. కాని, 65 మందికే ప్రవేశం పరిమితం చేశారు. శిక్షణ కాలం ఆరు నెలలు. ప్రవేశానికి వయః పరిమితి 15 సంవత్సరాలు. ఆర నెలల శిక్షణ కాలంలోను 75 కైతవ ప్రయోగాల (ట్రిక్స్) నేర్పారు. స్థానిక ఇంద్రజాలికులు ప్రొఫెసర్ రాజు, ప్రొఫెసర్ బి. సుబ్రహ్మణ్యం, ప్రొఫెసర్ ప్రకాశరావు, ప్రొఫెసర్ డాక్టర్ సుల్తాన్ మొహిద్దీన్ ఈ పాటశాలకు అప్పుడప్పుడు వచ్చి పిల్లలకు కొన్ని మాయా ప్రయోగాలు నేర్పారు. శిక్షణ సమయంలో ప్రతి విద్యార్థి రహస్య గోపన శపథం తీసుకోవాలి. వార తప్పక తమవద్ద ఇంద్రజాలదండం ఉంచుకోవాలి. వారిపోటోలు అతికించిన గుర్తింపుకార్డు వారికిస్తారు. వారికి శిక్షణ పొందినట్టు యోగ్యతా పత్రం ఇస్తారు. యోగ్యతా పత్రం పొందినవారు తమపేర్ల చివర ఎం. బి. ఎం. ఎస్. (మెంబర్ ఆఫ్ బాలానందం మాజిక్ స్కూల్) అనే పట్టా వ్రాసుకోవచ్చు. బాలానంద సంఘం మాజీ సభ్యురాండ్రు శ్రీమతి జె. వి కామేశ్వరి (మద్రాసు) శ్రీమతి బి. వి. లక్ష్మీ ప్రసాద్ రేడియో అక్కయ్య శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మ పేర ఉత్తమ బాల ఇంద్రజాలికునికి రోలింగ్‌సీల్డ్ ఏర్పాటు చేశారు. భారత్ మ్యాజిక్ సర్కిల్స్ నిర్వాహకులు ఉత్తమ ప్రదర్శనకు రెండు పతకాలు ఏర్పాటు చేశారు. మరునటి శిక్షణ తరగతులు నవంబరు 14 నుంచి ప్రారంభమవుతాయి. ఈ పాటశాల తొలి జట్టు స్నాతకోత్సవం సెప్టెంబరు 28వ తేదీ సాయంకాలం త్యాగరాజగాన సభలో వైభవోపేతంగా జరిగింది. ముఖ్య అతిధి, రాష్ట్ర ఎక్సైజు మంత్రి శ్రీ ఇందుకూరి రామకృష్ణంరాజు, సాంస్కృతికశాఖ డైరెక్టర్ శ్రీ జె వి. సోమయాజులు, దూరదర్శన్ డైరెక్టరు శ్రీ ఎల్. పి. విటల్ బాల ఇంద్రజాలకులను ఆశీర్వదించారు. నేనుచాలపొడుగ్గా ఉన్నాను. పొట్టిగా కావాలని వుంది. దానికేమయినా మ్యాజిక్ వుంటే బాగుండును. అని శ్రీ రామకృష్ణంరాజు చలోక్తి విసిరారు. పిల్లల విజ్ఞాన వ్యాప్తి బాల విజ్ఞాన సర్వస్వం ప్రకటిస్తున్నామని ఆయన అంటూ బాలేంద్ర జాలికులను ఆశీర్వదించారు. ప్రొఫెసర్ పట్టాభిరాం వ్యాఖ్యానిస్తుండగా, 27 మంది బాలబాలికలు కైతవ ప్రయోగాలు చేశారు. (1) కె. ప్రసూన—తెంపినతాడును అతకడం (2) ఆర్. ప్రదీప్—పలకమీద గ్లాసులు తలకిందులుచేసి పడకుండా చేయడం. (3) దేవరాజు వెంకటబాలకృష్ణ—దస్తీలు విడిగా గొట్టం లోవేసి ముడివేసినవి తీయడం. (4) ఎస్. కవిత—రంగుల మార్పు, కార్డు మాజిక్ (5) రాంభట్ల ఆర్మేన్‌కుమార్— పేకను ధారగా కలిపినట్లు చూపడం, తాడుకు కర్చీఫ్‌లు కట్టి విడదీయడం. (6) రఘురాం— న్యూస్ పేపరు చింపి, పూర్తిగా చూపడం. (7) మాధవీలత— పొట్టి పొడుగుల మాయ. (8) కె.సూర్యకుమారి— పూలమొక్కలు మొలిపించడం. (9) భాస్కర్ — పానీయాలు తెప్పించడం. (10) రమేశ్— పానీయాల రంగుల



సెప్టెంబర్ 28 న త్యాగరాజ గానసభలో ఆంధ్ర బాలనందం మ్యాజిక్ స్కూలు విద్యార్థినులు చిరంజీవులు హేమలత, హేమమాలిని తలపై మంట పెట్టి కాఫీ కాస్తున్న దృశ్యం.

మార్పు (11) ఎస్. బి ఆనంద్—ఖాళీ గ్లాసులో పానీయాలు. (12) ఎం ఎస్. వసంతకుమార్—మాజిక్ కర్ర నుంచి పూలగుత్తులు. (13) అనిల్ కుమార్ — అరటిపండు నుంచి ఉంగరం తీయడం (14) సుమలత— అంకెలగారడీ (15) శ్రీనివాస్ పలకపై బోర్లించిన గ్లాసులు పడకుండా చేయడం. (16) నాగేష్— కాగితంలో పాలు పోసి మాయం చేయడం (17) రాధిక— సంచిలో విడి రిబ్బన్లు వేసి ముడితో తెప్పించడం (18) ఎం శ్రీనివాస్—దండలు విడదీయడం (19) నాగార్జునకుమార్ పేక నుంచి ధాన్యం (20) సుదీర్ బాబు—బెలూన్‌ను సూదితో గుచ్చి గాలి పోకుండా చేయడం (21) హేమలత, హేమమాలిని— బకెట్‌లో నీళ్ళుచల్లి పూలు తెప్పించడం, తలపై మంట పెట్టి కాఫీ కాచడం (22) భరణి,పద్మావతి— కళ్ళకు గంతలు కట్టి నంబర్లు కొట్టి వేయడం, గ్లాసులలో గడియారం తెలుపడం. (23) ప్రశాంతి (నాలుగేళ్ల పాప)—బల్ల మధ్య నుంచి చాక్‌లెట్లు, పళ్లు తీయడం (24) ప్రశాంత్ —దండనుతెప్పించడం. కె రవి— జపాన్ విసనకర్రతో మాయ ప్రదర్శ నానంతరం మంత్రి శ్రీ రామకృష్ణంరాజు పిల్లలకు యోగ్యతా పత్రాలు, ఉత్తమ ఐంద్రజాలికురాలు కుమారి కవితకు రోలింగ్ షీల్డ్, ఆర్ ప్రదీప్‌కు, కె సూర్యకుమారికి భారత్ మేజిక్ స్కూల్ పతకాలు అందజేశారు. ప్రారంభంలో బాలానంద సంఘం ఉపాధ్యక్షులు శ్రీ ఎన్ ఆర్ టాగోర్ స్వాగతం పలుకగా, శ్రీమతిలక్ష్మీప్రసాద్ ఇంద్రజాల పాటశాల వివరాలిచ్చారు పాటశాల కన్వీనర్ శ్రీ పి సూరిబాబు తర్వాతి తరగతులనుగురించి ప్రకటించారు.

ఇంద్రజాలం తర్వాత 'శూర్పణక్' నృత్యనాటిక ప్రదర్శనం జరిగింది. బాలానందం నాట్య ఉపాధ్యాయిని కుమారి డి సుశీలదర్శకత్వంలో బాలానందం బాలికలు ఈ ప్రదర్శనం చక్కగాచేశారు బాలానంద సంయుక్త కార్యదర్శిని శ్రీమతి జె. జయశ్రీసారధి వందన సమర్పణ చేశారు. కుంభవృష్టి కురిసినా హాలు కిటకిటలాడింది ఇంతటివానలోనువాయిదా వేయకుండా వచ్చిన మంత్రి శ్రీ రామకృష్ణంరాజు సహృదయతను, సమయపాలనను ప్రేక్షకులు ప్రశంసించారు పసిపిల్లలను వందల మంది ప్రేక్షకులకు వినోద విజ్ఞానాలు కలిగించే గడసరి ఇంద్రజాలికులుగా తీర్చిన ప్రొఫెసర్ పట్టాభిరాం పట్టుదలను,నిస్వార్థ సేవను ప్రశంసిస్తున్నాను.

**ఆంధ్ర నాట్య ప్రదర్శనం:**

రాష్ట్ర ప్రభుత్వాస్థాన నాట్యాచార్యులు, భరత కళాప్రపూర్ణులు డాక్టర్ నటరాజ రామకృష్ణ పేరిణి ఇంటర్నేషనల్ పక్షాన ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడెమీ సిద్ధపరచిన పాఠ్యక్రమంపై రూపొందించిన ఆంధ్రదేశ సంప్రదాయ నాట్య రీతులను తమ శిష్యురాండ్ర ద్వారా ఇటీవల రవీంద్రభారతిలో ప్రదర్శించారు. డాక్టర్ రామకృష్ణ ప్రారంభంలో స్వాగతం చెబుతూ, తెలుగునాట నృత్యం మూడు విధాలుగా విలసిల్లిందన్నారు. దేవాలయాలలో దైవపూజలో పూజా నృత్యాలు, ఆలయాల వెలుపల ప్రజాసామాన్యం కోసం భాగవతాలు, రాజా స్థానాలలోను, పండిత గోష్టులలోను కేళికలు ప్రదర్శించేవారు. తెలుగువారిది పూర్తిగా లాస్యసంప్రదాయం. పది సంవత్సరాలుగా శ్రీతన్నీరు పుల్లయ్య గారి సహకారంతో ఒక పాఠ్యక్రమం రచించి, దానిని ఆంధ్రనాట్యంగా ప్రచారం చేయ సంకల్పించాము— అని ఆయన అన్నారు. అధ్యక్షత వహించిన శ్రీ ఎస్ బి. పి. బి. కె సత్యనారాయణ రావు (ఎం. ఎల్. సి.) ప్రసంగిస్తూ నాట్యకళకు శ్రీ నటరాజ రామకృష్ణ చేస్తున్న అపూర్వ సేవను వివరించారు ముఖ్యలతిథి సహాయమంత్రి శ్రీ రామకృష్ణంరాజు ప్రసంగిస్తూ, శ్రీ నటరాజ రామకృష్ణ అంతరించిపోతున్న ఆంధ్రకళారీతులను ఉద్ధరిస్తున్నారని, చిందు, భాగవతం, వీరానాట్యం, వివిధ జానపద రీతులను ప్రదర్శనయోగ్యం చేస్తున్నారని తమ ఆరోగ్యం కూడ లెక్కచేయక కళాసేవ చేస్తున్నారని నటరాజ స్వరూపమే నటరాజ రామకృష్ణ అని అన్నారు బళ్లిపాడులోని నాట్యం డాక్యుమెంటరీగా రూపొందిస్తే, తర్వాతి తరాల వారికి లాభిస్తుందనే దృష్టితో ప్రభుత్వం వీడియో క్యాసెట్లుగా చేస్తుందనిఅన్నారు శ్రీనటరాజరామకృష్ణ శిష్యురాలై, అదిలాబాదులో నాట్య పాటశాల నిర్వహిస్తున్న శ్రీమతి రాఘవకుమారిని ఈసందర్భంలో సన్మానించారు. కుమారికలు డి రాధ, కల్పన, వేణు మాధవి, శుభశ్రీ, సునీత, రవీన పుష్పాంజలి, గణపతి కవచం, శ్రీశైల మల్లికార్జున శబ్దం, మునిపల్లె సుబ్రహ్మణ్యం కవిరచితమైన అధ్యాత్మ రామాయణంలోని అహల్యా శాప విమోచన ఘట్టం, ఎవడే వాడు అనే పదం, ఏకాంత సేవలోని విరిదండ మెడలోన వేయుటే కాని,కన్నార నీమూర్తి కాంచనే లేదు, గీతం, నీలమేఘ శ్యామ తరంగం, తిల్లాన, వేంకటేశ్వరుని ఎరుకసాని ఎరుక అభినయించారు. కుమారి డి రాధ ఎక్కువగా ప్రేక్షకులను ఆకర్షించింది. నీలమేఘ శరీరా తరంగం అభినయంలో ఆమె హావభావ విన్యాసాలు, పదక్రమగతి, గొప్ప భవిష్యత్తును సూచిస్తాయి. కుమారి రమాదేవి కోకిల కంఠ గానం ప్రదర్శనానికి వెన్నెలవెలుగు తెచ్చింది.

**ఉపశ్రుతి・**

సెప్టెంబరు 28న త్యాగరాజ గానసభలో బాలల ఇంద్రజాల ప్రదర్శనం తర్వాత ప్రేక్షకులు గుంపులు గుంపులుగా మాట్లాడుకుంటూ ఇంద్రజాలికుడు పట్టాభి రాంను ప్రశంసిస్తున్నారు శ్రీదేవరాజు రవి(ఫీల్డ్ ఆఫీసరు, అర్బన్ లెప్రసీ కంట్రోల్ ప్రాజెక్టు) పట్టాభిరాంను ఎన్నికలు వస్తున్నాయి ఇలాటి మ్యాజిక్ ఏదో చేసి ఒకపార్టీకివోట్లువచ్చేలా చేయలేరూ? — అనడిగారు "బాగుంది అలా చేసేట్టయితే నేనే ముఖ్య మంత్రి అయి వుందును" అన్నారు పట్టాభిరాం. జ్యోతిషానికి గౌరిశాపంలా ఇంద్రజాలానికీవుంద్గాంఢీ. సొంత లాభానికి వాడుకుంటే బెడిసికొడుతుంది— అన్నారు మరొక ఇంద్రజాలికుడు ★



నెల్లూరులో అక్కినేని జన్మదినోత్సవం నాటి సభలో రెండుసార్లు జాతీయ బహుమతి పొందిన ఏస్. పి. బాలసుబ్రమణ్యం ను సన్మానించిన జిల్లా జాయింటు కలక్టర్ టి. సి. పాండురంగం, నెఫ్జా అధ్యకుడు సుందరరామిరెడ్డి, ఉపన్యసిస్తున్న సినీనటి పూర్ణిమలని చిత్రంలో చూడవచ్చు.

## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

### ప్రతిభని ప్రోత్సహించాలి

"ధర్మోరక్షతి రక్షితః" సీరియల్‌పై విజయకుమార్ గారి విమర్శకు రచయితగారి సమాధానం చదివాను. ఎంతో సముచితంగా వుంది. సమాజంలోని నిజానిజాల్ని వెలికి తీసి చూపడం, చాలిన్నంత మంచి సంస్కారం చూపడం రచయిత బాధ్యత

లొంభై మార్కుల 'తెలివితనం' తెలవారి పోతూండగా నలభై మార్కులే నాణ్యతగా వెలిగి పోయే ఈ రోజుల్లో ఏం చెప్పినా అది అరణ్య రోదనే! ఏ హక్కూ లేని భిక్షగాడు భిక్షం వేయకపోతే బండబూతులు తిడతాడు ఆకలేసి మరి నలభైకి సీటొస్తే తొంభైకి కడుపు కాలదా! కష్టపడ్డ దానికి ఫలితం కాలే కడుపా!కన్నీళ్ళా! అడుక్కుతినే అగ్రవర్ణుడు ఆర్థిక స్తోమత కలవాడి క్రింద జమేనా! కులం అతని కొక శాపమా!

ఈ కాలంలో ఎవరూ అస్పృశ్యులు లేరు. మేమందరం ఒకటే అంటున్నా వినిపించుకోరు వినాయకులు ప్రజల్ని వోట్ల కోసం విభజించి పాలించడమే వారి ధ్యేయం

హరిజన— గిరిజనోద్ధరణకు అగ్రవర్ణాల కడుపు కొట్టడంతో సమస్య తీరదు రిజర్వేషన్ల వల్ల పది శాతం సమస్య కూడా తీరదు ఇన్ని సంవత్సరాల రిజర్వేషన్ల వల్ల సాధించింది అణు మాత్రం ఎందరో షెడ్యూల్ కులాల—తెగలవాళ్ళు పల్లెల్లో దీన—హీన స్థితిలో వున్నారు రిజర్వేషన్లు వారి కందడంలేదు ఇటు అగ్రకులాల వాళ్ళు తమ కష్టానికి ఫలితం లేక నిరాశ—నిస్పృహ లతో కొట్టుమిట్టాడు తున్నారు

ఇక సుపీరియారిటి కాంప్లెక్స్ ఒక్క బ్రాహ్మణులలోనే కాదు డబ్బున్న ప్రతివారిలోనూ వుంది డబ్బులేని సోదర హరిజనుడ్నే తోటి హరిజనుడు నీచంగా చూస్తున్నాడు

రిజర్వేషన్లంటూ వుంటే అది ఆర్థిక స్తోమత పై ఆధారపడాలి మంత్రి కుమారుడికి— కలెక్టరు కూతురికి ఉచిత భోజన— విద్యా సౌకర్యాలు ఖచ్చితంగా అనవసరం నాలుగు వేళ్ళూ ఒకపూటైనా నోట్లోకిపోని అగ్రకులాల వారికి కూడా వుండ నివ్వండి రిజర్వేషన్లు

నిజమైన హరిజన — గిరిజనోద్ధరణ జరగాలంటే మొదట మంత్రులే వివాహాది కార్యాల ద్వారా సంబంధాలు పెంచుకోవాలి దళారీలద్వారా కాక నేరుగా వారికి ఉచిత భోజన, విద్యా సౌకర్యాలు కల్పించాలి వారిలో ప్రతిభను పెంపొందింప చేయాలి ప్రతిభను ఆధారంగా చదువుల్లోను, ఉద్యోగాల్లోను అవకాశాలు కల్పించాలి ఊరి బయట కాక, ఊరిలోపలే యిల్లు కట్టించాలి కులాంతర వివాహాలు చేసుకున్న వారికి మంచి రాయల్టీ యిప్పించాలి చౌడు భూములు కాక మంచి భూము లిప్పించాలి వారి వారి అభిరుచిని బట్టి వారి ప్రతిభను ప్రోత్సహించి దానికి తగ్గ అవకాశాలు కల్పించాలి అంతేగాని కులం ప్రాతిపదికపై డబుల్ —త్రిబుల్ ప్రమోషన్లు యిస్తే వారిలో నిర్లక్ష్య భావం పెరుగుతుంది ప్రతిభ కలవారు గూడా నలభై మార్కులతోనే తృప్తి పడతారు ఇటు తొంభై మార్కుల వాడ తన ప్రతిభకు సరియైన గుర్తింపు లేక నిరాశతో కుమిలిపోతాడు. అటు నిర్లక్ష్యం—ఇటు నిరాశ స్వాపాయిజనై భారతదేశభవిష్యత్తును తప్పక మలిన పరుస్తుంది కొద్ది ఏళ్ళలో!

ఎ. వి. ఎస్. కుమార్ (వాయల్పాడు) ★




...ంతానము గర్భాశయ వ్యాధులు, సెక్స్ ఆంతరంగిక సమస్యలు, స్త్రీ వ్యాధులు, మొలలు, చర్మ వ్యాధులకు అనుభవ చికిత్స. పోష్టుద్వారాకూడా చికిత్స కలదు.

**సరోజ నర్సింగ్ హోమ్,**

డాక్టర్ యన్. సరోజిని, డాక్టర్ వి. మధు
H.O. కొత్తపేట చౌకు, కె. టి. రోడ్,
విజయవాడ—1.
బ్రాంచి: శీలంవారివీధి, జిన్నాటవర్, గుంటూరు.

**నెలకు రు. 1000 సంపాదించండి**

ఎలెక్ట్రిక్ గైడు రు. 10, ఫొటోగ్రఫీ రు. 10, ట్రాన్సిష్టర్ రేడియో గైడు రు. 10, 100 బొమ్మలతో వివాహపు జీవితము రు. 10, 88 బొమ్మలతో మెడికల్ సెక్సు గైడు రు. 10, డ్రాయింగు & పెయింటింగు రు. 10, టైలరింగు & కటింగు గైడు రు. 10, 300 కుటీర పరిశ్రమ గైడు రు. 20, సబ్బు తయారి రు. 10.
అడ్వాన్సుగా ప్రతిఒక్కటికి పోస్టేజి రు. 2.

**LAXMIBOOK CORNER (A.S)**
(M.C.) ALIGARH-36.



నూతన యవ్వనం పొందండి. సంతానవంతులుకండి! చర్మ వ్యాధులనుండివిముక్తులుకండి హస్తప్రయోగమువలనకలుగు నరముల బలహీనత, శీఘ్రస్ఖలనము, అంగముచిన్నదగుట అవసరకాలమందు అసంతృప్తి, సంతానము లేకపోవుట, సమస్తచర్మవ్యాధులకు అద్భుత చికిత్స. పోస్టుద్వారా చికిత్సకలదు ప్రతి ఆదివారము భీమవరంషణ్ముఖలాడ్జి నందు ఉ॥ 9 నుండి సా॥ 6-30 వరకు క్యాంపుకలదు.

**డా॥ డి. మార్కండేయులు**

ఆయుర్వేద భిషక్,
సెక్స్ అండ్ స్కిన్ స్పెషలిస్టు,
పార్కురోడ్డు, గుడివాడ, 521301,
ఫోన్స్: 522 & 540

16 ఏండ్ల వయస్సునకు పైబడినవారు

అధికపక్షము

**ఒక సంవత్సరములో అంగ్లములో**

సంభాషించుటకును, పరిచయముచేసికొనుటకును తపాలా ద్వారా విశ్రాంతి సమయములో

ప్రారంభమునుండి కాని - లక్ష్యలక్షణ పరిశోధన పద్ధతిలో కాని

**ఇంగ్లీషు**

నేర్చుకొనవచ్చును.

మనము ఏది చేసినను నలుగురు నాలుగు విధములుగా మాట్లాడెదరు —అపహసింతురు. లోకులు కాకులు. ఈ నలుగురు సంఘమునందు. విష సర్పము— పిచ్చికుక్క లకన్నా భయంకరులు. కుక్కలు మొరిగినను ఒంటెలపై వర్తకులు తమ దారిన తాము పోవుదురు. (అంగ్ల సామెత) ఆ నలుగురి మాటలను ఏనాడు లెక్కించకుము. ప్రగతికి చేయూత నిచ్చుటకు వేచియున్నది విద్య.

G. SHANMUGASUNDARAM

వాయిదా పద్ధతిలో ప్రతి మాసము జీతము చెల్లించి, మాసమునకు నాలుగు సార్లు పాఠ్య భాగములను పొందవచ్చును. లేదా విశిష్టమైన— అసమానమైన అంగ్లభాషా పాఠ్య భాగము లన్నింటిని ఒకేసారి నేరుగా వచ్చి లేదా రిజిస్టర్డు పోస్టుపార్సలు ద్వారా ఒక మొత్తముగా లేదా భాగ భాగములుగా పొందవచ్చును. ఈ విధముగా చేయువారు కూడ తపాలా ద్వారా చదువు విద్యార్థులుగానే భావింపబడెదరు.

INDIAN INSTITUTE OF ENGLISH STUDIES

**భారతీయ ఆంగ్లభాషా బోధకసంస్థ**

ప్లాట్ నెం. 76, భాస్కర్ కాలనీ,
విరుగంబాకం, మదరాసు 600092




పూర్తి వివరములు గల పుస్తకమునకు (Prospectus రూ. 3/-) పైనివ్వబడిన విలాసమునకు వెంటనే మనియార్డరు చేయవలెను



**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**

**సరికొత్తది! ఇన్‌స్టెంట్ నెస్‌ప్రే**

# 5-క్షణాలలో పాలు

## వేయండి, కలపండి, ఇక ఇవ్వండి అంతే

**తయారు చేయడం ఎంతో సులభం**

ఒక గ్లాసు చల్లని లేక వెచ్చని నీటిలో 3 చెంచాల ఇన్‌స్టెంట్ నెస్‌ప్రే వేయండి. కలపండి. 5 క్షణాలలో మీ కోసం ఒక గ్లాసు పాలు సిద్ధంగా వుంటాయి.

**మంచి పోషకాహారము**

ఇన్‌స్టెంట్ నెస్‌ప్రే 'ఏ' మరియు 'డి' విటమిన్లతో ప్రత్యేకమైన శక్తి కలిగి వుంది. ఇవి, పెరుగుతున్న పాపలకి విలువైన, మీగడతో వున్న, రుచికరమైన పాలు.




## చన్నీళ్ళలో కూడా తక్షణం కరుగుతుంది

CAS/243 TEL

